







# బాలల భారతదేశ చరిత్ర



శీలాధర్

పబ్లికేషన్స్ డివిజన్

# బాలల భారతదేశ చరిత్ర

షీలాధర్



పబ్లికేషన్స్ డివిజన్
సమాచార, ప్రసార మంత్రిత్వశాఖ
భారత ప్రభుత్వం

ప్రథమ ప్రచురణ 1966 (శక 1888)
ద్వితీయ ప్రచురణ 2000 (శక 1921)
First Edition 1966 (1888 Saka)
Second Edition 2000 (1922 Saka)



BAALALA BHARATADESA CHARITRA (Telugu)

ISBN : 81- 230-0934-8

**Price : Rs.** 146.00

ప్రచురణ: డైరెక్టర్, పబ్లికేషన్స్ డివిజన్, సమాచార ప్రసార మంత్రిత్వశాఖ, భారత ప్రభుత్వం, పటియాలా హౌస్, న్యూఢిల్లీ 110 001.

**విక్రయ కేంద్రాలు • పబ్లికేషన్స్ డివిజన్**

- పటియాలా హౌస్, తిలక్ మార్గ్, న్యూ ఢిల్లీ 110 001
- సూపర్‌బజార్, కన్నాట్ సర్కస్, న్యూ ఢిల్లీ 110 001
- కామర్స్ హౌస్, కరింభాయ్ రోడ్, బల్లార్డ్ పియర్, ముంబాయి 400 038
- 8,ఎస్‌ప్లనేడ్ ఈస్ట్, కలకత్తా 700 002
- రాజాజీ భవన్, 'ఎ' వింగ్, 'ఎఫ్' బ్లాక్, గ్రౌండ్ ఫ్లోర్, బసంత్‌నగర్, చెన్నయ్ 600 090
- బీహార్ స్టేట్ కో ఆపరేటివ్ బ్యాంక్ బిల్డింగ్, అశోక్ రాజ్‌పథ్, పట్నా 800 004
- ప్రెస్ రోడ్, గవర్నమెంట్ ప్రెస్ దగ్గర, తిరువనంతపురం 695 001
- 27/6, రామ మోహనరాయ్ మార్గ్, లక్నో 226 001
- స్టేట్ ఆర్కియలాజికల్ మ్యూజియం బిల్డింగ్, పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి, హైదరాబాదు 500 004
- ఫస్ట్ ఫ్లోర్, 'ఎఫ్' వింగ్, కేంద్రీయ సదన్, కోరమంగళ, బెంగళూరు 560 034

**• సేల్స్ కౌంటర్లు**

- కేర్ ఆఫ్ ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో, సి.జి.ఓ. కాంప్లెక్స్, ఎ వింగ్, ఇందోర్ (మధ్యప్రదేశ్)
- కేర్ ఆఫ్ ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో, మాలవ్యా నగర్, భోపాల్ 462 003 (మధ్యప్రదేశ్)
- కేర్ ఆఫ్ ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో, బి 7బి, భవానీ సింగ్ మార్గ్, జైపూర్ 320 001 (రాజస్థాన్)

---

BAALALA BHARATADESA CHARITRA (Telugu) Translated from Sheila Dhar's CHILDREN'S HISTORY OF INDIA (English) Publications Division, 1966.

*Printed at : Akashdeep Printers, 20, Ansari Road, Darya Ganj, New Delhi-2.*

# పరిచయం

*ఈ చిన్న చరిత్ర పుస్తకం చదివి చూశాను; నాకు ఈ పుస్తకం నచ్చింది. భారత దేశ చరిత్రపై మంచి పుస్తకాలు, ముఖ్యంగా పిల్లలకు పనికి వచ్చేవి, మన దేశంలో చాలా తక్కువ. ఆ లోపాన్ని ఇది చక్కగా తీర్చింది. రచయిత ఉపయోగించిన భాష బాలబాలికలకు తగినట్లు సరళంగా ఉంది.*

*1960, ఆగస్టు 1*
*న్యూఢిల్లీ.* (సం.) జవహార్ లాల్ నెహ్రూ

# పీఠిక

భారతదేశచరిత్రలో చిన్న పిల్లలకు ప్రవేశం కలిగించడానికి వ్రాసిన పుస్తకం ఇది. ముఖ్యంగా 9 మొదలు 14 ఏళ్ల వయస్సుగల బడి పిల్లలను ఉద్దేశించి దీనిని వ్రాయడం జరిగింది. భారత దేశ చరిత్రను సమగ్రంగా తెలియజేయాలనిగాక, స్వయంగా దానిని చదివి తెలుసుకోవాలనే ఆసక్తిని పిల్లలలో రేకెత్తించడమే ఈ పుస్తకం వ్రాయడంలో మా ముఖ్యమైన ఉద్దేశం. అందుకని పిల్లలకు మన దేశ చరిత్రను కథలాగా చెప్పాలని మాత్రమే దీనిలో ప్రయత్నించడం జరిగింది. వీలైనంత సరళమైన భాషను ఉపయోగిస్తూ, చివరిదాకా తేదీలు ఇవ్వకుండా, పేర్లుకూడా వీలయినంత తక్కువగానే ఇచ్చి, ఈ పుస్తకాన్ని సులభ పరిచాము. అయితే మన చరిత్రలో జరిగిన ముఖ్య సంఘటనలను అన్నిటినీ వరుస తప్పకుండా ఒక క్రమంలో ఇచ్చాము. అసలు తారీకులు అంటే ఏమిటో, చరిత్రలో వాటి ప్రాముఖ్యం ఏమిటో వివరించడానికి పుస్తకం చివర బొమ్మలతో పటం కూడా ఒకటి చేర్చాము.

ఇంగ్లీషులో ఈ పుస్తకం వ్రాత ప్రతిని చదివి అనేక ముఖ్యమైన సూచనలు చేసినందుకు డాక్టర్ తారాచంద్, ప్రొఫెసర్ హుమాయూన్ కబీర్, శ్రీ ఆర్.పి. నాయక్‌లకు మా కృతజ్ఞతాభివందనలు.

# విషయసూచి

# ఊహకందని యుగాలు

మీరంతా చిన్న పిల్లలు. మీరు పుట్టటానికి ముందు ఒకప్పుడు మీ తల్లులు కూడా మీలాగానే పసిపిల్లలుగా ఉండేవారు. వెనుక ఇంకా చాలా ఏళ్ళ క్రిందట మీ అమ్మా, మీ బామ్మా, మీ బామ్మ అమ్మా అసలు పుట్టి కూడా ఉండరుకదూ! మరైతే నీ వయస్సెంత? పదో, పన్నెండో ఉంటుంది. అంటే మీ అమ్మగారు బహుశా ఇప్పుడు ముప్పయ్యో పడిలో ఉంటారేమో. ఇక ఆమె తల్లి అంటే మీ అమ్మమ్మగారి వయస్సు 50 ఏళ్ళు దాటి ఉండాలి; అవునా? సరేగానీ, మరి నూరేళ్లు అంటే ఎంత ఉంటుందో ఊహించుకోగలవా? అబ్బా! వంద ఏళ్ళే! మనుషులెవ్వరూ మామూలుగా నూరేళ్ళకంటె ఎక్కువ కాలం జీవించరు. అయితే మనుషులమైన మనకన్నా దేశాలూ, ఖండాలు ఎంతోకాలం నిలిచి ఉంటాయి. మనుషులలో లాగానే దేశాలలోనూ కొన్ని బాగా చిన్నవీ, కొన్ని ముసలివీ ఉన్నాయి. ఇప్పుడు మనం నివసిస్తున్న ఈ భారతదేశం ప్రపంచంలో ఉన్న మిక్కిలి ప్రాచీనమైన దేశాలలో ఒకటి. మరి మన భారతదేశం వయస్సు నన్ను చెప్పమంటావా? అనేక వేల సంవత్సరాలు ఉంటుంది. వేల సంవత్సరాలు అంటే ఆశ్చర్యంగా ఉంది కదూ నీకు!

భారతదేశంలో వేలాది సంవత్సరాల నుంచీ ఎందరో ప్రజలు నివసిస్తున్నారు. ఇక్కడ దాదాపు 6,000 ఏళ్ళ క్రిందట నివసించిన వారిని గురించి కూడా అనేక విషయాలు మనకు ఇప్పుడు తెలుసు. అప్పటివారు ఏవిధంగా నివసించేవారో, ఏమేమి చేస్తూ ఉండేవారో చాలావరకు ఆరా తీయగలిగాము. ఏదైనా ఇంద్రజాలం వల్ల ఇప్పుడు మీరు ఉన్న వశంగా ఆ కాలంనాటి పిల్లలను చూడగలిగితే వాళ్ళకూ, మీకూ బహుశా తేడా ఏమీ కనిపించకపోవచ్చు. ఇది చిత్రం కదూ! పెరిగి పెద్దదైన నేటి మన భారతజాతి ప్రపంచ చరిత్ర ప్రారంభంలోనే పుట్టింది. దాదాపు 6,000 సంవత్సరాల ఇతిహాసం ఉంది మనకు. నిజానికి ఇంత ప్రాచీనమైన దేశాలు ప్రపంచంలోనే చాలా తక్కువ.

ఇంద్ర ధనస్సును మీరు తప్పకుండా చూసే ఉంటారు. అయితే దానిలో ఎన్ని రంగులున్నాయో ఎప్పుడైనా లెక్క పెట్టారా? దాంట్లో అనేక వన్నెలు చిన్నెలు ఉంటాయి.

ఆ రంగులన్నీ ఇంద్ర ధనస్సులో భాగాలే కానీ వాటిని వేటికవిగా వేరు చేయడానికి వీలు లేదు. మన భారతదేశం కూడా ఒక విధంగా హరివిల్లు వంటిదే. వేర్వేరు కాలాల్లో రకరకాల జాతుల ప్రజలు మన దేశానికి వచ్చారు. ఆర్యులూ, తరువాత మధ్య ఆసియా, మంగోలియా, ఇంకా ఇతర దేశాల ప్రజలూ, ఒకరి వెంట ఒకరు అలల మాదిరిగా రాసాగారు. కొందరు మన దేశాన్ని జయించడానికి వచ్చారు. ఇక్కడ అప్పటికే స్థిరపడి ఉన్నవారికీ, కొత్తగా వచ్చిన వారికీ యుద్ధాలు జరిగాయి. దేశ సంచారం చేసి విశేషాలు చూద్దామని ఇక్కడికి వచ్చిన పరాయివారూ ఉన్నారు. మన దేశంలోని గొప్ప గొప్ప విద్యా పీఠాలలో చదువుకుందామని మరి కొందరు వచ్చారు. కాగా ఈ దేశంలో స్థిరపడి పోదామని వచ్చినవారందరినీ ఇక్కడి ప్రజలు తమలో కలిపివేసుకున్నారు. కొత్తవారి ఆచారాలు, వ్యవహారాలు పాతబడి మెల్లగా వారూ వీరూ పూర్తిగా కలసిపోయారు. వెలుపలి నుంచి వచ్చిన ప్రజలు కూడా తమ కొత్త పరిసరాలలో అతికిపోవడం నేర్చుకున్నారు. ఇలా యుగయుగాలుగా మళ్ళీ మళ్ళీ కొత్త జాతుల ప్రజలు రావడం, వారూ వీరూ ఏకమైపోవడం జరుగుతూ వచ్చింది. ఈ విధంగా రూపొందిన భారత జాతి పడుగు పేకలవలె అల్లుకుపోయిన వేర్వేరు జాతుల సమ్మేళనం, విడదీయరాని రంగు రంగుల ఇంద్రచాపం.

అయితే ఇదంతా ఒక్క రోజులో జరిగిన ఉదంతం కాదు. ఇది పూర్తి కావడానికి ఎన్నో వేల సంవత్సరాలు పట్టింది. వేల సంవత్సరాలు అంటే ఊహించడానికి అలవి కానంత కాలం కదూ! ఇంత ప్రాచీన కాలాన్ని గురించి కూడా ఊహించి నాటి పరిస్థితులను కళ్ళ ముందు కట్టించడానికి వ్రాసే పుస్తకాలే చరిత్ర. చరిత్ర అంటే ఒక పెద్ద కాశీ మజిలీ కథలాంటిది. అయితే మామూలు కల్పనా కథలోవలె దేవతలు, దయ్యాలు, మహిమలు, మంత్రాలను గురించికాక ఈ ప్రపంచంలో సాక్షాత్తుగా బతికి బట్టకట్టిన మానవులను, వారి కష్ట సుఖాలను గురించే చరిత్ర వివరిస్తుంది. వీలైనంత వాస్తవంగా జరిగింది జరిగినట్లుగా చెప్పడానికి ప్రయత్నించేదే చరిత్ర.

భారతజాతి ఇతిహాసం నిజంగా అద్భుతమైనది. దీనిని మీరంతా తెలుసుకోవాలి. ఈ దేశంలో పెక్కుమంది మహాపురుషులు, స్త్రీలు జన్మించారు. ఒకవిధంగా వీరి అందరి ఘనతా మీదే అవుతుంది. ఇలాంటి మహాపురుషుల సంతతివారమేసుమా మేము అని చెప్పుకొని మీరంతా గర్వపడవచ్చు. అయితే మన చరిత్రలో అన్నీ గర్వించదగిన విషయాలే

ఉన్నాయనుకోకండి. కొన్ని సిగ్గుపడవలసిన అంశాలూ లేకపోలేదు. వీటిని గురించి కూడా తెలుసుకోవడం అవసరం. నిన్ను గురించి నీవు సరిగా తెలుసుకోవాలంటే, నీ గత చరిత్రనంతా అందులో ఉన్న మంచీ, చెడూ రెండూ తెలుసుకోవాలిగదా!

అయితే కథ ఏదైనా మంచిది వినాలనుకున్నప్పుడు ''అనగనగా'' దగ్గర మొదలుపెట్టి కథ కంచికి వెళ్లే దాకా వినాలని ఉంటుంది కదూ నీకు! అవునా?

# భూగర్భంలో కలిసిపోయిన భూతకాలం

మనం ఈ కథ చెప్పడం మొదలు పెడుతూనే, మొట్ట మొదట ఎత్తుకునే విషయం ఇండియా - కన్న తల్లినిలా మనమంతా ప్రేమించే భారతదేశం. అటు సాధారణ ప్రజానీకం, ఈ గడ్డ మీద అవతరించిన మహనీయులు, వీరులైన రాజులు, చక్రవర్తులు, భక్తులు, యోగులు అంతా ఈ భరత ఖండాన్ని ప్రేమించి దానిని తమ స్వగృహంగా పరిగణించారు.

పెద్దవారయ్యాక మీరు కూడా స్వయంగా పర్యటన చేసి దేశం నాలుగుమూలలూ కలయ చూస్తారు. అంతదాకా మీ బడిలో గోడ మీద వేలాడే భారతదేశ పటాన్ని పరీక్షించి ఎక్కడ ఏమున్నదీ తెలుసుకుంటూ ఉండండి.

భారత్ ఒక పెద్ద త్రిభుజం ఆకారంలో ఉంది. ఉత్తరాన ఉన్న హిమాలయ పర్వతాలు దీనిలో ఒక భుజం. అరేబియా సముద్రానికి చెలియలి కట్టగా ఉన్న పడమటి కోస్తా, బంగాళాఖాతాన్ని స్పృశించే తూర్పు తీరం ఈ త్రికోణానికి తక్కిన భుజాలు. సరిగ్గా హిమాలయాలకు దిగువన సారవంతమైన మాగాణాలున్నాయి. ఈ మైదానపు భూముల గుండా ఇండస్ (సింధు), గంగ, బ్రహ్మపుత్ర అనే బ్రహ్మాండమైన మూడు నదులు ప్రవహిస్తూ ఉన్నాయి. మన దేశానికి హిందూ దేశమనే పేరు ఈ 'ఇండస్' నది నుండే వచ్చింది. దీనినే సింధునది అని కూడా పిలుస్తారు. మన దేశ చరిత్రతో ఈ నదికి చాలా దగ్గర సంబంధం ఉంది. కాని ఈ నది ప్రవహించే భూమిలో కొంత భాగం భారత్ నుంచి కొంత కాలం క్రిందట వేరుపడి పోయింది. ఆ ప్రాంతం పేరే పాకిస్థాన్. దేశానికి నట్టనడుమ తూర్పు నుంచి పడమరగా వ్యాపించి ఉన్న వింధ్య పర్వత శ్రేణి ఉత్తర దక్షిణ ప్రాంతాలను వేరు చేస్తోంది. వింధ్య పర్వతాలకు దక్షిణంగా నర్మద, తపతి, మహానది, గోదావరి, కృష్ణ, కావేరి అనే గొప్ప నదులున్నాయి. భారత దేశానికి దక్షిణపు అంచున ఉన్న అగ్రాన్ని కన్యాకుమారి అంటారు. దానికావల హిందూ మహాసముద్రం.

ఓడలు నిర్మించడమెలాగో తెలియని రోజుల్లో భారత్‌కు రావాలంటే ఉత్తరాన ఉన్న హిమాలయ పర్వతశ్రేణిగుండానే ప్రవేశించవలసి వచ్చేది. కాని హిమాలయాలు ప్రపంచంలో

ఉన్న పర్వతాలలోకెల్లా అత్యున్నతమైనవని మీరు ఎరిగినదే. వాటిని దాటటం మాటలు కాదు. అయితే ఈ పర్వతశ్రేణిలో అక్కడక్కడ కొన్ని చిన్నచిన్న ఇరుకు దారులు, కనుమలనేవి ఉన్నాయి. భారతదేశంలోకి అడపా దడపా ప్రవేశిస్తూ వచ్చిన ఆయా జాతుల ప్రజలు ఈ కనుమల గుండానే రావడం జరిగింది. హిమాలయ పర్వతాలుగనుక లేకపోయి ఉంటే, భారతదేశ చరిత్ర బహుశా మరో విధంగా సాగి ఉండేదేమో!

అటు హిమాలయ పర్వతాలు, ఇటు సముద్రాలు మన దేశానికి ప్రకృతి పెట్టిన పెద్ద సరిహద్దులు. ఇవి అన్నీ కలిసి భారతావనిని యుగయుగాలుగా ఏకఖండంగా నిలిపి ఉంచాయి. ఎంతో విశాలమైనది మనదేశం. అయినా అది ఇంతకాలం ఏకఖండంగా నిలిచి ఉందీ అంటే ఆశ్చర్యం కదూ! భారత్‌లో రకరకాల శీతోష్ణ స్థితిగతులు వేరు వేరైన నైసర్గిక పరిస్థితులు కానవస్తాయి. భిన్నభిన్న భాషలు మాట్లాడుతూ, వేర్వేరు రకాల దుస్తులు ధరించి, పలువిధాల ఆహార పదార్థాలు భుజించే అనేక తరగతుల ప్రజలు ఈ దేశంలో నివసిస్తున్నారు. దూరదేశాల నుంచి చాలాకాలం క్రిందట ఇక్కడికివచ్చి స్థిరపడ్డ ప్రజలు అనేకమంది ఈ దేశంలో ఉన్నారు. వీరు ఎంతకాలం కిందట ఇక్కడికి తరలివచ్చిందీ నిశ్చింతగా చెప్పడం కష్టం.

అయితే ఇంత పూర్వకాలం క్రిందట జరిగిన సంగతులు మనకు ఎలా తెలిశాయి? పూర్వకాల పుస్తకాలు, పాటలు, చిత్రాలు, ఇళ్లు, దేవాలయాలవంటి కట్టడాలను పరీక్షగా



మొహెంజోదారో ప్రజలు ఇటుకలతో చక్కటి ఇళ్లు కట్టుకున్నారు

చూసి ఇలాంటి విశేషాలెన్నో తెలుసుకోవచ్చు. వెనకటి రోజుల్లో సామాన్యులు, మోతుబరులు ఎలా జీవించిందీ ఊహించడానికి మనకు ఇవి తోడ్పడుతాయి. కాని ఇప్పుడు అలాంటి పుస్తకాలు, వగైరా ఎక్కువగా మిగిలిలేవు. ఎందుకంటే రాసిన పుస్తకాలు పాతపడి చిరిగిపోతాయి. చెదలుబట్టి నుగ్గు అయిపోతాయి. పూర్వం ప్రచారంలో ఉన్న పాటలను క్రమేణా మరచిపోవడం జరుగుతుంది. కట్టడాలు శిథిలమైపోతాయి. ఆఖరికి బండరాళ్ళ మీద చెక్కిన శిలాక్షరాలుకూడా ఎండావానా తగిలి క్రమంగా చెరిగిపోతాయి. అంతేకాదు. ఇంకా చాలాకాలం వెనక్కిపోతే, పుస్తకాలు రాయడమూ ఆలయాలు కట్టడమూ జనానికి తెలిసి ఉండని రోజులు కూడా ఉంటాయి. అలాంటప్పుడు ఆ కాలంవారు వాడుకున్న కుండలు, తప్పేలాలు, తొడుక్కొన్న గాజులు, పూసలు, జంతువులను వేటాడడానికి వారుపయోగించిన సూదిమొనరాళ్ళు ఇలాంటి వాటిని భూగర్భంలోంచి త్రవ్వి బయటకు తీస్తారు. వాటిని జాగ్రత్తగా పరిశీలించి నాటి ప్రజలు ఎలా జీవించేవారో, వారి ఆచార వ్యవహారాలు ఏమిటో శాస్త్రవేత్తలు ఊహించగలుగుతారు. కొన్ని ప్రాంతాలలో ఇలా తవ్వకాలు సాగించగా శిథిలమైన పెద్ద పెద్ద నగరాలు అనేకం బయటపడ్డాయి. ఈ నగరాలు ఏ వరద ముంపులోనో లేక ఏ అగ్ని ప్రమాదంలోనో నేలమట్టమై పోయాయి. ఇప్పుడు పాకిస్థాన్‌లో చేరిన సింధులో 40 ఏళ్ళ క్రిందట ఇలాంటి పురాతన నగరమే ఒకటి బయటపడింది. ఈ నగరం కనిపించిన ప్రాంతాన్ని ఆ చుట్టు పక్కల నివసించే గ్రామీణులు 'మొహాంజోదారో' అని పిలిచేవారు. ఈ పదానికి అర్థం 'పీనుగుల దిబ్బ' అని. ఈ దిబ్బను తవ్వి చూడగా దాని కింద 6,000 ఏళ్ళ నాటి అతి పురాతన నగరం ఒకటి కనిపించింది.

మొహాంజోదారోలో కనిపించిన వస్తువులను పరిక్షించగా అక్కడ నివసించిన ప్రజలకు ఇటుకలు చేయడం చేతనవునని, వాటితో వారు కుదుమట్టంగా చక్కని ఇళ్లు కూడా కట్టుకొనేవారని తెలిసింది. పెద్ద పెద్ద నగరాల నిర్మాణానికి వారు ప్లాన్లు తయారు చేసుకొని, వాటి ప్రకారం పట్టణాలను కట్టుకొనేవారు. మురుగు నీరు పోయేందుకు వరుసగా పెద్ద గొట్టాలు వేసి నగరాలను పరిశుభ్రంగా ఉంచుకునేవారు. ప్రజలు స్నానాలు చేసేందుకు బారకాసుల్లాంటి ఉమ్మడి స్నానాలగదులను అక్కడక్కడా కట్టేవారు. రథాలు, ఎద్దు బండ్లు నడిచేందుకు విశాలమైన రహదారులు నిర్మించుకున్నారు. వారిలో నేర్పరులైన వృత్తి పనివారు కూడా ఉన్నట్టు తెలుస్తోంది. ఏమంటే, చూడ ముచ్చటైన చక్కని మట్టికుండలు, రాగితో, కంచుతో చేసిన రకరకాల ఆయుధాలు ఆ నగరంలో కనిపించాయి. అక్కడ దొరికిన

కుండలమీద, ముద్రికల మీదా చక్కని దేవతల బొమ్మలు, జంతువుల బొమ్మలు చిత్రించి ఉన్నాయి. ఈ చిత్రాలనుబట్టి ఆనాటి ప్రజలకు ఏయే రకాల జంతువులు తెలుసునో ఊహించవచ్చు. ఏఏ దేవతలను వారు పూజించేవారో, ఏ విధమైన లిపిని వాడేవారో గ్రహించవచ్చు. వారు మెడలో వేసుకునే పూసల పేర్లు, బంగారంతో, దంతంతో చెక్కిన వారి ఆభరణాలను చూస్తే అందమైన వస్తువుల మీద వారికి ఎంత మక్కువ ఉన్నదీ బోధపడుతుంది. అలాంటి వస్తువులను వారు స్వయంగా తయారు చేసుకునేవారు. పత్తితో నూలువడికి గుడ్డలు నేసుకొనేవారు. మాతృదేవతగా కొలిచే ఒక ఈశ్వరి, శివుని పోలిన ఒక భగవంతుడు వారికి ఇష్టదేవతలు. పోతే ఆనాటి వారికి చదువనూ, వ్రాయనూ కూడా వచ్చు. కాని వారు వ్రాసిన వ్రాతలు మాత్రం మనకింకా దుర్భేద్యంగానే ఉండిపోయాయి.

సింధు ప్రాంతం ఈనాడు చాలవరకూ అనావృష్టికి గురియై, సారంలేని పర్రగా ఉంది. కాని కొన్ని వేల ఏళ్ల క్రిందట ఈ ప్రాంతం పచ్చని సుక్షేత్రమైన మాగాణం. ఈ సంగతి ఇప్పుడు ఎలా కనుక్కోగలిగారా అని మీకు ఆశ్చర్యం కలుగవచ్చు. చెబుతా వినండి. మొహెంజోదారోలో దొరికిన ముద్రికల మీద సింహము, పెద్దపులి, ఖడ్గమృగము, ఏనుగు వంటి జంతువుల చిత్రాలు ఉన్నాయి. ఇలాంటి జంతువులు పెద్ద పెద్ద అడవులలోనేగాని, మరెక్కడా నివసించవుగదా! మరి సింధు ప్రాంతంలో ఆ కాలంలో భారీగా వర్షాలు కురవకుండా ఉంటే ఇలాంటి జంతుజాలానికి అనువైన చిక్కని అడవులు అక్కడ పెరిగేందుకే ఆస్కారం ఉండేది కాదు. కనుకనే సింధు ప్రాంతం ఒకప్పుడు పచ్చని మాగాణంగా ఉండేదని శాస్త్రజ్ఞులు తేల్చారు. ఈ విషయం ఊహించడానికి వేరే ఆధారం ఇంకా ఏమి కావాలి గనక!

మొహెంజోదారో వంటి మరికొన్ని ఇతర నగరాలు కూడా అక్కడక్కడా బయటపడ్డాయి. పశ్చిమ పంజాబులో కనిపించిన హరప్పా ఇలాంటి వాటిలో ఒకటి. ఆ కాలం నాటి పట్టణాలలో అనేకం సింధు (ఇండస్) నది వెంట నిర్మించినవే, కనుకనే ఆ పట్టణాలలో నివసించిన ప్రజలను సింధులోయ ప్రజలని పిలువడం కద్దు. కాని ఈ సింధులోయ పట్టణాల కోవకు చెందిన నగరాలు కొన్ని సింధు, పంజాబు ప్రాంతాలను కూడా దాటి ఎంతో దూరం ఆవలకు వ్యాపించాయి. చివరికి గుజరాత్‌లో లోథాల్ వద్ద కూడా ఆ మధ్య ఇలాంటి పట్టణం ఒకటి బయటపడింది. ఈ పట్టణాలలో నివసించిన ప్రజలు దూరదేశాలతో కూడా వాణిజ్య వ్యాపారాలు సాగించేవారు.

శిథిలమైపోయిన ఈ పురాతాన నగరాలలో బయటపడ్డ చిళ్ళ పెంకులు, రాగిముక్కలు చూసి ఇంతగా మనమిప్పుడు అబ్బుర పడటం దేనికని అనిపించవచ్చు. కాని ఎప్పుడో 6,000 ఏళ్ళ క్రిందట కూడా ఖనిజాలను తవ్వి వాటిలోంచి లోహాలను తీయడమెలాగో నాటి ప్రజలకు తెలుసునంటే, అలా తీసిన లోహాలను కోరిన రూపంలో మలచడం కూడా వారు నేర్చుకొన్నారంటే, అది ఎంత అద్భుతమైన సంగతి! పత్తితో సన్నని నూలు వడికి బట్ట నేయడం కూడా ఆ రోజుల్లో సామాన్యమా? సరిగా అదే కాలంలో ఇతర దేశాలలో నివసించిన ప్రజలు ఇంకా అడవి మనుషులుగానే జీవిస్తూ, ఆకు అలములు తింటూ ఉండే వారని చెబితే ఇది ఎంత గొప్ప విషయమో మీకే అర్థమవుతుంది. ఇతర దేశాలలో ఆ కాలంలో నివసించిన మనుషులు కొండ గుహలలో నిద్రపోయేవారు. వారికి ఇళ్ళు, వాకిళ్ళు ఉండేవికావు. వంటి పైన బట్ట ఉండేదికాదు; బట్టలకు బదులు జంతువుల చర్మాలను మొలకు చుట్టుకొనేవారు. కర్రతో చేసిన పిడులకు పదునైన రాళ్లను తాపడం చేసి, వాటితో జంతువులను వేటాడేవారు. మట్టిలోంచి లోహం తీసి దానిని ఎలా వాడుకోవాలో వారికి తెలియదు, జంతువులను చంపి పచ్చి మాంసాన్నే తినేవారు. అడవిలో కాసిన పళ్ళు, కాయలు ఆరగించేవారు. ఒక చోట స్థిరనివాసం లేకుండా కొండలలో కోనలలో తిరుగాడుతూ ఉండేవారు. కనుక మనదేశంలో అతి పూర్వకాలంలోనే మనుషులు ఇంత నేర్పరులుగా ప్రజ్ఞావంతులుగా ఉండేవారంటే నిజంగా గర్వించదగిన విషయమే కదా!

# ఆర్యులు, వేదాలు

ప్రాచీన కాలపు చరిత్రను తెలుసుకోవడానికి ఆ కాలం నాటి పుస్తకాలను పరిశీలించడం ఒక సాధనమని ఇది వరకే చెప్పి ఉన్నాము. భారత్‌లోనే కాక బహుశా ప్రపంచం మొత్తం మీదనే అతిపురాతనమైన అమూల్య రచనలు వేదాలు. పూర్వకాలంవారు దేవతలను ఎలా పూజించేవారో తెలుసుకోవడానికి మాత్రమే కాక ఋషుల జ్ఞానసంపదకు పెన్నిధులు కావడంవల్ల కూడా వేదాలకు ఎంతో ప్రాముఖ్యం ఉంది. యుగయుగాలుగా వేదాలను మన ప్రజలు పవిత్ర గ్రంథాలుగా పూజిస్తూ వచ్చారు. సృష్టి రహస్యాలను విడమరచి తెలుసుకోనడానికి, అకళంకమైన జీవితం గడపడానికి వేదాలు మానవులకు దారి చూపుతాయి.

వేదాలు నాలుగు - ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదం. దేవతలను స్తుతించే ఋక్కులతో, త్యాగ సత్కర్మ ఉపాసనాదుల ద్వారా దేవతలను ఎలా సంతుష్టిపరచవచ్చునో బోధించే సూక్తాలతో వేదాలు కూర్చబడి ఉన్నాయి. వేదాలలో స్తోత్రం చేసే దేవతలు - తేజోనిధి అయిన సూర్యుడు; ఉరుములకు, వర్షాలకు అధి దేవతయైన ఇంద్రుడు; అగ్ని; ఆకాశానికి అధిపతియైన వరుణుడు; సర్వ సృష్టికి అధినేత అయిన ప్రజాపతి. వేరువేరు నామాలతో దేవతలను వ్యవహరించినా నిజానికి భగవంతుడు ఒక్కడే అన్న సత్యాన్ని నాటడమే వేదాల ధ్యేయం. ప్రపంచంలో ఉన్న సకల జీవరాసులు ఈశ్వరునిలో అంశమేనని, దివ్యజ్ఞాన సంపూర్ణులు కావడమే మానవుల పరమధర్మమని వేదాలు బోధిస్తున్నాయి. జీవిలో ఉన్న ఆత్మ అనేక జన్మలు ఎత్తి తగినంత పుణ్యం చేసుకోగానే మోక్షాన్ని పొందుతుందని కూడా వేదాలు చెబుతున్నాయి. వేదాలలో మకుటాయమానమైన ఋక్కు ఒకటి ఉంది. ''అనృతంలోంచి సత్యానికి, తమస్సులోంచీ వెలుగులోకి, మృత్యువు నుంచి అమరత్వానికి మమ్ము నడిపించుకొనిపో ప్రభూ!'' అని ఈ ప్రార్థన సారాంశం. ధర్మ నిర్వహణ ద్వారా, అంటే కర్తవ్యాన్ని నెరవేర్చడం ద్వారా, తపస్సు అనగా జ్ఞానసాధన ద్వారా మోక్షాన్ని పొందవచ్చు. సత్పురుషుడు సుఖదుఃఖాల పట్ల సముడై, క్రోధ లోభాలను జయించి, సత్యాన్నే ఎల్లప్పుడూ అన్వేషించాలి.

వేదాలలోని శ్లోకాలు అతిలోక రమణీయమైనవి. దిక్కులను వెలిగించే సంధ్యా సౌందర్యాన్ని, సృష్టి అద్భుతాన్ని, అరణ్యాల శోభను హృదయంగమంగా వర్ణించే ఋక్కులను ఇందుకు తార్కాణాలుగా పేర్కొనవచ్చు. వేదాలలో నిబిడమై ఉన్న అర్థాన్ని విప్పిచెప్పేవి ఉపనిషత్తులు. సత్యాన్ని అన్వేషిస్తూ, తాము నేర్చినదానిని శిష్యులకు బోధిస్తూ, వనవాటికలలో, గురుకులాలలో జీవితాలు గడిపిన మహర్షులు ఈ ఉపనిషత్తులను రచించారు. వేదాలు, ఉపనిషత్తులు సంస్కృతంలో ఉన్నాయి. మొదట ఈ గ్రంథాలు పత్రాల మీద వ్రాసినవికావు. తండ్రి కొడుకుకు, గురువు శిష్యునికి, పరంపరాగతంగా వేదాలను, ఉపనిషత్తులను ముఖతః బోధించేవారు. ఆ తరువాత ఎంతో కాలానికి వాటిని సంకలనం చేసి గ్రంథాలలో అక్షరబద్ధం చేయడం జరిగింది.

వేదాలు, ఉపనిషత్తులు సంస్కృతంలో ఉన్నాయని బహుశా మీకు తెలిసే ఉంటుంది. తమను ఆర్యులుగా చెప్పుకున్నవారి భాష సంస్కృతం. ఆర్యులు ఎక్కడి నుంచి వచ్చారో ఇదమిద్ధంగా మనకు తెలియదు. వారి తొలి నివాసం మధ్య ఆసియాగాని లేక ఐరోపాగాని కావచ్చు. తమ స్త్రీలు, బిడ్డ పాప, గుర్రాలు, గొడ్డు, గోదలతో బహుశా వారు మరింత వాసయోగ్యమైన ప్రాంతాలను అన్వేషిస్తూ పర్వత శ్రేణులను దాటి భారత్‌లోకి ప్రవేశించి ఉండవచ్చు. ఆర్యులు వచ్చే నాటికి భారత్‌లో అప్పటికే ప్రజలు నివశిస్తున్నారు. సింధులోయలో సంస్కృతం తెలియని వారు ఉండేవారు. గంగ, యమునలోయలలో కూడా ప్రజలు జీవిస్తూ ఉండేవారు. స్థానికులకు, ఆర్యులకు అనేక పోరాటాలు జరిగి ఉంటాయి. ఈ ఆగంతుకులైన ఆర్యులు, ముఖ్యంగా గోపాలకులు, యోధులు. కాని వారుకూడా భారత్‌లోని తక్కిన ప్రజలవలెనే గ్రామాలలో నివసిస్తూ, భూమిని దున్ని, సేద్యం చేయడం నేర్చుకొన్నారు. పైరులు పండించడమే కాకుండా, పశువులను పెంచి పాలు పిండి వెన్న చేయడం, కుండలు, చేదలు తయారు చేసుకోవడం కూడా ఆర్యులకు అలవడింది. తమ గుర్రాలకు నాడాలు, నాగళ్లకు కొర్రులు చేసేందుకు వారిలో కమ్మరి పనివారు కూడా బయలుదేరారు. సింధులోయ ప్రజలకు రాగి, కంచు రెండు లోహాలు మాత్రమే తెలుసు. కాని సుమారుగా ఆర్యులు వచ్చిన కాలంలోనే ఇనుము కూడా వాడుకలోకి రావడం ఆరంభం అయింది.

ఆర్యులు భారత్‌లోకి ఒక్కవిడతగా కాక, ఆగి ఆగి గుంపులు గుంపులుగా రాసాగారు. మొదట్లో వారు సింధునదీ ప్రాంతంలోనే స్థిరపడ్డారు. కాని త్వరలోనే గంగ, యమున

నదుల వెంట తూర్పుదిశగా వ్యాపించారు. తరువాత ఈ ప్రాంతానికే 'ఆర్యావర్త' మని పేరువచ్చింది. సింధు గంగా నదుల మధ్య ఆర్యులు అనేక రాజ్యాలను స్థాపించారు. హాస్తినాపురం, అయోధ్య, మిథిల, ప్రయాగ, వారణాసి వంటి అనేక నగరాలు కూడా నిర్మించుకున్నారు. ఆర్యులకు సంగీతం అంటే మక్కువ. వారికి ధైర్యసాహసాలు వెన్నతో పెట్టినవి. ఆర్యులకు ప్రియమైన క్రీడలలో, గుర్రపు రథాలపై పోటీ స్వారీలు తీయడం ఒకటి. ఆర్యులకు జ్ఞానం అన్నా, జ్ఞానులన్నా అమితమైన గౌరవం. ఋషులను వారు రాజులకన్న మిన్నగా గౌరవించేవారు.

ఇంతవరకూ మీరు సింధు గంగా నదీ ప్రాంతాలలో నివసించిన ప్రజలను గూర్చి విన్నారు. అయితే ఇదే కాలంలో దక్షిణాన వింధ్య పర్వతాలకు దిగువ ఏం జరుగుతూ వచ్చిందో కూడా తెలుసుకోవడం అవసరం.

మొదట్లో దక్షిణ భారతంలో నివసించిన ప్రజలకు, ఆర్యులకు, ఎందులోనూ సంబంధంగాని, ఏవిధమైన పోలికగాని ఉండేది కాదు. వీరికి కూడా తమ స్వంత రాజ్యాలు ఉండేవి. తమ ప్రత్యేక భాషలు మాట్లాడుకునేవారు. సంస్కృతం కంటె ఇవి పూర్తిగా భిన్నమైనవి. వారి దేవతలను వారు కొలుచుకునేవారు. చక్కని పనితనంతో అందాలు చిందే రకరకాల వస్తువులను తయారు చేసి, పెద్ద పెద్ద తెరచాపలున్న ఓడలలో సముద్రాలకు ఆవల ఉన్న దూరదేశాలకు తీసుకొని వెళ్ళి విక్రయించేవారు. సిరిసంపదలతో తులతూగే పెద్ద నగరాలు కూడా అనేకం వీరు కట్టుకున్నారు.

అటు ఉత్తర భారతపు మాగాణాలలో నివసిస్తున్న ఆర్యులు సంస్కృత భాషను వాడుతూ, వారి ప్రత్యేక విధానంలో వారు ఈశ్వర ఆరాధన చేసుకునేవారు. క్రమేణా ఆర్యులు వింధ్య పర్వతాలను దాటి దక్షిణాదికి పోసాగారు. ఇలా తరలి వెళ్ళినవారిలో కొందరు ఋషులు కూడా ఉన్నారు. వీరివల్ల దాక్షిణాత్యులు వేదాలను గురించి తెలుసుకోగలిగారు. కాలం గడచినకొద్ది దాక్షిణాత్యులు ఆర్యుల ఆచార వ్యవహారాలనేకం అవలంబించారు. ఆర్యుల వర్ణవ్యవస్థను సైతం వారు పుణికి పుచ్చుకున్నారు.

చివరకు ఉత్తరాదివారు, దక్షిణాదివారు ఒకరినొకరు పూర్తిగా అర్థం చేసుకొని అత్యంత సన్నిహితులై ఇంచుమించు ఒకే విధంగా జీవించడం నేర్చుకున్నారు. ఇటు దాక్షిణాత్యులు సంస్కృతాన్ని అభ్యసిస్తే అటు ఆర్యులు కొంతవరకు ద్రావిడుల ఆచార వ్యవహారాలను,

పూజ పునస్కారాలను అవలంబించారు. ఉత్తరాదియని, దాక్షిణాత్యమని దేశం రెండు విడిభాగాలై ఉండటానికి బదులు కొంతకాలానికి భరతవర్షమంతా ఇంచుమించు ఇప్పుడు ఉన్నట్లుగానే విశాలమైన ఏకజాతిగా రూపొందింది. అయితే ఈ ఐక్యత పూర్తిగా సిద్ధించడానికి అనేక వందల సంవత్సరాలు పట్టింది.

సుమారుగా ఈ కాలంలోనే వర్ణవ్యవస్థ అంటే కులాలు ప్రారంభమయ్యాయి. మొదట్లో నాలుగు వర్ణాలు ఉండేవి. పురోహితులను, వేదాధ్యయనం చేసిన పండితులను అగ్రవర్ణానికి చెందినవారుగా పరిగణించేవారు. వీరినే బ్రాహ్మణులని కూడా వ్యవహరించేవారు. యోధులు లేక క్షత్రియులు రెండవ వర్ణం. ఆ రోజుల్లో రాజులైనవారు యోధులై ఉండక తప్పేదికాదు. అంటే రాజులంతా క్షత్రియకులంలో జమ. ఇక వ్యాపారులను, వృత్తిపని వారిని, రైతులను, వైశ్యులనేవారు. వీరు మూడవ వర్ణానికి చెందినవారు. శూద్రవర్ణం నాలుగవది. సేవకులు, పాటకజనం ఈ వర్ణంలోకి వస్తారు.

మొదట్లో జీవనోపాధి కోసం ఒక వ్యక్తి ఏ వృత్తిని ఆశ్రయిస్తాడో, దానిని బట్టి ఆ వ్యక్తి కులం నిర్ణయించబడుతూ ఉండేది. తండ్రి వృత్తినే కొడుకు కూడా అనుసరించడం సహజం కాబట్టి, తండ్రి ఏ కులానికి చెందినవాడైతే కుమారుడు కూడా ఆ కులంవాడే అవుతూ ఉంటాడు. కాగా వేద కాలంలో అన్ని వర్ణాలవారు కలసిమెలిసి జీవిస్తూ సహపంక్తిని భుజిస్తూ కూడా ఉండేవారు. అంతేకాదు, వేరువేరు కులాలకు చెందిన వ్యక్తులు వివాహం చేసుకోవడం కూడా కద్దు. కాగా అన్నిటినీ మించిన విశేషం, ఎవరైనా సరే తమ కులాన్ని యధేచ్ఛగా మార్చుకోగలిగేవారు. కాని క్రమక్రమంగా వర్ణనియమాలు, ఆచారాలు కఠినమై సంకుచితమైపోయాయి. పురోహితులు, వేదపండితులు, యోధులు సమాజంలోని పాటకపు జనంకంటె తాము ఎంతో ఎత్తున ఉన్నామని, తమకే అందరికంటే పెద్ద పీట వెయ్యాలని విర్రవీగడం సాగించారు. ఇది ఇలా ఉండగా, ఈ చతుర్వర్ణాల వారంతా ఏకమై మరికొందర్ని 'నన్ను ముట్టుకోకు, నా మాలకాకీ' అన్నట్టు దూరంగా నెట్టి ఉంచాలని చూశారు. ఇలా నెట్టి వేయబడినవారే ''అస్పృశ్యులు''. ఈ వర్ణవ్యవస్థ, అందులోను ముఖ్యంగా అస్పృశ్యత, నిజంగా హేయమైనది. ఆపత్సమయాలలో సైతం భారతజాతి ఏకమై కట్టుగా నిలవడానికి వీలు లేకుండా ఈ కులాలు అనేవి పెద్ద అడ్డుగోడలుగా లేచాయి. ఇది ఎలా జరిగిందో ఆ కథ అంతా ముందు ముందు వస్తుంది.

# రెండు గొప్ప గ్రంథాలు

సీతారాములను గురించి విననివారంటూ ఉండరు. మీలో ఎవరైనా దసరా పండుగలప్పుడు ఉత్తరాదికి వెళ్ళి ఉంటే, రావణుడి పెద్ద బొమ్మ తయారుచేసి కోలాహలంగా తగులబెట్టడం చూసి ఉంటారు. బ్రహ్మాండమైన ఊరేగింపులు, బాణ సంచా కాల్పులతో, హర్షధ్వానాలతో ఆ రోజంతా కోలాహలంగా ఉంటుంది. అనేక వేల సంవత్సరాల క్రిందట ఈ పండుగ రోజున అయోధ్యకు రాజైన శ్రీరామచంద్రుడు, సీతాదేవిని అపహరించుకొని వెళ్ళిన రాక్షసరాజు రావణునితో యుద్ధం చేసి హతమార్చాడు. ఈ నాటికీ దేశంలో పెక్కు చోట్ల ఈ రామవిజయ ఉత్సవాన్ని గొప్ప వేడుకగా జరుపుకుంటున్నారు. శ్రీరామచంద్రుడు ఆదర్శ పురుషుడని, తప్పటడుగు వేయకుండా ఎల్లప్పుడూ తన విధిని ఆచరించిన ధర్మ ప్రభువని భారతీయులంతా భావిస్తారు. మనకున్న గొప్ప గ్రంథాలలో 'రామాయణం' ఒకటి. ఇందులో శ్రీరామచరిత్ర వర్ణించబడింది. పెద్దవారయాక ఆ మహాకావ్యాన్ని మీరు తప్పకుండా చదవాలి.

## రామాయణం

అయోధ్యకు రాజైన దశరథుని కుమారులలో పెద్దవాడు శ్రీరామచంద్రుడు. గుణనిధియైన రాముని ప్రజలు ఎంతగానో ప్రేమించేవారు. దశరథుని అనంతరం రాముడే అయోధ్యకు రాజు కావాలని అంతా ఆశించారు. అయితే రాముని సవతితల్లి కైకేయికి ఇది గిట్టలేదు. తన కుమారుడైన భరతుడే రాజు కావాలని ఆమె కోరిక. రామునిపై ఆమెకు ఈసు కలిగింది. ఆమె వృద్ధ రాజును బలవంతపెట్టి, రాముని పధ్నాలుగు సంవత్సరాలు అరణ్యవాసానికి పంపివేసింది. తండ్రి ఆజ్ఞను రాముడు సంతోషంతో స్వీకరించి, భార్య సీతాదేవిని, తమ్ముడు లక్ష్మణుని వెంటబెట్టుకొని రాచనగరు విడిచి వనవాసానికి వెళ్ళిపోయాడు. వారు వనవాసానికి వెళ్ళిపోవడంతో, దశరథుడు ఎడబాటు సహించలేక మనోవ్యాధితో కొద్ది రోజులలోనే ప్రాణాలు విడిచాడు. కాని భరతునికి అన్నగారైన శ్రీరామునిపై అపారమైన అనురాగం ఉండడంవల్ల సింహాసనాన్ని అధిష్ఠించడానికి ససేమీ అంగీకరించలేదు.



రాముడు మాయలేడిని పట్టుకునేందుకు వెళ్ళాడు

అరణ్యవాసం కష్టభూయిష్ఠమైనది. ప్రమాద భరితమైనది. సీతారామ లక్ష్మణులు రాజప్రాసాదపు భోగవిలాసాలకు అలవాటుపడినవారే అయినా, కించిత్తు అధైర్యపడకుండా వనసీమలలో నిర్విచారంగా కాలం గడుపుతూ వచ్చారు. నదులు, చెట్లు, చేమలు, జంతువుల మధ్య సుందరమైన ప్రకృతి సాన్నిహిత్యంలో ఉల్లాసంగా వనవాసం చేశారు. ఈ కాలంలో రామలక్ష్మణులు అనేక మంది రాక్షసులను అంతమొందించారు.

లంకలో రావణుడనే రాక్షసరాజు ఉండేవాడు. రావణుని సోదరి శూర్పణఖ ఒకనాడు లక్ష్మణుని చూసి మోహించి అతనిని పెళ్ళి చేసుకోవాలని ఉబలాటపడింది. కాని లక్ష్మణుడు అందుకు నిరాకరించాడు. అయినా ఆమె వదిలిపెట్టలేదు. దాని మీద లక్ష్మణుడు కోపంతో శుర్పణఖ ముక్కు, చెవులు కోసివేశాడు. ఇది విని రావణుడు కోపోద్రిక్తుడై రామలక్ష్మణులపై పగతీర్చుకోడానికి ఒక పన్నాగం పన్నాడు. మారీచుడనే రాక్షసుణ్ణి పిలిచి మాయలేడి రూపంలో రాముని కుటీరానికి పోవలసిందిగా ఆజ్ఞాపించాడు. అమాయకురాలైన సీత మాయలేడిని చూసి దాని అందానికి మురిసిపోయి లేడిని తనకు కానుకగా తెచ్చిపెట్టమని రాముని

అడిగింది. అంతట లక్ష్మణుని సీతకు కావలాపెట్టి రాముడు లేడిని వెంబడించాడు. మాయలేడి రామునికి అందకుండా చాలాదూరం అటూ ఇటూ తిప్పి చివరికి ''హా! లక్ష్మణా'' అంటూ పెద్ద కేకపెట్టి అంతర్ధానమై పోయింది. ఈ కేక విన్న లక్ష్మణునికి ఏం చేయాలో పాలుపోలేదు. ఆపదలో చిక్కుకున్న అన్నగారిని వెతకడానికి బయలుదేరి పోవాలో లేక రాముని ఆజ్ఞ మీరకుండా సీతవద్దనే తాను కావలా ఉండాలో తోచక తలకిందులయ్యాడు. చివరికి సీతను ఒంటరిగా విడిచి రాముని వెతకడానికి లక్ష్మణుడు బయలుదేరాడు. అచ్చగా శ్రీరాముని కంఠస్వరాన్ని అనుకరించి మాయలేడి రూపంలో ఉన్న మారీచుడు లక్ష్మణుని ఈ విధంగా మాయ చేశాడు. కొంతసేపు నుంచి ఈ అదను కోసం సమీపంలో పొంచి ఉన్న రావణుడు వెంటనే సన్యాసి రూపంలో ప్రత్యక్షమై సీతాదేవిని అపహరించుకొని లంకకు తీసికొనిపోయాడు.

తాను వెంబడించింది మాయలేడి కావడం వల్ల రాముడు వృథా శ్రమపడి కుటీరానికి వట్టిచేతులతో తిరిగి వచ్చాడు. అక్కడ సీత కనుపించక పోయేసరికి రాముడి గుండెలు అవిసిపోయాయి. వెంటనే అన్నదమ్ములు సీతను వెదకడానికి బయలుదేరారు.

దారిలో వారికి సుగ్రీవుడనే వానరరాజు, అతని మంత్రి హనుమంతుడు సహాయపడ్డారు. రాముడు సముద్రందాటి లంకకు చేరుకోవడానికి వానరసేన వారధిని నిర్మించింది. రాముడు లంకలో ప్రవేశించి రావణునితో యుద్ధం చేసి అతనిని హతమార్చాడు. సీతను చెరవిడిపించాడు. అంతటితో సీతారాముల 14 ఏళ్ల వనవాసం పూర్తి అయింది. సీత, లక్ష్మణ, హనుమంతులను వెంటబెట్టుకొని శ్రీరాముడు అయోధ్యకు తిరిగివచ్చాడు. హృదయాభిరాముడైన శ్రీరామచంద్రుణ్ణి మళ్లీ కళ్లారా చూడగలిగినందుకు అయోధ్యావాసులకు పట్టరాని ఆనందం కలిగింది. ఈ 14 ఏళ్ళు భరతుడు గద్దె ఎక్కకుండా భ్రాతృభక్తితో సింహాసనాన్ని శ్రీరామునికి మీదుకట్టి ఉంచాడు. ఇప్పుడు రామునికి పట్టాభిషేకం జరిగింది. రాములవారు ధర్మాన్ని నాలుగు పాదాలా నడిపిస్తూ రాజ్యాన్ని నాలుగు కాలాలపాటు న్యాయంగా పాలించారు. భారత ప్రజ నేటికీ రామరాజ్యాన్ని ఆదర్శ ప్రభుత్వానికి ఉదాహరణగా చెప్పుకుంటూ ఉంటారు.

## మహాభారతం

మహాభారతం మరొక ఉత్కృష్టమైన ప్రాచీన గ్రంథం. ఆర్యుల రాజులలో గొప్పవాడైన భరత చక్రవర్తి (రాముని తమ్ముడైన భరతుడు వేరు) వంశీయుల చరిత్ర ఈ గ్రంథంలో వర్ణించబడింది. ప్రసిద్ధుడైన ఈ భరత చక్రవర్తిని బట్టే మన దేశానికి భరతవర్షమని, భారత

దేశమని పేర్లు వచ్చాయి.

గంగానదీ తీరాన హస్తినాపురమనే పట్టణాన్ని ధృతరాష్ట్రుడనే రాజు పరిపాలించేవాడు. ధృతరాష్ట్రుడు గుడ్డివాడు. ఈయనకు నూరుగురు కుమారులు. వారికి కౌరవులని పేరు. ధృతరాష్ట్రుని తమ్ముడు పాండురాజుకు ఐదుగురు కొడుకులు. వీరే పాండవులు. ధృతరాష్ట్రుడు పాండవులను కూడా కడుపున పుట్టిన బిడ్డలవలెనె ప్రేమించేవాడు. పాండవులందరిలో పెద్దవాడు యుధిష్ఠిరుడు. ఆయన నిజంగా ధర్మరాజు. రెండవవాడు భీముడు, మహాబలసంపన్నుడు. పెద్ద పెద్ద తాళ వృక్షాలను సైతం అవలీలగా పెళ్లగించి, గదగా ధరించి యుద్ధాలు చేసేవాడు. భీమునిది విపరీతమైన తిండిపుష్టి. ఏడు బళ్ల నిండా తినుబండారాలు పేర్చి పెడితే అంతా ఒక్కసారిగా స్వాహా చేయగలిగేవాడట. భీముడు గొప్ప వంటవాడు కూడాను. మూడవవాడు అర్జునుడు. విలువిద్యలో ఆరితేరిన అర్జునుని పేరు దిగంతాలకు వ్యాపించింది. నకుల సహదేవులు చివరివారు. కౌరవులందరిలోకి పెద్దవాడైన దుర్యోధనుడు దుష్టబుద్ధి. ఇతనికి పాండవులంటే గిట్టేదికాదు. వారిని చంపడానికి అనేక



అర్జున రథసారథిగా కృష్ణుడు ధైర్యాన్ని, జ్ఞానాన్ని ప్రసాదించాడు

విధాల ప్రయత్నించి విఫలుడయ్యాడు. కౌరవులకు దూరంగా ఉండాలనే సంకల్పంతో పాండవులు దేశ సంచారానికి బయలుదేరారు.

పాండవులు ఈ విధంగా దేశాటన చేస్తూ పాంచాల రాజ్యం చేరుకున్నారు. విలువిద్యలో సాటిలేని మేటిని రాకుమార్తె ద్రౌపది స్వయంవరం చేసుకొంటుందని అక్కడ చాటింపు జరిగింది. ఈ స్వయంవరానికి వందల సంఖ్యలో రాజులు, యువరాజులు వచ్చారు. వారితోపాటు పాండవులూ హాజరైనారు. అందరిలోకి విలువిద్యలో అర్జునుడే సాటిలేనివాడని ఋజువైంది. ద్రౌపదిని అర్జునుడు పాణిగ్రహణం చేశాడు. ఆమెను వెంట తీసుకొని పాండవులు ఇంటికి వచ్చి, తల్లిని పిలిచి, ''అర్జునుడు ఒక గొప్ప బహుమతి గెలుచుకున్నాడమ్మా!'' అని సంతోషంగా. చెప్పారు. అర్జునుడు గెలుచుకున్న బహుమతి ఏమిటో కుంతికి తెలియదు. వెంటనే ఆమె ''అయితే అన్నదమ్ములంతా పంచుకోండి నాయనా!'' అని చటుక్కున అనేసింది. ఈవిధంగా ద్రౌపది పంచపాండవులకు భార్య అయింది.

తరువాత పాండవులు హస్తినాపురానికి తిరిగి వచ్చారు. ధృతరాష్ట్రుడు వారు తిరిగి వచ్చినందుకు సంతోషించి రాజ్యంలో సగభాగం పంచి ఇచ్చాడు. మొదటి నుండి పాండవులంటే మండిపడే ధుర్యోధనునికి ఇది నుతరామూ నచ్చలేదు. పాండవులను ఏవిధంగానైనా కష్టాలపాలు చేయాలనే దుర్బుద్ధితో కపటోపాయం ఆలోచించాడు. ధర్మరాజును మాయజూదానికి పిలిచి రాజ్యమంతా గెలుచుకున్నాడు. ధర్మరాజు తనను, తన తమ్ములను, చివరికి భార్య ద్రౌపదినీ కూడా పణంగా పెట్టి ఓడిపోయాడు. కౌరవుల సంతోషానికి మేరలేకపోయింది. వారిలో ఒకడు ద్రౌపదిని జుట్టుపట్టుకొని బలవంతంగా సభలోకి ఈడ్చుకొని వచ్చి పరాభవించబోయాడు. పాపం! ద్రౌపది చేసేది లేక శ్రీకృష్ణుని దీనంగా ప్రార్థించింది. భగవానుడు ఆమె మొర ఆలకించి, ఆమె మానం కాపాడాడు.

పాండవులకు జరిగిన అన్యాయానికి ధృతరాష్ట్రుడు మిక్కిలి చింతించాడు. రాజ్యంలో వారిపాలు వారికి తిరిగి ఇప్పించాడు. దీనితో దుర్యోధనుడు మరీ మండిపడి, ధర్మరాజును మళ్ళీ జూదానికి ఆహ్వానించాడు. ఈ పర్యాయం ఓడిపోయినవారు 12 సంవత్సరాలు అరణ్యవాసం, ఒక సంవత్సరం అజ్ఞాతవాసం చేయాలని షరతు పెట్టాడు. ఈసారి కూడా పాండవులే ఓడిపోయారు. ఆడి తప్పని వారు గనుక పాండవులు ద్రౌపదిని తీసుకుని మారు మాటలేకుండా ప్రవాసానికి వెళ్ళిపోయారు.

అరణ్య, అజ్ఞాతవాసాలను జయప్రదంగా ముగించుకొని, పాండవులు తిరిగి వచ్చి రాజ్యంలో తమకు పాలుపెట్టమని అడిగారు. అయితే దుర్యోధనుడు ససేమి ఒప్పుకోలేదు. పైగా దేశం నలు మూలలనుంచి సైన్యాన్ని కూర్చుకుని పాండవులపై యుద్ధం ప్రకటించాడు.

కురుక్షేత్రంలో పాండవ సేనలకూ, కౌరవసేనలకూ 18 రోజులు ప్రచండమైన యుద్ధం జరిగింది. మహాభారతంలో ఈ సంగ్రామం విపులంగా వర్ణించబడింది. యుద్ధంలో ఇరువైపులా గొప్ప గొప్ప యోధులు పాల్గొన్నారు. పాండవుల సైన్యం చిన్నదైనప్పటికీ, వారి పక్షాన న్యాయం ఉండటంవల్ల వారికి శ్రీకృష్ణ భగవానుని అండ దొరకడం వల్ల వారే యుద్ధంలో గెలుపొందారు. ధర్మరాజు పట్టాభిషిక్తుడై హస్తినాపురానికి రాజయ్యాడు.

ఇలా అనేక సంవత్సరాలు దిగ్విజయంగా ఏలుబడి సాగించిన పిమ్మట, పాండవులు రాజ్య పరిత్యాగం చేసి స్వర్గారోహణ కోసం పయనమైనారు. సహధర్మచారిణి ద్రౌపది కూడా వారి వెంట ఉంది. తనకు ఎంతో విశ్వాసంగా ఉంటూ వచ్చిన కుక్కను కూడా ధర్మరాజు వెంట తీసుకొని వెళ్లాడు. కాని తమ్ములు, ద్రౌపది ఆయనతో స్వర్గం లోపల అడుగుపెట్టదలుచుకుంటే కుక్కను బయట వదలివేసి రావాలని ధర్మరాజుకు చెప్పారు. అయితే, కుక్కమీద మక్కువవల్ల యుధిష్ఠిరుడు అందుకు ఒప్పుకోలేదు. ఆ మూగజీవం మీద ధర్మరాజుకుగల ప్రేమకు మెచ్చుకొని దేవతలు, కుక్కతో సహా యుధిష్ఠిరుడు స్వర్గంలో ప్రవేశించడానికి సంతోషంగా అంగీకరించారు.

ప్రపంచంలోని మహా కావ్యాలలోకెల్లా భారతం పెద్దది. ఇందులో అనేకమంది వీరులు, వీరవనితలు, మునులు, విజ్ఞులు, దేవతలకు సంబంధించిన కథలు అసంఖ్యాకంగా ఉన్నాయి. మహాభారతంలో అత్యంత ముఖ్యమైన ఘట్టం - శ్రీకృష్ణ భగవానుడు కురుక్షేత్రంలో అర్జునునకు చేసిన గీతోపదేశం. ఇదే 'భగవద్గీత'. శ్రీకృష్ణుడు తనకు రథసారథిగా సైన్యాలతో కలసి యుద్ధరంగానికి వచ్చిన అర్జునుడు కౌరవ సేనావాహినులను చూసి ఖిన్నుడైనాడు. సంశయ, విషాదాలు అలుముకొని అతని మనస్సు వికలమైపోయింది. చిన్నతనం నుంచి ఒకే చోట కలసి పెరిగి, తనకు ఎంతో ప్రేమపాత్రులైన తన బంధు మిత్రులతో, తనకు విద్య నేర్పిన గురువులతో యుద్ధం చేయడానికి అర్జునునకు మనసొప్పలేదు. శ్రీకృష్ణుడు అప్పుడు అర్జునునికి ధైర్యం చెప్పి గీతోపదేశం చేశాడు. ఫలితాన్ని గురించి ఆందోళన చెందకుండా కర్తవ్యాన్ని నిర్వహించడమే పరమధర్మమని బోధించాడు. స్వార్థాన్ని, కామాన్ని జయించినవాడే తన

కర్తవ్యాన్ని ఉత్తమంగా నెరవేర్చగలుగుతాడని ప్రబోధించాడు. భగద్గీత సందేశం ఇదే.

భగవద్గీత హిందువులకు పవిత్రమైన గ్రంథం. ఆ గ్రంథంలోని ఉపదేశాలను ఆచరించడానికి ప్రతి హిందువూ ప్రయత్నిస్తాడు. ప్రపంచంలో ఇతర మతాలవారు కూడా అనేకులు భగవద్గీతను గౌరవించి శ్రద్ధగా పారాయణ చేస్తూ ఉంటారు.

మహితమైన ఈ గ్రంథాలను వ్రాసిన మహాత్ములెవరు? వాల్మీకి మహాముని రామాయణాన్ని, వ్యాసమహర్షి భారతాన్ని రచించారు. ఇవి సంస్కృతంలో వ్రాయబడినాయి. కాలక్రమేణా వీటికి దేశమంతటా ప్రజాదరణ లభించింది. అందువల్ల ఇవి దేశ భాషలన్నింటిలోకి అనువదించబడ్డాయి. క్రమంగా అనేక కొత్త కథలు కూడా వీటిలో చేరాయి. ఈ గ్రంథాలలో వర్ణించబడిన నాయికలు, నాయకులు సామాన్య ప్రజలకు కూడా పరిచితులై అభిమాన పాత్రులయ్యారు. భారత దేశంలో ఏ ప్రాంతానికి వెళ్ళినా రాముడు, సీత, కృష్ణుడు, భీముడు అన్న పేర్లు పెట్టుకున్న వ్యక్తులు కొల్లలుగా కనిపిస్తారు. రామాయణ మహాభారతాలు మనకున్న గొప్ప పురాణాలు. వీటిని జాతీయ ఇతిహాసాలని కూడా చెప్పవచ్చు. మీ తాత ముత్తాతలు ఈ పురాణాలలోని కథలను ఇదివరకే మీకు చెప్పి ఉంటారు. అన్ని భాషలలో, అన్ని యుగాలలో ఈ పురాణ గ్రంథాలు ఎన్నోసార్లు తిరగవ్రాయబడి, ప్రజలు చర్వితచర్వణంగా వాటిని పారాయణ చేస్తూ వచ్చారు. రామాయణ, మహాభారతాలు మన నిత్యజీవితంలో భాగమై, మనజాతిని ఎంతో ప్రభావితం చేశాయి. భారతదేశంలో తూర్పు పడమర, ఉత్తర దక్షిణాలలో ఏమూల నివసిస్తున్న వారైనా పరమధార్మికుడైన శ్రీరాముని సద్గుణాలను, సాధ్వి సీతమ్మ పాతివ్రత్యాన్ని, అర్జునుని శౌర్య పరాక్రమాలను, ధర్మపత్ని ద్రౌపది భక్తితాత్పర్యాలను పదేపదే సంస్మరించుకొని మురిసిపోని వారంటూ ఉండరు.

# గౌతమ బుద్ధుడు - మహావీరుడు

బుద్ధ భగవానుని విగ్రహాలను, బౌద్ధ విహారాల చిత్రాలను మీరు చూసే ఉంటారు. ప్రపంచంలో కోట్లాది ప్రజలు బుద్ధభగవానుని ఆరాధిస్తూ, ఆయన ఉపదేశాలననుసరించి తమ జీవితాలను తీర్చిదిద్దుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. బౌద్ధమతాంతరులు సైతం ప్రపంచంలో అవతరించిన మహాత్ములలో ఒకనిగా ఆయనను గౌరవిస్తున్నారు.

దాదాపు 2,500 సంవత్సరాల క్రితం భారత్-నేపాల్ సరిహద్దున ఉన్న లుంబిని అనే గ్రామంలో గౌతముడు జన్మించాడు. బుద్ధుని మరణానంతరం 250 సంవత్సరాలకు, భారతదేశంలో ఒక మహాచక్రవర్తి ఆయన జన్మించిన చోట స్మారక చిహ్నంగా ఒక ఎత్తయిన స్తంభాన్ని పాతించాడు. ఆ స్తంభం అక్కడ ఇప్పటికీ చెక్కు చెదరకుండా నిలిచి ఉంది.

గౌతముని తండ్రి శాక్యవంశపురాజు. సమస్త భోగభాగ్యాలతో తులతూగే రాచనగరులో గౌతమునకు ఏలోపము లేకుండా తండ్రి అతనికి కోరినదల్లా తెచ్చియిస్తూ అల్లారు ముద్దుగా పెంచాడు. చిత్ర విచిత్రమైన ఆటవస్తువులు, పంచభక్ష్య పరమాన్నాలు, పాము కుబుసాల వంటి సన్నని దుస్తులు గౌతముని వడిలో కుప్పతిప్పలుగా వచ్చి పడేవి. అయితే పెరిగి పెద్దవాడైన కొద్దీ విలాస వస్తువులమీద గౌతమునికి మోజు తగ్గుతూ వచ్చింది. ఆయన ఏకాంతాన్ని అభిలషించేవాడు. ఎప్పుడూ ఒంటరిగా కూర్చుని ధ్యానంలో మునిగిపోయేవాడు. లేదా సాధుజంతువులతో ఆప్యాయంగా ఆడుకుంటూ ఉండేవాడు.

యుక్త వయస్సు వచ్చిన తరువాత గౌతమునికి యశోధర అనే చక్కని చుక్కతో వివాహం జరిగింది. కొంత కాలానికి వారికి రాహులుడనే కుమారుడు ఉదయించాడు. అయినా గౌతమునికి మనశ్శాంతి లేదు. రాజమహాలుకు వెలుపల ఉండే ప్రజలను గురించి వారి జీవితాలను గురించి ఎడ తెగని ఆలోచనలతో తల మునుకలవుతు ఉండేవాడు. ఒకనాడు వాహ్యాళికి వెళ్ళినప్పుడు వడవడ వణుకుతున్న ఒక ముసలి వగ్గును చూశాడు. అటుపైన అడుగులు తడబడుతు, వ్యాధితో కృశించి, కావటిబద్దవలె వంగి ఉన్న ఒక రోగిని చూశాడు. గౌతమునికి ఇదంతా అయోమయంగా తోచింది. మనుషులు ముదుసలులై ఎందుకు



ప్రజలు అర్థం చేసుకునే రీతిలో బుద్ధుడు ప్రవచించాడు

రోగంతో తీసుకోవాలో ఆయనకు బోధపడింది కాదు. ఒక రోజున నగరంలో రథం మీద వెళుతుండగా ఒక మృతకళేబరాన్ని శవవాహకులు స్మశానానికి మోసుకుపోతూ ఉండటం చూశాడు. దీనితో గౌతముని మనస్సు పూర్తిగా వికలమైపోయింది. మనుషులు చనిపోవడం దేనికి? ఎందుకిది జరగాలి? అనే ప్రశ్న అతనిని వేధించసాగింది. రాజప్రాసాదంలో ఇటువంటి విషాదకరమైన దృశ్యాలను అతను ఎప్పుడూ చూసి ఉండలేదు. ప్రపంచంలో ఇంత దుఃఖం, బాధ ఉండవచ్చునని ఆయన ఎప్పుడూ ఊహించి ఉండలేదు. రాచనగరుకు తిరిగిపోతుండగా

కాషాయాంబరాలు ధరించి, భిక్షాపాత్ర చేతగొని నడచి వస్తున్న ఒక సన్యాసి తారసిల్లాడు. గౌతముడు నీవెవరవని అతనిని ప్రశ్నించాడు. ఆధి వ్యాధులతో కూడిన సంసారం నుంచి విముక్తి పొందడానికి సర్వసంగ పరిత్యాగం చేసిన సన్యాసిని అని ఆయన బదులిచ్చాడు. గౌతముని మనస్సు ఇది అంతా కనీ వినీ ఎంతో కలవరపడింది. ప్రపంచంలో ఇంత దుఃఖం ఉండటానికి హేతువేమిటో, దానిని తొలగించడానికి ఉపాయామేమిటో తెలుసుకొనేంతవరకూ క్షణమైనా విశ్రమించకూడదని గౌతముడు నిశ్చయించుకున్నాడు.

ఒకనాటి అర్ధరాత్రి అంతఃపురంలోని వారంతా గాఢనిద్రలో మైమరచి ఉన్న సమయంలో గౌతముడు లేచి చప్పుడు చేయకుండా అడుగులో అడుగువేసుకుంటూ భార్య యశోధరను, తన ముద్దుబిడ్డ రాహులుని సమీపించి వారిని తనివితీరా చూసుకున్నాడు. ఇప్పుడు తాను చేయదలుచుకున్న పని హృదయవిదారకమైనదే. కానీ అది తాను చేయక తప్పదు. రాచనగరులో ప్రియులైన బంధు మిత్రుల మధ్య ఉంటూ, భోగభాగ్యాలను అనుభవిస్తూ ఉన్నంతకాలం తన మనస్సును పీడిస్తూన్న ప్రశ్నలకు తగిన సమాధానాలు లభించవు! గౌతముడు సతీసుతుల వంక కడపటిసారిగా దృష్టి సారించి రాజప్రాసాదాన్ని విడిచి, మహాభినిష్క్రమణం చేశాడు.

అంతట రాజోచితమైన వేషభూషలను విసర్జించి, శిరోజాలను తీసివేసి విరాగియై సత్యాన్వేషణకు బయలుదేరాడు. ఈవిధంగా సంచారం చేస్తూ అనేకమంది యోగులను, సన్యాసులను కలుసుకుని సంసారం దుఃఖభూయిష్ఠమై ఉండడానికి కారణం చెప్పమని అర్థించాడు. ఎవ్వరూ అతనికి తృప్తి కలిగించే సమాధానాలు ఇవ్వలేదు. చివరికి ఒక ఏకాంత స్థలంలో ఆసీనుడై అనేక నెలలు అన్నపానాలను సైతం ముట్టకుండా ఏకాగ్రమైన మనస్సుతో ధ్యాననిష్ఠుడయాడు. శరీరం శుష్కించి ఎముకలగూడు అయిపోయింది. అయినా గౌతమునకు వెతుకుతున్న సమాధానాలు లభించలేదు. ఈ ప్రకారం ఆరు సంవత్సరాలు గడిచాయి. ఇలా ఉండగా ఒకనాడు వటవృక్షం కింద కూర్చుని ధ్యానముద్రలో ఉండగా గౌతముని సందేహాలన్నీ పటాపంచలై, జ్ఞానోదయం అయింది. సంపూర్ణ జ్ఞానం (బుద్ధి) పొందినవాడు కాబట్టి గౌతముడు బుద్ధుడయ్యాడు. దివ్య జ్ఞానోదయమైనప్పుడు గౌతముడు ఏ చెట్టునీడలో ఆసీనుడై ఉన్నాడో దానిని బోధివృక్షమని పిలుస్తారు. గయలో ఆ స్థలంలో మహాబోధి ఆలయమనే పేరుతో పెద్ద ఆలయం ఒకటి నిర్మించబడింది.

ప్రపంచంలో దుఃఖం, బాధ ఉండటానికి కారణం ఏమిటో గౌతమ బుద్ధుడు

తెలుసుకున్నాడు. మానవుడు కోరికలను పెంచుకొని స్వార్థపరుడై లోభానికి గురికావడం వల్లనే సంసారం దుఃఖమయ మయిందని, కనుక కోరికలను చంపుకొని తాను ఉపదేశించిన అష్టాంగపథాన్ని అనుసరించడమే దుఃఖవిముక్తికి మార్గమని బుద్ధుడు బోధించాడు. మనోవాక్కాయ కర్మలతో సత్యాన్ని అనుష్ఠించాలన్నదే ఆయన ఉపదేశంలోని సారాంశం. ఇవిగాక మరో అయిదు సూత్రాలను కూడా ఆయన ప్రవచించారు. మీరు పెద్దవారైన తరువాత గౌతముని బోధనలను గురించి విపులంగా చదివి తెలుసుకోవచ్చు.

బుద్ధుడు తన స్వానుభవంవల్ల గ్రహించిన మరో సత్యం ఏమంటే, మితిమీరిన భోగాలు అనుభవించడం వల్లగాని, నిద్రాహారాలు మాని కఠినమైన నియమాలను అవలంబించి శరీరాన్ని శుష్కింపచేయడం వల్లగాని నిజమైన ఆనందం లభించదు. ఈ రెండు మార్గాలకు మధ్యగా ఉండే తృతీయమార్గమే సరియైన పంథా అని బుద్ధుడు ఉపదేశించాడు.

బుద్ధుని బోధనలను అనేక సంపుటాలుగా కుర్చడం జరిగింది. ఈ పుస్తకాలలో ఒకటి ''ధమ్మపథం''. బుద్ధుని సూక్తులలో కొన్ని:

''ఏదైన పాపకార్యం చేస్తే, అందుకు నీవు వెంటనే పశ్చాత్తాపపడి, ఇక ఎప్పుడూ అటువంటి పని మళ్లీ చేయకుండా ఉండాలి. పాపకార్యాలు కర్తకు తప్పనిసరిగా బాధనే కలిగిస్తాయి. అథవా నీవు ఒక సత్కార్యం ఏదైనా చేసి ఉంటే, దానినే మళ్లీ మళ్లీ ఆచరిస్తూ ఉండు. నిజమైన ఆనందాన్ని ఇవ్వగలిగినవి సత్కార్యాలే తప్ప అన్యంకావు.

క్రోధం వడిగా పరుగెత్తుతున్న రథంవంటిది. ఎవరైతే క్రోధాన్ని నిగ్రహించుకోగలుగుతారో వారే నిజమైన రథచోదకులు. ఇక తక్కినవారంటారా, లగాములను ఊరికే చేతపట్టుకున్నవారు మాత్రమే.

విజేతలందరిలోకే గొప్ప విజేత ఎవరు? వెయ్యిమందిని వెయ్యి సార్లు యుద్ధంలో ఓడించిన వ్యక్తికాదు. ఎవడైతే ఆత్మను జయించాడో అతడే నిజమైన విజేత.''

ప్రతి వ్యక్తీ ఆత్మనిగ్రహాన్ని అలవరచుకొని యమ నియమాలతో జీవితం గడపాలని ఆయన బోధించారు. మనమీద ఎవరైనా కోపగించుకుంటే, వారి మీద తిరిగి కోపం తెచ్చుకోవడానికి బదులు ప్రసన్నులమై దయచూపాలి. అపకారికి ఉపకారం నెపమెన్నకుండా చేయాలి. జీవహింస చేయరాదు. చివరికి జంతువులను కూడా బాధించరాదు. సర్వదా

సత్యాన్నే పలుకుతూ, అందరి పట్ల దయతో, ప్రేమతో మెలగాలి. మనస్సును నిష్కల్మషంగా స్వచ్ఛంగా ఉంచుకోవాలి.

కాలినడకన దేశసంచారం చేస్తూ బుద్ధుడు తాను కనుగొన్న సత్యాలను ప్రజలకు బోధిస్తూ ధర్మప్రచారంలో జీవితం గడిపాడు. తిరిగి తిరిగి అలిసిపోయి ఉన్నా, కొద్దిసేపు విశ్రాంతి తీసుకొని వెంటనే మళ్లీ ప్రయాణం సాగించేవాడు. సాటి మానవులపట్ల ఆయనకున్న అనురాగం అలాంటిది. క్రమంగా ఆయన కీర్తి వ్యాపించింది. తండోపతండాలుగా జనం వచ్చి ఆయన మ్రోలవాలి తమకు ఉపదేశం చేయవలసిందని వేడుకునేవారు. ఈ ప్రకారం కొన్ని సంవత్సరాలు గడచిన తరువాత బుద్ధుడు తన కుటుంబానికి ఉపదేశం చేయదలచి రాచనగరుకు వెళ్లాడు. రాహులుడు ఇప్పుడు పెరిగి పెద్దవాడయ్యాడు. యశోధర, రాహులుడు బుద్ధభగవానునివద్ద ఉపదేశం పుచ్చుకొని ఆయన అనుయాయులయ్యారు.

80 ఏళ్ల వయస్సులో ఉండగా బుద్ధునికి ఒకసారి తీవ్రమైన జబ్బు చేసింది. మరణ సమయం ఆసన్నమైంది. ఖిన్నులై ఉన్న తన శిష్యులను ఓదార్చి, ''పుట్టిన ప్రతి వ్యక్తీ గిట్టక తప్పదు కనుక దుఃఖించవద్దు'' అని బోధించి బుద్ధుడు నిర్యాణం పొందాడు.

గౌతమబుద్ధుని ఉపదేశాలు, ఆయన ఆదర్శజీవితం ప్రజాసామాన్యంలో గొప్ప పరిణామం తెచ్చాయి. ఆయన జన్మించిన నాటికే దేశంలో వర్ణ వ్యవస్థ వేళ్లు పాతుకొని, అనేక దురాచారాలు తలఎత్తాయి. కాయకష్టంచేసే నిరుపేదలైన పాటక జనానికి మతగ్రంథాలు చదివే హక్కు ఉండేది కాదు. ఆర్యుల కాలంలో వలె కాక దైవప్రార్థనలు ఒక్క బ్రాహ్మణులకే అర్థమయే భాషలో ఉండి, జటిలమైన కర్మకాండలతో క్లిష్టభూయిష్టంగా తయారయ్యాయి. యోధులైన క్షత్రియుల కులంలోనే తాను పుట్టినప్పటికీ, కులాల గొడవ పట్టించుకోకుండా బుద్ధుడు అందరికీ అర్థమయ్యే సరళ భాషలో తాను కనుగొన్న సత్యాలను బోధించాడు. ఒక వ్యక్తి ఆభిజాత్యం అతని నడవడిని బట్టే నిర్ణయ మవుతుందన్నాడు. నదులన్నీ చివరికి సముద్రంలో కలిసినట్లే, తన మతంలో అన్ని కులాలు ఒకటిగా లీనమైపోతాయని చాటి చెప్పాడు. కరుణామూర్తి అయిన బుద్ధ భగవానుడు రారాజులను, పంచములను, బ్రాహ్మణులను, శూద్రులను సమభావంతో ప్రేమించాడు. అనేక పర్యాయాలు ఉత్తమ కులీనులైన సంపన్నుల ఆహ్వానాలను తిరస్కరించి, పేదవారి కుటీరాలలో ఆతిథ్యం స్వీకరించాడు. వారికంటే వీరికి తన సాన్నిధ్యం, సాంత్వనం ఎక్కువ అవసరం అని బుద్ధుని అభిప్రాయం.

బుద్ధుడు అందరికీ సులభంగా అర్థమయ్యే సామాన్య భాషలోనే తన మత ప్రచారం చేశాడు. సంస్కృతం తెలియని తక్కువ కులాలవారు సైతం ఆయన బోధనలు అర్థం చేసుకొని ఆయనతో మమేకం కాగలిగారు. మానవులంతా సమానులన్న సత్యాన్ని ఆయన చాటి చెప్పాడు.

పాశ్చాత్య పండితులొకరు బుద్ధుడు ''ఆసియా ఖండ అఖండజ్యోతి'' అని వర్ణించారు. చీకటిలో ఉన్నవారు వెలుతురు సాయంతో దారి తెలుసుకోవచ్చు గనుక, మార్గదర్శకుడైన బుద్ధ భగవానుని ఆ పేరుతో పిలవడం ఎంతైనా సమంజసం. అజ్ఞానాంధకారం నుంచి మానవజాతిని విడిపించి, తన బోధనల ద్వారా సత్యమార్గాన నడిపించిన జ్యోతిర్మయుడు బుద్ధ భగవానుడు.

## మహావీరుడు

బుద్ధుని కాలంలోనే మరొక మహాపురుషుడు జన్మించాడు. బూజుపట్టిన పాతకాలపు ఆచారాలను మార్చడానికి ప్రయత్నించిన ఈ మహనీయుని పేరు వర్ధమాన మహావీరుడు. బుద్ధునికి మహావీరునికి అనేక విషయాలలో పోలికలు ఉన్నాయి. బుద్ధునివలె ఈయన కూడా క్షత్రియుడే. మహావీరుడు వైశాలీ రాజవంశంలో జన్మించాడు. ఈయన కూడా పిన్న వయస్సులోనే రాజభోగాలను త్యజించి, సత్యాన్వేషణా తత్పరుడై, దేశాటనకు బయలు దేరాడు. పన్నెండేళ్ళ సాధన అనంతరం తాను అన్వేషిస్తున్న జ్ఞానాన్ని పొందగలిగాడు. పిమ్మట దేశం నాలుగు మూలలా తిరిగి, అందరికీ తన బోధామృతాన్ని పంచిపెట్టాడు. ఆయన అనుయాయులను జైనులని పిలుస్తారు. ఏ జీవికీ ఎలాంటి హానీ కలిగించకూడదని, అహింసే పరమధర్మమని జైనమతం బోధిస్తుంది. జైనులు నిరాడంబరంగా నియమనిష్ఠమైన జీవితం గడుపుతారు. పశు పక్ష్యాదులకేగాక, కంటికి కనిపించకుండా గాలిలో తేలియాడే సూక్ష్మాతిసూక్ష్మ క్రిములకు, చెట్టు చేమలకు సైతం ప్రాణం ఉన్నదని జైనులు నమ్ముతారు. అన్ని జీవరాసులను సమభావంతో సమాదరిస్తారు.

# మౌర్య సామ్రాజ్యం

బుద్ధుని కాలంలో భారతదేశంలో చిన్నచిన్న రాజ్యాలనేకం ఉండేవి. సాటి రాజులను లొంగదీసుకొని తానే సామ్రాట్టు కావాలని ప్రతి ప్రభువూ ప్రయత్నిస్తూ ఉండేవాడు. ఇట్టి పరిస్థితులలో ఈ రాజులకు ఒకరికొకరికి పడేది కాదంటే ఆశ్చర్యమేమీ లేదు. ఈ చిన్న చిన్న రాజ్యాలను కూడగట్టి అధినాయకత్వం వహించగల దక్షులెవ్వరూ చాలాకాలం వరకు లేకపోయారు. కాగా భారత దేశాన్ని పాలించిన తొలి మహాచక్రవర్తులలో చంద్రగుప్తమౌర్యుడు ఒకడు. అయితే ఇతడు చక్రవర్తి కావడానికి ముందు అతి ముఖ్యమైన సంఘటన ఒకటి జరిగింది.

## పురుషోత్తముడు - అలెగ్జాండరు

భారతదేశానికి బహు దూరాన గ్రీసుదేశంలో ఉన్న బాలుడొకడు ప్రపంచమంతటినీ జయించి భూమండలానికి అంతటికీ తాను చక్రవర్తి కావాలని కలలు కనేవాడు. ఈ కుఱ్ఱవాని పేరు అలెగ్జాండరు. అతడు పెరిగి యువకుడైన తరువాత, అతని చిన్ననాటి కలలు చాలవరకు ఫలించాయి. 40,000 సైన్యాన్ని తీసుకొని అలెగ్జాండరు దిగ్విజయ యాత్రకు బయలుదేరాడు. దారిలో తనను అడ్డగించిన ప్రతిరాజును ఓడించి చివరికి భారతదేశాన్ని సమీపించాడు. విజయోన్మత్తుడైన అలెగ్జాండరు హిందూకుష్ పర్వతాలుదాటి పంజాబులో తనను ఎదిరించిన చిన్న చిన్న రాజులందర్నీ చిత్తుగా ఓడించాడు. వారిలో పురుషోత్తముడనే రాజు మాత్రం అలెగ్జాండరును ధైర్యంగా ప్రతిఘటించి అత్యంత పరాక్రమంతో పోరాడాడు. పురుషోత్తముని సైన్యం జీలం నది ఒడ్డున విడిసి ఉంది. అనేక రథాలు, ఏనుగులతో అతని సైన్యం అజేయమై కనిపించింది. అలెగ్జాండరు స్కంధావారం జీలం నది ఆవలి ఒడ్డున మోహరించింది. ఒకనాటి రాత్రి కుండపోతగా వర్షం కురుస్తూ ఉండగా అలెగ్జాండరు సైనికులు కొందరు రహస్యంగా నదిని దాటి పురుషోత్తముని సైన్యాన్ని ముట్టడించారు. ఆ అలజడికి పురుషోత్తముని ఏనుగు దళాలు బెదిరి చెల్లాచెదురుగా పారిపోయాయి. పురుషోత్తముని సైనికులను అనేకమందిని పారిపోతున్న ఏనుగు దళాలు కాళ్ళతో మట్టగించి, తొండాలతో విసిరికొట్టి నుగ్గునూచం

చేసి వేశాయి. దీనితో సైన్యంలో భీతావహం పుట్టుకొచ్చింది. రథాలు ఊబిలో కూరుకొని కదలలేక పోయాయి. గత్యంతరం లేక పురుషోత్తముడు దాసోహం అనవలసి వచ్చింది. గొలుసులతో కట్టి సైనికులు పురుషోత్తముని అలెగ్జాండరు ముందుకు తీసుకుపోయి నిలబెట్టారు. విజయ గర్వంతో అలెగ్జాండరు ''ఇప్పుడు నువ్వు బందీవి, నిన్ను ఏ విధంగా చూడమంటావు?'' అని గద్దించాడు. దానికి పురుషోత్తముడు రాజఠీవితో ''ఒకరాజు మరొక రాజును గౌరవించవలసిన విధంగా నన్ను గౌరవించాలి'' అని జవాబిచ్చాడు. ఈ సమాధానానికి అలెగ్జాండరు సంతోషపడి, పురుషోత్తముని గౌరవించి అతని రాజ్యాన్ని అతనికి తిరిగి ఇచ్చివేశాడు.

ఆ కాలంలో మగధరాజ్యం మంచి ఉచ్ఛదశలో ఉండేది. ఈనాటి దక్షిణ బీహార్‌నే ఆనాడు మగధ అనేవారు. మగధరాజ్య ఐశ్వర్య సౌభాగ్యాలను గురించి కర్ణాకర్ణిగా విని ఉన్న అలెగ్జాండరు దానిని కూడా జయించాలని ఉబలాట పడ్డాడు. పంజాబులో మరో మూడు నదులను దాటి బియాస్ నదీతటం చేరుకున్నాడు. కానీ అంత వరకు వెళ్ళిన తరువాత అలసిపోయి ఉన్న అతని సైనికులు ఇండ్లమీదికి మనసు మళ్లగా తాము ఇక అడుగు కూడా ముందుకు వేసేది లేదని మొండికెత్తారు. అంతటితో విధిలేక అలెగ్జాండరు వెనక్కి తిరిగిపోవలసి వచ్చింది. చివరికి తిరిగి ఇండస్ చేరుకొని అక్కడ అనేక పడవలు పోగుచేసి వాటిమీద సైన్యంతో సముద్రం చేరుకున్నాడు.

## చంద్రగుప్తమౌర్యుడు

ఆనాటి అలెగ్జాండరు విజయాలను ఆసక్తితో గమనిస్తున్న ఒక భారతీయ యువకుడు తాను కూడా ఎప్పటికైనా ప్రపంచ విజేత కావాలని ఉవ్విళ్ళూరుతూ వచ్చాడు. ఆ యువకుడే చంద్రగుప్త మౌర్యుడు.

చంద్రగుప్తుడు ఒకప్పుడు మగధరాజు సైన్యంలో సేనాధిపతిగా ఉండేవాడు. మగధరాజును కూలదోసి, తానే రాజు కావాలని చంద్రగుప్తుడు కుట్రపన్నాడు. కాని అతని ప్రయత్నం విఫలమైంది. దానితో ప్రాణభయంతో చంద్రగుప్తుడు మగధ నుండి పారిపోయాడు. తాడుతెగిన గాలిపటంలా పంజాబులో తిరుగుతూ రాజయ్యే అదను ఎప్పుడు వస్తుందా అని ఎదురు తెన్నులు చూస్తు ఉండేవాడు. ఇంతలో చాణక్యుడనే ఒక మహామేధావి అతనికి జత కలిసాడు. ఒకప్పుడు చాణక్యుడు కూడా మగధ రాజు ఆస్థానంలో ఉన్నవాడే. రాజు అవమానించినందుకు

చాణక్యుడు ఆయన ఆస్థానాన్ని వదిలిపెట్టాడు. మగధరాజుపై ఏ విధంగా అయినా పగతీర్చుకోవాలని శపథం చేసిన చాణక్యునికి చంద్రగుప్తుడు కనిపించడంతో వెదక బోయిన తీగ కాలికి తగిలినట్లయింది. మహాచక్రవర్తి కావడానికి అనుసరించదగు వివిధ ఉపాయాలను చంద్రగుప్తునికి చాణక్యుడు శ్రద్ధగా నేర్పాడు.

చంద్రగుప్తుడు గొప్ప సైన్యాన్ని సేకరించి, లోగడ అలెగ్జాండరు జయించిన రాజ్యాలన్నింటినీ క్రమంగా వశపరచుకున్నాడు. ఆ తరువాత మగధ మీద దండెత్తి మగధరాజును కూడా ఓడించాడు. చంద్రగుప్త, చాణక్యులు చిరకాలంగా నిరీక్షిస్తున్న అవకాశం చేజిక్కి వారి అభీష్టం ఈ విధంగా సిద్ధించింది. చంద్రగుప్తుడప్పుడు మగధరాజ్యానికి పట్టాభిషిక్తుడై, తాను జయించిన వివిధ రాజ్యాలను ఏకచ్ఛత్రంగా పరిపాలించసాగాడు.

ఇలా ఉండగా కొంతకాలానికి అలెగ్జాండరు సేనానులలో ఒకడైన సెల్యూకస్ తమ చేజారిపోయిన రాజ్యాలను తిరిగి ఆక్రమించుకోవడానికి ప్రయత్నం ఆరంభించాడు. కాని చంద్రగుప్తుడు సెల్యూకస్‌ను ఓడించి, సంధి కుదిరిన తరువాత సెల్యూకస్ కుమార్తెను పరిణయమాడాడు. నేడు పాట్నా అని పిలువబడుతున్న స్థలంలోనే చంద్రగుప్తుని రాజధాని పాటలీపుత్రం ఉండేది. సెల్యూకస్ పాటలీపుత్రానికి మెగస్తనీస్ అనే గ్రీకు రాయబారిని తన ప్రతినిధిగా పంపాడు. భారతదేశంలోని ఆ కాలపు స్థితిగతులను సవిస్తరంగా వర్ణిస్తూ మెగస్తనీస్ ఒక పుస్తకం వ్రాశాడు.

క్రమంగా చంద్రగుప్తుని సామ్రాజ్యం విస్తరించి, ఇంచుమించు యావత్తు భరతవర్షమూ అతని స్వాధీనమైంది.

చంద్రగుప్తుడు రాజ్యాన్ని దక్షతతో పరిపాలిస్తూ వచ్చాడు. మేధావంతుడైన అతని గురువు చాణక్యుడు ముఖ్యమంత్రిగా ఉంటూ, శాంతి భద్రతలను కాపాడటంలో ఆయనకు చేదోడువాదోడుగా ఉండేవాడు. రాజైనవాడు రాజ్యాన్ని ఎలా పాలించవలెనో బోధించేందుకు చాణక్యుడు అర్థశాస్త్రమనే పేరుతో ఒక ప్రామాణిక గ్రంథం రచించాడు.

చంద్రగుప్తుడు కొయ్యతో నిర్మించిన ఒక రమ్యహర్మ్యంలో నివసించేవాడు. వెండి, బంగారు వస్తువులతో ఆ హర్మ్యం నేత్రపర్వంగా అలకరించబడి ఉండేది. ప్రాసాదం చుట్టూ పెద్దపెద్ద ఉద్యానాలూ, వాటిలో పలు రకాల రంగుల చేపలతో నిండిన సరోవరాలు ఉండేవి. కాని ఇప్పుడు ఆ ప్రాసాదం కాలగర్భంలో కలిసిపోయింది.

చంద్రగుప్తుడు ప్రజలకు పెక్కు సౌకర్యాలు కల్పించాడు. పెషావరు నుండి పాటలీపుత్రం వరకు సుమారు 1,200 మైళ్ల నిడివిగల ఒక విశాలమైన రహదారిని నిర్మించి, దారికిరువైపులా చక్కని నీడలిచ్చే మహావృక్షాలను నాటించాడు. దారిలో అక్కడక్కడ అలసిపోయిన బాటసారులు సేద తీర్చుకోడానికి విశ్రాంతి మందిరాలు కూడా ఏర్పాటు చేయించాడు.

## అశోక చక్రవర్తి

చంద్రగుప్తుని మనుమడు అశోకుడు. అశోకుడు కూడా తాతగారి వలెనే గొప్ప సామ్రాజ్యం నిర్మించాడు: ప్రజానురక్తుడై న్యాయబద్ధంగా రాజ్యం పాలించాడు. భారతదేశాన్ని పరిపాలించిన చక్రవర్తులందరిలో అగ్రగణ్యుడు అశోకుడేనని చాలమంది నమ్మకం.

అశోకుడు రాజ్యానికి వచ్చినప్పుడు, భారత దేశం దాదాపు అంతా అతని ఏలుబడి కిందనే ఉండేది. ఒక్క కళింగ రాజ్యం మాత్రం స్వతంత్రంగా ఉండేది. ఈనాటి ఒరిస్సా ప్రాంతమే అప్పటి కళింగ. తన తాతగారి వలె తాను కూడా సామ్రాజ్యాన్ని విస్తరింపజేయాలనే సంకల్పంతో అశోకుడు గొప్ప సైన్యాన్ని తీసుకొని కళింగ మీదికి దండెత్తాడు. కళింగ సైన్యం సామాన్యమైనది కాదు, అందులో 700 ఏనుగులు ఉన్నాయి. రెండు సేనల మధ్య పెద్ద యుద్ధం జరిగింది. ఇరువైపులా అనేక వేలమంది హతులైనారు. లెక్కకు మిక్కిలిగా సైనికులు గాయపడ్డారు. చివరికి అశోకునికే విజయం లభించింది. అయితే ఇందువల్ల అతనికి హర్షం కలగడానికి బదులు అతని మనస్సు ఎంతో కలవరపడింది. అశోకుడు స్వతహా దయాశీలి. యుద్ధంలో జరిగిన ఘోరమైన రక్తపాతం చూసి ఖిన్నుడై, తాను ఇక ఎన్నడూ ఒరలో నుంచి కత్తి దూయనని శపథం చేసాడు. తన రాజ్యంలో యుద్ధభేరుల మోత వినబడరాదని కూడా ఆజ్ఞాపించాడు.

కళింగ యుద్ధం జరిగిన తరువాత అశోకుడు బౌద్ధమతం స్వీకరించాడు. ఆ రోజులలో రాజులు తరచుగా వేటకు వెళ్ళి వన్యమృగాలను చంపుతూ ఉండేవారు. ఏ ప్రాణినీ హింసించరాదన్న బుద్ధదేవుని ఆదేశం ప్రకారం అశోకుడు మృగయా వినోదాన్ని విసర్జించడమే కాకుండా చివరికి మాంసాహారాన్ని కూడా వర్జించాడు. జంతు వధను నిషేధించాడు.

అశోకుడు స్వచ్ఛమైన జీవనాన్ని సాగించాడు. తన ఛత్రం కింద ఉన్న సామ్రాజ్యం విస్తారమైనది కావడంవల్ల తాను దేశంలో అంతటా స్వయంగా తిరిగి ప్రజలకు మతబోధ

చేయడం సాధ్యంకాదు. అందువల్ల అశోకుడు దానికి ఒక ఉపాయం ఆలోచించాడు. రాతిపని వారిని పిలిపించి, ప్రజలకు తానివ్వదలచిన సందేశాలను శిలా స్తంభాలపై శాసనాలుగా చెక్కించాడు. ప్రజలకు సులభంగా అర్థమయ్యే భాషలో వాటిని వ్రాయించాడు. ఆ శిలా స్తంభాలను దేశం నాలుగు మూలలా పంపించి అందరూ చదువుకునేలా ప్రదర్శింపజేసాడు.



సారనాథ్ (వారణాసి) లోని స్తంభం మీది సింహాలు. ఇదిఇప్పుడు మన ప్రభుత్వ చిహ్నం

అయితే ఈ శాసనాలలో వ్రాయబడిందేమిటి? అసత్యమాడకూడదని, జీవహింస చేయరాదని, సాటి మానవులను, జంతువులను దయతో చూడాలని అశోకుడు ఈ శాసనాల ద్వారా ప్రజలకు ఉపదేశించాడు. ఇవన్నీ గౌతమ బుద్ధుడు ప్రచారం చేసిన బోధనలే. వీటితో బాటు అశోక చక్రవర్తి తన ప్రజలను కన్న బిడ్డలవలె ప్రేమించి వారికెట్టి సౌకర్యాలను సమకూర్చాడో, ఏవిధంగా వరిపాలించేవాడో ఆ వైనం కూడా ఈ శాసనాలు తెలియజేస్తున్నాయి.

అశోక చక్రవర్తి నెలకొల్పిన శిలాశాసనాలు చాలవరకు ఇప్పటికీ చెక్కు చెదరకుండా ఉన్నాయి. అనేక శతాబ్దాలుగా అశోకుని అమరవాణి చెరగని ఈ శిలాక్షరాల ద్వారా భారత ప్రజలకు మృధుమధురంగా వినవస్తోంది. రాతితో కట్టడాలను నిర్మించిన మొదటి చక్రవర్తి కూడా అశోకుడే.

బౌద్ధమత వ్యాప్తికి అశోకుడు అనేక విధాల కృషి చేశాడు. పెక్కుమంది పండితులను, పరివ్రాజకులను విదేశాలకు పంపి బౌద్ధమత ధర్మాలను వ్యాపింపజేశాడు. మనకు ఈ కాలంలో ఆవిరి ఓడలు, విమానాలు ఉండడంవల్ల ఎంతో దూరాన ఉన్న దేశాలు కూడా అతి దాపున ఉన్నట్లు అనిపిస్తోంది. కాని, ఆ రోజులలో దూరప్రయాణాలు చేయాలంటే బహు ప్రయాసగా ఉండేది. అయినా అశోక చక్రవర్తి దూరాభారాలకు లెక్కచేయక అపారంగా ధనం వెచ్చించి నేలనాలుగు చెరగులా బౌద్ధమతాన్ని విస్తరింపజేశాడు.


అశోకుని సామ్రాజ్యం
కాశ్మీరు
గాంధారం
శ్రీనగర్
తక్షశిల
హిమాలయ పర్వతాలు
బ్రహ్మపుత్ర
లుంబిని
సింధు
కుశినగరం
గంగ
సారనాథ్
పాటలీపుత్రం
యమున
బుద్ధగయ
మాల్వ
మగధ
వింధ్య పర్వతాలు
నర్మద
గోదావరి
మహారాష్ట్ర
కళింగ
ఆంధ్రులు
కృష్ణ
కావేరి
పాండ్యులు

అశోకుడు దేశంలో ఉన్న బౌద్ధ పుణ్యక్షేత్రాలన్నీ సేవించాడు. బుద్ధ భగవానుడు జన్మించిన లుంబిని, తపశ్చర్య చేసి బోధి అయిన గయ, కాలధర్మం చెందిన కుశీనగరం మొదలైన తీర్థాలకు యాత్రలు చేశాడు. గౌతమ బుద్ధుడు పుట్టిన చోట గురుతుగా ఒక స్తంభం నెలకొల్పాడు. బౌద్ధ సన్యాసులు నివసించడానికి పెక్కు చోట్ల ఆరామాలు కట్టించాడు. ఇలా లెక్కలేనన్ని విహారాలను నిర్మించి నందువల్లనే, మగధకు విహారాల దేశం లేదా బీహారు అని పేరు వచ్చింది. బౌద్ధమతాన్ని గురువుల ముఖతః శిష్యులు అధ్యయనం చేసేందుకు వీలుగా అశోకుడు అనేక విద్యా పీఠాలను కూడా స్థాపించాడు.

అశోకుడు నెలకొల్పిన స్తంభాలలో ఒకదాని మీద నాల్గు దిశలకూ అభిముఖమై, ఒకదాని వీపునకొకటి ఆనుకొని ఉన్న నాలుగు సింహపు ప్రతిమలున్నాయి. ఈ స్తంభం సారనాథ్ వద్ద ఉంది. అనేక చోట్ల అశోకుని శిలా శాసనాలపై ధర్మచక్రం చెక్కబడి ఉంది. బుద్ధుని ధర్మోపదేశాలకు ఈ ధర్మచక్రం ఆనవాలు. ఈ ధర్మచక్రమే నేటి స్వతంత్ర భారతదేశపు జాతీయ పతాకం మీద కూడా అవతరించింది. దీనికి తోడు సారనాథ్‌లోని అశోక స్తంభం మీద ఉన్న సింహాల ప్రతిరూపం కూడా మన ప్రభుత్వ అధికార ముద్రపై వెలసింది.

# అశోకుని తరువాత పరిస్థితి

తోటలో పూలు కోసుకొనేటప్పుడు, కోసిన పూలన్నీ బొత్తిగా కలిపి జాగ్రత్తగా పట్టుకుంటేనే తప్ప లేకపోతే ఏ చిన్న గాలి వీచినా అవి నాలుగు వైపులా చెదిరిపోతాయనేది అనుభవంలో ఉన్న విషయమే. అశోకుని తాతగారు చక్రవర్తి కావడానికి పూర్వం దేశం అంతా చిన్న చిన్న రాజ్యాలుగా చీలి ఉండేది. ఆ రాజ్యకుసుమాలు చెల్లాచెదరు అయి పోకుండా వాటిని గుత్తిగా కలిపి గుప్పిట పెట్టుకున్న అశోకుడు అస్తమించగానే ముక్కలు చెక్కలుగా దేశం చీలిపోవడం మొదలుపెట్టింది. అశోకుడు ఏరాజ్యాన్ని జయించడం కోసం భీషణ సమరం సాగించవలసి వచ్చిందో ఆ కళింగ ప్రాంతమే ముమ్ముందుగా అతని సామ్రాజ్యంలోంచి విడిపోయింది. ఇలాగే అనేక ఇతర ప్రాంతాలుకూడా చీలిపోయి దేశం అతుకుల బొంతగా తయారైంది.

## మినాండర్

ఇటువంటి పరిస్థితిలో వాయవ్యాన బాక్ట్రియా అనే ఒక చిన్న దేశంలో నివసిస్తున్న గ్రీకులకు పంజాబుమీద కన్ను పడింది. దేశాన్ని అంతా కూడగట్టుకొని రాగల సమర్థులెవరూ లేనందువల్ల ఎవరికి వారే రాజ్యాలను నిర్మించుకోవడానికి దేశం మీద బయలుదేరారు. అలెగ్జాండరు వెంటవచ్చిన గ్రీకులలో అనేక మంది బాక్ట్రియాలో స్థిరపడి ఉన్నారు. అదను దొరకగానే వీరు పంజాబును వశపరచుకొని, అక్కడ దాదాపు వంద సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా పరిపాలన సాగించారు. ఈ రాజులందరిలోకి ఎన్నదగినవాడు మినాండర్. మినాండర్ బహుప్రజ్ఞావంతుడు, ధైర్యశాలి. ప్రజలను దయతో చూసుకొనేవాడు. భారతీయుల ఆచార వ్యవహారాలు అతని మనస్సుకు నచ్చినందువల్ల వాటిని అవలంబించి దాదాపుగా ఒక భారతీయునివలె అతడు జీవించాడు. అంతేగాక బౌద్ధమతం మీద గౌరవంతో ఆ మతాన్ని స్వీకరించాడు. సదస్సులకు పండితులను ఆహ్వానించి వారితో మత సంబంధమైన చర్చలు చేయడం అంటే అతనికి మిక్కిలి మక్కువ. ఈ విధంగా మినాండర్ పండిత గోష్ఠిలో జ్ఞానార్జన చేస్తూ కాలం వెళ్లబుచ్చేవాడు.

పోతే ఇటు గ్రీకులనుండి భారతీయులు కూడా కొన్ని కొత్త విషయాలు నేర్చుకున్నారు. విగ్రహాలను తయారు చేయడంలో గ్రీకులు సిద్ధహస్తులు. గ్రీకుల వరవడిలో శిల్పఖండాలను మలచడం భారతీయులు అభ్యసించారు. ఈవిధమైన శైలికే గాంధార శిల్పమని పేరు. ఈనాటి ఆఫ్ఘానిస్థాన్‌లో ఉన్న ఖండహార్ ప్రాంతాన్ని ఆ రోజుల్లో గాంధారదేశమని పిలిచేవారు. గాంధార శైలిలో మలచిన చక్కని బుద్ధుని విగ్రహాలనేకం నేటికీ నిలిచి ఉన్నాయి.

గ్రీకుల తరువాత మధ్య ఆసియా నుండి బలశాలురైన శకజాతి వారు, అటుపిమ్మట పర్షియా నుండి పహ్లావులు భారతదేశంలోకి బలప్రయోగంతో చొచ్చుకొని వచ్చారు. అటు తరువాత కొంత కాలానికి చైనా దేశపు పశ్చిమ సరిహద్దునుండి కూడా కొన్ని ఆదిమ జాతులు మనదేశంలోకి ప్రవేశించాయి. సుమారుగా క్రీస్తు జన్మించిన కాలంలో జరిగిన సంఘటనలివి.

## కనిష్కుడు

ఈ విధంగా మనదేశంలోకి వచ్చిన జాతులన్నింటిలో కుషానులు క్రమంగా బలవంతులయ్యారు. వారికి కనిష్కుడనే గొప్ప నాయకుడు ఉండేవాడు. కనిష్కుడు పరాక్రమశాలి. అనేక యుద్ధాలలో గెలుపొంది పెద్ద సామ్రాజ్యాన్ని నిర్మించాడు. ఇటు రాజధానియైన పెషావరు నుండి అటు తూర్పున పాట్నా వరకు రాజ్యాన్ని వ్యాపింపజేశాడు. అనగా పంజాబు, కాశ్మీరు, సింధు, గుజరాతు ప్రాంతాలను అతడు తన సామ్రాజ్యంలో కలిపి వేసుకున్నాడు. ఇవికాకుండా మధ్య ఆసియాలోని ప్రాంతాలు కూడా అనేకం కనిష్కుని ఆధీనంలో ఉండేవి.

ఒకనాడు అశ్వఘోషుడనే గొప్ప బౌద్ధ పండితుడు కనిష్కుని చూడవచ్చి, గౌతమ బుద్ధుని మహిమను గురించి, ఆయన బోధనలను గురించి ఉపన్యసించాడు. అది విని ముగ్ధుడైన కనిష్కుడు వెంటనే బౌద్ధ మతావలంబియై, తన సామ్రాజ్యంలో బౌద్ధ మత వ్యాప్తికి అనేక విధాలుగా కృషి చేశాడు. కనిష్కుని కాలంలో అనేక చోట్ల ఆలయాలు నిర్మించబడి, బోధి సత్వుని ప్రతిమలు అసంఖ్యాకంగా ప్రతిష్ఠించబడ్డాయి. బౌద్ధ పండితులు పరిశోధనలు జరుపుతూ శిష్యులకు శాస్త్రబోధ చేసేందుకు విద్యా పీఠాలు కూడా అనేకంగా వెలిశాయి.

కుషానురాజులు దాదాపు 300 సంవత్సరాలు పరిపాలించారు. తరువాత వారి ప్రాబల్యం క్రమంగా క్షీణించింది.

# దక్షిణాదిలో వెలసిన తొలి రాజ్యాలు

దక్షిణ భారతదేశంలో వెలిసిన రాజ్యాలలో పాండ్య, చోళ, చేర రాజ్యాలు అతి ప్రాచీనమైనవి. ఇవి అనేక వందల సంవత్సరాల కాలం మూడు పువ్వులూ ఆరు కాయలుగా వర్ధిల్లాయి. వీటికి తలమానికమై, పాండ్యరాజ్యం వినుతికెక్కింది. ఈ రాజుల ప్రశస్తి ఉత్తర భారతావనికి కూడా పాకింది. సుదూరాన ఉన్న గ్రీసు నుంచి చంద్రగుప్త మౌర్యుని ఆస్థానానికి విచ్చేసిన గ్రీకు రాయబారి మెగస్తనీస్ పాండ్యరాజ్య వైభవాన్ని గురించి, వారి అపారమైన సేనావాహినులను గురించి ఎన్నో అద్భుతమైన గాథలను కర్ణాకర్ణిగా విన్నవి తన గ్రంథంలో ఉటంకించాడు. చేర రాజులు కూడా ఐశ్వర్యవంతులే. పశ్చిమ ఆసియాలోని ఆయా దేశాలకు వారు నౌకలలో సుగంధ ద్రవ్యాలు, ముత్యాలు మొదలైన వస్తు సంభారాలను ఎగుమతి చేసి అపారంగా సువర్ణ ధనధాన్యాలను ఆర్జించేవారు. చేరరాజ్యంలో కోటికి పడగలెత్తిన వ్యాపార శ్రేష్ఠులు అనేక మంది ఉండేవారు. చోళ రాజులను గురించి విపులంగా తరువాత తెలుసుకుందాం.

## సాతవాహనులు

మౌర్య సామ్రాజ్యం విచ్ఛినమైన కొన్ని సంవత్సరాలకు ఆంధ్ర దేశంలో ఒక గొప్పరాజు బయలుదేరి సాతవాహనులనే రాజవంశాన్ని స్థాపించాడు. సాతవాహనులు క్రమంగా శక్తిమంతులై దేశం మధ్య తమ సామ్రాజ్యాన్ని అటు అరేబియా సముద్రతీరం నుంచి ఇటు బంగాళాఖాతం వరకు వ్యాపింప చేశారు. వారు 300 ఏళ్ళకు పైచిలుకు రాజ్యమేలి దాక్షిణాత్యుల, ఉత్తర భారతీయుల ఆచార వ్యవహారాలను మేళవింపజేయడానికి ఎంతో పాటుపడ్డారు.

సాతవాహనుల సామ్రాజ్యంలో హిందువులు, బౌద్ధులు కలిసి అన్నదమ్ములవలె సుఖంగా జీవించేవారు. నేటి ఆంధ్ర ప్రదేశ్‌లో అమరావతివద్ద, నాగార్జునకొండవద్ద బయల్పడిన చక్కని విగ్రహాలు, రమణీయ భవనాల చిత్రాలను మీరు చూసే ఉంటారు. ఇవి పూర్వకాలం

నాడు సాతవాహనరాజులు నిర్మించినవే. ఈ రాజులు పెద్ద పెద్ద కొండలలో గుహలు తొలిపించి వాటిలో రమణీయమైన దేవాలయాలను నిర్మించారు. ప్రపంచ ప్రఖ్యాతి పొందిన అజంతా గుహాలయాలు కూడా సాతవాహనుల కాలంలోనే ప్రారంభించబడ్డాయి. క్రమంగా వారి తరువాత వచ్చిన రాజులు కూడా మరి కొన్ని కొత్త చిత్రాలను, విగ్రహాలను వాటికి చేరుస్తూ వచ్చారు.

సాతవాహన రాజులు ఇతర దేశాలతో విస్తారంగా వర్తక వ్యాపారాలు సాగించేవారు. విదేశాలకు ఎగుమతి చేయదలచిన వస్తుసామగ్రులను నేటి బొంబాయికి సమీపంలో ఉన్న కల్యాణ్‌కు రవాణా చేసి, ఆ రేవుపట్టణం మీదుగా వాటిని నౌకలలో ప్రపంచం నాలుగు మూలలకూ ఎగుమతి చేసేవారు. అప్పటి వర్తకులు విదేశాలతో వ్యాపారం వల్ల విశేషంగా ధనవంతులయ్యారు. స్వంత ఖర్చుతో వర్తకులు కూడా కొందరు పెద్ద పెద్ద గుహాలయాలను తమ పేరు మీద కట్టించారు.

# గుప్తరాజుల స్వర్ణయుగం

మగధలో చంద్రగుప్తుడనే యువకుడు ఉండేవాడు. అప్పటికి 500 సంవత్సరాల క్రిందట మగధ రాజ్య మేలిన అశోక చక్రవర్తి తాతగారి పేరు కూడా ఇదేనని ఇంతకు ముందు మీరు చదివారు. గుప్త వంశానికి చెందిన ఈ తరువాత కాలపు చంద్రగుప్తుడు కూడా తనపేరిటి మౌర్య చక్రవర్తివలెనే గొప్ప సామ్రాజ్యాన్ని నిర్మించి సార్ధక నాముడు అనిపించుకోవాలని అభిలషించాడు.

చంద్రగుప్తుడు ఒక గొప్ప ఇంటి బిడ్డ. కుమారదేవి అనే రాకుమార్తెను పెళ్ళి చేసుకున్నాడు. ఆ రాజకుటుంబానికి సుక్షేత్రమైన మాగాణి భూములనేకం ఉండటమే కాకుండా విస్తారమైన పలుకుబడి ఉండేది. చంద్రగుప్తుడు తన భార్య ఆస్తిని పెంచి ఒక చిన్న మండలంగా తయారుచేశాడు. ఈ చిన్న రాజ్యమే క్రమేణా విశాలమైన సామ్రాజ్యంగా అభివృద్ధి చెందింది. చంద్రగుప్తుడు ఈ విధంగా గుప్త వంశరాజులకు మూలపురుషుడయ్యాడు. ఈ రాజులు తమ ప్రజలను సమర్థతతో పరిపాలించి, ఐశ్వర్య సౌభాగ్యాలతో దేశం తులతూగేటట్లు చేశారు. అందుకని గుప్తరాజులు పాలించిన కాలం మన చరిత్రలో స్వర్ణయుగంగా కీర్తించబడింది.


సముద్రగుప్తుడు చక్కగా వీణ వాయించేవాడు

## సముద్రగుప్తుడు

చంద్రగుప్తుని కుమారుడు సముద్రగుప్తుడు గొప్ప యోధుడు. పట్టాభిషేకం కాగానే

సముద్రగుప్తుడు సేనలను వెంటబెట్టుకొని దిగ్విజయ యాత్రకు ఉపక్రమించాడు. ముందు తమ రాజధాని నుంచి పడమటి దిక్కుగా సాగి చంబల్ నదిని చేరుకున్నాడు. అటుపైన తూర్పు దిక్కుకు మరలి కళింగ దాకా జైత్రయాత్ర చేశాడు. ఆ తరువాతక దక్షిణాభిముఖుడై మధ్య భారతంలోని కీకారణ్యాలగుండా సాగి, కాంచీపురం, మలబారులవరకు ఉన్న ప్రదేశాలన్నీ ఆక్రమించుకున్నాడు. సముద్రగుప్తుడు తన సైన్యాన్ని మొత్తం 3000 మైళ్ళ దూరం నడిపించి, ఆ పరిధిలోపల ఉన్న రాజ్యాలన్నింటిని వశపరచుకున్నాడు. ఈ జైత్రయాత్రలో అతడు ఒక్కసారియైనా ఓటమి పొందలేదు. లెక్కలేనంత బంగారము, సిరిసంపదలతో సముద్రగుప్తుడు రాజధానికి తిరిగి వచ్చాడు. చేజిక్కిన సంపదనంతా ప్రజాహిత కార్యాలకు వినియోగపరచాడు.

ప్రాచీన కాలంలో రాజులు దిగ్విజయ యాత్ర చేసిన తరువాత రాజధానికి తిరిగివచ్చి చక్కగా అలంకరించిన ఒక మేలు జాతి శ్వేతాశ్వాన్ని దేశం మీద స్వేచ్ఛగా వదలిపెట్టేవారు. ఆ తెల్లగుఱ్ఱం నేల నాలుగు చెరుగులా యథేచ్ఛగా సంచరిస్తూ ఉండేది. ఎవరైనా దానిని అటకాయించి పట్టుకొన్నట్లయితే అతను ఆ గుర్రాన్ని వదిలిపెట్టిన రాజుతో యుద్ధం చేయవలసి ఉండేది. ఒకవేళ శ్వేతాశ్వం ఎవరిచేతా పట్టుకొనబడకుండా క్షేమంగా తిరిగివచ్చిన పక్షంలో అది సంచరించిన దేశమంతా ఆ రాజు సార్వభౌమత్వాన్ని గుర్తించి ఆయన అదుపాజ్ఞలకు లోబడి ఉండడానికి అంగీకరించిందని అర్థం. తరువాత రాజధానికి తిరిగి వచ్చిన గుఱ్ఱాన్ని బలియిచ్చి రాజు అశ్వమేధయాగం చేసేవాడు. సముద్రగుప్తుడు కూడా ఇదేవిధంగా శ్వేతాశ్వాన్ని విడిచిపెట్టాడు. ఆ గుఱ్ఱాన్ని పట్టుకోవడానికి ఎవ్వరూ సాహసించలేకపోయారు. దానితో సముద్రగుప్తుడు దేశానికి చక్రవర్తినని ప్రకటించుకున్నాడు.

సముద్రగుప్తుని సామ్రాజ్యం ఈ విధంగా ఎంతో విస్తరించి పెద్దదైంది. గొప్ప యోధులుగా పేరుపొందిన కుషానులు, శకులు సహితం సముద్రగుప్తుని పరాక్రమం చూసి వెరగు చెందారు. సముద్రగుప్తుడు కేవలం వీరుడేకాదు, విద్వాంసుడు కూడా. విద్వాంసుల ఎడల సముద్రగుప్తునికి అపారమైన భక్తి ప్రపత్తులు ఉండేవి. ఆయన గొప్ప కళాతపస్వి. సంగీత సాహిత్యాలను ప్రేమించడమేకాక, వీణావాదనంలో స్వయంగా నేర్పరి. చక్కని కవిత అల్ల నేర్చినవాడు. చిత్రలేఖనం అన్నా, సాహిత్యం అన్నా ఆయనకు మిక్కిలి మక్కువ. సముద్రగుప్తుడు లలితకళలను అభిమానించి వాటిని అనేక విధాల పోషించాడు.

## విక్రమాదిత్యుడు

సముద్రగుప్తుని కుమారుడైన చంద్రగుప్త విక్రమాదిత్యుడు గుప్తరాజులందిలో శ్రేష్ఠుడు. విక్రమాదిత్యుడనేది ఈతని బిరుదు. పరాక్రమంలో సూర్యునివంటివాడని దీని అర్థం. పేరుకు తగినట్లుగానే, ఈ రాజు ప్రతిభ మధ్యందిన మార్తాండునివలె ప్రకాశించేది. విక్రమాదిత్యుడు కూడా తన తండ్రి తాతల వలె తనకు సంక్రమించిన సామ్రాజ్యాన్ని మరింతగా విస్తరింపజేశాడు. పడమట ఉన్న భూములను ఒక్కటొక్కటే ఆక్రమించుకున్నాడు. దీనితో పడమటి కోస్తాలో ఉన్న రేవులన్నీ ఆయన ఆధీనంలోకి వచ్చాయి. ఈ రేవులనుండి రోము, ఈజిప్టు మొదలైన దేశాలకు ఓడలలో రత్న వైఢూర్యాలు, రవసెల్లాలు, సుగంధ ద్రవ్యాలు ఎగుమతి అవుతూ ఉండేవి. ఈ వ్యాపారం వల్ల మనదేశ సిరి సంపదలు ఇనుమడించసాగాయి.

## ఫాహియాన్

నాటికి కొన్ని వందల సంవత్సరాల క్రిందట దేశవిదేశాలలో బౌద్ధ మతం వ్యాపించ జేయడానికి అశోకుడు పండితులను అనేక మందిని ప్రచారకులుగా పంపాడు. చైనాలో కోట్లాది ప్రజలు ఈ మత ప్రచారకుల ప్రబోధాలు విని బౌద్ధ మతం పుచ్చుకున్నారు. వీరిలో ఒకరు ఫాహియాన్. విక్రమాదిత్యుని కాలంలో ఫాహియాన్ భారత దేశం వచ్చి, తానిక్కడ ప్రత్యక్షంగా కన్నవీ విన్నవీ పుస్తకాలుగా వ్రాశాడు. విక్రమాదిత్యుని పరిపాలనలో ప్రజలు సర్వత్రా సంపత్సౌఖ్యాలతో సంతుష్టిగా జీవించేవారు. వారికి ఏవిధమైన లోటూ లేదు. వారు వినయవంతులు. ఇతరులను మర్యాదగా పలుకరించి అచ్చటగా ముచ్చటించేవారు. ఒకరినొకరు ఆదరించుకునేవారు. పేద ప్రజల నిమిత్తం అన్నపానాది వసతులతో విశాలమైన సత్రాలు, రోగులకు ఉచితంగా చికిత్స చేసేందుకు వైద్యశాలలు ఉండేవి. జంతువులకు కూడా చికిత్సాలయాలు నెలకొల్పబడ్డాయి. ప్రజలు భూతదయ, దైవభక్తి కలిగి ఉండేవారు. మాంసాహారులు బహు అరుదు.

విక్రమాదిత్యుని ఆస్థానం కవి, గాయక, పండిత ప్రముఖులతో, లలిత కళోపాసకులతో అలరారుతూ ఉండేది. చక్రవర్తి వారిలో శ్రేష్ఠులను తొమ్మండుగురిని ఎన్నుకొని వారికి నవరత్నాలని పేరుపెట్టాడు. కవికుల గురువు కాళిదాసు ఈ రత్నాలలో నాయకమణిగా విక్రమాదిత్యుని ఆస్థానం అలంకరించాడని కొందరి అభిప్రాయం. కాళిదాసు రచించిన నాటకాలలో ''అభిజ్ఞాన శాకుంతలం'' సుప్రసిద్ధమైనది. ఆయన కావ్యాలలో ''రఘువంశం,''

''మేఘదూత'' రసవత్తరమైనవి. అయితే ఈ మహాకవి ఏకాలంవాడో ఇదమిత్థంగా ఇంతవరకు నిర్ణయం కాలేదు.

గుప్తయుగం నాటి కవులు సంస్కృతభాషా పారంగతులు. పూర్వకవులు ఎవ్వరూ వ్రాయనంత మధురంగా కమనీయ కావ్యాలనేకం సంస్కృతంలో వీరు రచించారు. గుప్తరాజులు సంస్కృతభాషా పోషకులు. పురాణాలవంటి అనేకమైన పవిత్ర గ్రంథాలను వీరు పండితులచేత వ్రాయించారు. శిల్పకళ కూడా వీరి కాలంలోనే ఉచ్ఛదశ చేరుకున్నది. కనులకు విందు చేసే సుందర విగ్రహాలు, రమ్య హర్మ్యాలు ఈ కాలంలో అనేకంగా వెలిశాయి. కళాకారులకు అది నిజంగా స్వర్ణయుగం. ఏమంటే దానశీలురైన రాజులు ఆ కాలంలో లలితకళలను ఆదరించి బహుధా పోషించేవారు. అజంతా గుహలను గురించి ఇంతకు ముందే వ్రాసిఉన్నాం. అక్కడి శ్రేష్ఠమైన కుడ్యచిత్రాలలో కొన్ని గుప్తయుగంలో అవతరించినవే.

విక్రమాదిత్యుని తరువాత గుప్తరాజులు మరికొందరు రాజ్యం చేశారు. మొత్తం 160 ఏళ్లు వారి పరిపాలన సాగింది. అయితే ప్రపంచంలో మంచి అనేది ఏదీ కలకాలం వర్ధిల్లదు కదా! గుప్తవంశం అంతరించిన తరువాత మనదేశానికి ఒక మహావిపత్తు వాటిల్లింది. అదే హూణుల ఆగమనం.

# హూణులు

క్రౌర్యానికి పేరుమోసిన ఈ భయంకరమైన హూణజాతివారు మొదట మధ్య ఆసియాలో నివసించేవారు. వీరు ఎక్కడా స్థిరంగా కాపురం ఉండకుండా తమ పశువుల మందలతో ఒకచోటు నుంచి ఇంకొక చోటుకి దేశాలు పట్టి తిరుగుతూ ఉండేవారు. మెట్టభూములలోను, కొండలలోను, గుట్టలలోను నివసిస్తూ విసుగెత్తినప్పుడు పచ్చని పచ్చిక నేలలను వెదుక్కుంటు ముందుకు సాగిపోయేవారు. ఇలా వారిలో కొందరు యూరప్‌కు తరలిపోగా, మరికొందరు భారత్‌లో ప్రవేశించారు. బందిపోటు గుంపులవలె హూణులు దేశంలో దోపిడీలు, గృహదహనాలు సాగిస్తూ స్వైరవిహారం చేస్తూ వచ్చారు.

హూణులు గుఱ్ఱపు స్వారీలో గొప్ప నేర్పరులు. రోజులు తరబడి జీను దిగకుండా స్వారీ చేస్తూ కళ్లు మూతలు పడినప్పుడు పరుగు తీస్తున్న గుఱ్ఱం మీదనే కునుకు తీసేవారు. ఎక్కడైనా మకాము చేయదలుచుకుంటే తోలు గుడారాలు వేసుకుని వాటిలో తలదాచుకునేవారు. పచ్చి మాంసమే తింటూ, పులిసిన పాలు పురిసెడు తాగేవారు. విలువిద్యలో వీరిది అందెవేసిన చెయ్యి. లక్ష్యం ఎంత దూరాన ఉన్నా గురి తప్పకుండా బాణం వేయగలరు. ఈటెను విసరగలరు.

హూణులు వేలసంఖ్యలో తింగణాల మీద ఇలా స్వారీ చేసుకుంటూ వచ్చి పంజాబ్, రాజస్థాన్, కథియావాడ్‌లపై విరుచుకుపడ్డారు. తూర్పున బీహారు దాకా పరవళ్లు పెట్టారు. మెట్టిన ప్రతిచోటా దోపిడీలు సాగిస్తూ కనిపించిన వారినల్లా హతమారుస్తూ ఇళ్లకు చిచ్చుపెడుతూ దావానలంలాగా ఉరకలు వేశారు. వారి పేరు చెబితేనే జనానికి వణుకు పుట్టేది. దాడి చేసినచోట ఆ రోజు రాత్రికి డేరాలలో నిద్రపోయి మర్నాడు పొద్దునే బిచాణా ఎత్తి మరో ఊరికి గుఱ్ఱాల మీద దౌడు తీసుకుంటూ పోయేవారు. మళ్లీ అక్కడ దోపిడీలు, హత్యలు, గృహదహనాలకు ఉపక్రమించేవారు. వారి బీభత్సకృత్యాలకు హద్దూ పద్దూ ఉండేదికాదు.

హూణుల దండయాత్ర జరిగినప్పుడు ఉత్తర భారతదేశంలో స్కంధగుప్తుడు

పరిపాలిస్తున్నాడు. ఆయన ఒకసారి హూణులను ఓడించాడు. కాని ఆయన మరణించిన అనంతరం హూణులను అరికట్టగలిగిన వారెవ్వరూ లేకపోయారు. హూణుల నాయకుడు తోరమానుడు ఆ అదను చూసుకొని, ఒక బంగారపు సింహాసనం చేయించుకొని, చక్కని పట్టుదుస్తులు ధరించి తానే రాజునని ప్రకటించుకొన్నాడు. అతని రాజధాని శకల. ఆ స్థలానికిపుడు సయాల్‌కోట్ అని పేరు. సయాల్‌కోట్ ఇప్పుడు పాకిస్థాన్‌లో ఉంది. ప్రజలు తోరమానుని లోలోపల ఎంత ద్వేషించినప్పటికి అతని క్రౌర్యానికి జడిసి అతనికి అణిగి మణిగి ఉండేవారు.

దాదాపు 70 సంవత్సరాలు దేశంలో బీభత్సం తాండవించింది. తోరమానుని కుమారుడు మిహిరగులుడు క్రౌర్యంలో తండ్రికంటె ఒక ఆకు ఎక్కువ చదివి తండ్రిని మించిన కొడుకనిపించుకున్నాడు.

హూణులు స్థిరపడి క్రమంగా సామ్రాజ్యం నిర్మించుకొన్నప్పటికీ ప్రజలు వారిని ప్రబలంగా ద్వేషించినందువల్ల వారి రాజ్యం చిరకాలం నిలవలేదు. చివరకు మధ్యభారతదేశపు రాజైన యశోధర్మన్ వారిని చిత్తుగా ఓడించాడు. ఆ తర్వాత కొంత కాలానికి హూణులు కూడా భారతప్రజలలో కలిసిపోయి ఏ అనాహూతాలు లేకుండా ప్రశాంతాంగా జీవించసాగారు.

# హర్షవర్ధనుడు

నీకన్న లేమిలో ఉన్నవారికి ముందువెనుకలు చూడకుండా నీకున్న సొమ్మంతా దానం చేయగలవా? అలా చేయగలిగితే, నీవు హర్షవర్ధనుడంతటివాడివి అనిపించుకోగలుగుతావు. హర్షవర్ధనుడు మన దేశాన్ని పాలించిన మహారాజులలో ఒకడు.

థాణేశ్వర్ రాకుమారుడైన హర్షుడు పరాక్రమశాలి, దయాశీలి. జనానికి హర్షుడంటే అపారమైన ప్రేమ. అతని సోదరి రాజ్యశ్రీని కన్యాకుబ్జ రాజుకిచ్చి పెళ్ళి చేశారు. హర్షుడు 16 ఏళ్ళ ప్రాయంలో ఉండగా శత్రురాజు రాజ్యశ్రీ భర్తను వధించి ఆమెను కారాగారంలో బంధించాడు. యువ హర్షుడు శత్రురాజు మీద దండెత్తి అతనిని ఓడించి సోదరిని చెఱవిడిపించాడు. కన్యాకుబ్జ రాజ్యంలోని మంత్రులు రాకుమారుని ధైర్య పరాక్రమాలను చూసి మెచ్చుకొని ఆయనను తమ రాజ్యానికి కూడా రాజుగా ఉండవల్సిందిగా అర్థించారు. ఈ విధంగా థాణేశ్వర్, కన్యాకుబ్జ రాజ్యాలు ఒకటై హర్షుడు ఆ సామ్రాజ్యానికి చక్రవర్తిగా పట్టాభిషిక్తుడయ్యాడు.

అటు తరువాత హర్షుడు ఎడతెగకుండా విజయయాత్రలు సాగించి, కొత్త రాజ్యాలనేకం ఆక్రమించుకున్నాడు. ఆరేళ్ళు అతని సైనికులు శిరస్త్రాణాలను, నడుము దట్టీలను విప్పనే లేదు. విశ్రమించడానికికూడా వారికి తీరిక లేకపోయింది. హర్షుని ఏనుగుల యూథాలు ఎప్పుడూ యుద్ధానికి సిద్ధంగా హౌదాలతో సజ్జితమై ఉండేవి. ఇలా ఎన్నో యుద్ధాలు చేసి చేసి హర్షుడు తన సామ్రాజ్యాన్ని అటు పంజాబు నుంచి ఇటి బెంగాలు దాకా విస్తరింపచేశాడు. హర్ష సామ్రాజ్యం చంద్రగుప్త విక్రమాదిత్యుని సామ్రాజ్యానికి విస్తీర్ణంలో ఎంత మాత్రం తీసిపోలేదు. అయినా, హర్షుడు ఇంకా పెద్ద సామ్రాజ్యాన్ని నిర్మించాలని సంకల్పించాడు. ఆ ఉద్దేశ్యంతో దక్షిణాపథంపై కూడా దండెత్తాడు. అయితే దక్కను ప్రాంతంలో రాజ్యం చేస్తున్న చాళుక్య రాజైన పులకేశి హర్షుని సేనలను నర్మదానది దాటిరాకుండా అటకాయించగలిగాడు.

హర్షుని ఆస్థానంలో బాణుడనే కవీశ్వరుడు ఉండేవాడు. హర్షుని గుణగుణాలకు ముగ్ధుడైన

బాణుడు సంస్కృతంలో ''హర్ష చరిత''మనే పేరుతో ఒక గొప్ప గ్రంథం రచించాడు. మీరు సంస్కృతం నేర్చుకొని ఆ పుస్తకం చదువుకుంటే, హర్షచక్రవర్తి ఎంతటి ధర్మమూర్తి అయినదీ మీకే తెలుస్తుంది. బాణుడు ''కాదంబరి'' అనే ప్రసిద్ధి పొందిన ఒక నవల కూడా వ్రాశాడు.



హర్షుని కలుసుకునేందుకు బయలుదేరిన యువాన్ చ్వాంగ్

## యువాన్ చ్వాంగ్

హర్షుని కాలంలో చైనా దేశం నుంచి వచ్చిన యువాన్ చ్వాంగ్ అనే బౌద్ధ పండితుడు నాటి స్థితిగతులను వర్ణిస్తూ పుస్తకం వ్రాశాడు. ఫాహియాన్ వలెనే యువాన్ చ్వాంగ్ కూడా బౌద్ధ తీర్థాలను సేవించి, బౌద్ధమత గ్రంథాలను సేకరించడానికి భారతదేశం వచ్చాడు. ఆ రోజుల్లో భారతదేశం పండితులకు జ్ఞానులకు పేరు మోసింది. యువాన్ చ్వాంగ్ పండితుడు. చైనా నుంచి బయలుదేరి భూమార్గాన కొండలు, గుట్టలు, నదులు దాటి మిక్కిలి ప్రయాసతో భారత్ చేరుకున్నాడు. ఎడార్లలో ప్రయాణం చేస్తూ అనేక పర్యాయాలు దారి తప్పిపోయాడు. ఎన్నో సార్లు తాను, తాను స్వారీ చేసే గుఱ్ఱము అడుగుతీసి అడుగు వేయలేనంతగా డస్సి, దప్పికతో సొమ్మసిల్లిపోవడం జరిగింది. కాని యువాన్ చ్వాంగ్ పట్టు విడువలేదు. బుద్ధ భగవానుడు జన్మించిన భూమిని కళ్లారా చూసి తరించాలనే కాంక్షతో అన్ని కష్టాలను, ఆపదలను అధిగమించి కడకు భారతదేశం చేరుకున్నాడు.

యువాన్ చ్వాంగ్ కన్యాకుబ్జం చేరినప్పుడు హర్షవర్ధనుడు మంత్రులతో పరివారంతో రాజధానిని వదలి రాజ్యంలో సంచారం చేస్తున్నాడు. యువాన్ చ్వాంగ్ కన్యాకుబ్జంలో దిగాడన్న వార్త అందగానే ఆయనను వెంటనే తన శిబిరానికి బయలుదేరి రమ్మని హర్షుడు కబురు పెట్టాడు. యువాన్ చ్వాంగ్ రాజు కోరిక ప్రకారం తక్షణమే కన్యాకుబ్జం నుంచి బయలుదేరి కొన్ని రోజులు ప్రయాణం చేసి ఒకనాడు చీకటి పడుతుండగా ఒక నది ఒడ్డుకు చేరుకున్నాడు. నదికి ఆవలి ఒడ్డునే హర్షుని శిబిరం. ఆ రాత్రికి తాను ఇవతలి ఒడ్డున

విశ్రమించి మరునాటి ఉదయం నదిని దాటి చక్రవర్తిని కలుసుకుందామన్న ఉద్దేశ్యంతో యువాన్ చ్వాంగ్ అక్కడ డేరా వేసుకున్నాడు. ఉన్నట్టుండి అర్థరాత్రి వేళ యువాన్ చ్వాంగ్‌కు నగారాల మోత వినిపించింది. వేనవేల కాగడాల వెలుతురులో నది మెరిసిపోయింది. యువాన్ చ్వాంగ్‌ను చూడాలని ఆత్రపడుతున్న హర్షునికి తెల్లవారే దాకా వేచి ఉండడం చేతకాక పోయింది. హర్షుడు పరివార సమేతంగా తానే నదిని దాటి ఎదురు వస్తున్నాడని యువాన్ చ్వాంగ్ గ్రహించాడు. వారు ఒకరినొకరు చూసుకున్నప్పుడు ఇద్దరి ఆనందానికి మేరలేక పోయింది. హర్షుడు, రాజ్యశ్రీ యువాన్ చ్వాంగ్‌తో ఎడతెగకుండా మతచర్చలు జరిపి తుదకు ఇద్దరూ బౌద్ధమతాన్ని స్వీకరించారు.

తరువాత హర్షుడు యువాన్ చ్వాంగును పెద్ద ఊరేగింపుతో కన్యాకుబ్జానికి తోడ్కొని వెళ్లాడు. మంగళవాద్య ధ్వనులతో మార్గమంతా మారుమోగిపోయింది. రమ్యంగా అలంకరించిన ఒక ఏనుగు మీద బంగారంతో చేసిన బుద్ధుని ప్రతిమ ఒకటి ప్రతిష్ఠించారు. సువర్ణ పుష్పాలు, ఆణిముత్యాలు, సుగంధ ద్రవ్యాలను హర్షుడు దారిపొడుగునా వెదజల్లుతూ రాగా, అందరూ బ్రహ్మాండమైన ఊరేగింపుగా తరలి వెళ్లారు. ప్రజలు పండుగ దుస్తులు ధరించి కాలి నడకన వేల సంఖ్యలో అనుసరించారు. అనేకమంది నదిలో పడవలమీద వెంట వెళ్లారు. కన్యాకుబ్జం పొలిమేరలో పురజనులు ఎదురువెళ్ళి వారికి గొప్ప స్వాగతమిచ్చారు. బౌద్ధమతాన్ని గురించి యువాన్ చ్వాంగ్ చేసిన ప్రసంగాలు విని పౌరులలో అనేకులు బౌద్ధ మతావలంబులయ్యారు.

హర్షవర్ధనుడు బౌద్ధమతం పుచ్చుకొన్నప్పటికీ హిందువుల వలెనె సూర్యుడు, శివుడు వంటి దేవతలను కూడా ఆరాధించేవాడు. ఆయన అన్ని మతాలను గౌరవించాడు. హర్షుడు కరుణానిధి. అయిదేళ్ళకొకసారి ప్రయాగ వెళ్ళి అక్కడవున్న బీదసాదలకు వంటిమీది ఆభరణాలు, దుస్తులతోసహా తనవద్ద ఉన్న ధనం యావత్తూ దానం చేసి వచ్చేవాడు. హర్షుడు ఈ ప్రకారం ఆరు పర్యాయాలు తన సర్వస్వాన్నీ పేద ప్రజలకు పంచిపెట్టాడు. ఒకసారి ఇలా దానాలు చేయడంలో ఆభరణాలతో బాటు తన కట్టు గుడ్డలు కూడా బీదలకు పంచి వేశాడట. అప్పుడు తన సోదరివద్ద పాత బట్ట ఒకటి అరువు తీసుకుని హర్షుడు దానిని వంటికి కప్పుకున్నాడట!

హర్షుడు తన రాజ్యంలో జంతువధ జరుగకూడదని నిషేధించాడు. రాజధానిలో రోజూ 1000 మంది బౌద్ధులకు, 500 మంది బ్రాహ్మణులకు సంతర్పణ జరిగేది. రాజ్యం అంతటా

పేద ప్రజల కోసం సత్రాలు నిర్మించబడ్డాయి. అన్నవస్త్రాలకు ఎవరికీ లోటుండేదికాదు. రాజ్య నిర్వహణలో హర్షుడు తనకు పూర్వులైన అశోకుడు, చంద్రగుప్తుడు వంటి మహనీయుల అడుగు జాడలనే అనుసరించాడు. హర్షునికి సంగీత సాహిత్యాలమీద, చిత్రలేఖనంమీద మక్కువ ఉండడమే కాకుండా ఆయన స్వతహా కవి, నాటక రచయిత.

యువాన్ చ్వాంగ్ వ్రాసిన గ్రంథాన్ని బట్టి నాటి స్థితిగతులు మనకు వివరంగా తెలిశాయి. యువాన్ చ్వాంగ్ బీహారులో ఉన్న నలందకు కూడా యాత్ర చేశాడు. నలందలోని బౌద్ధ విశ్వవిద్యాలయానికి దూరదేశాల నుంచి కూడా విద్యార్థులువచ్చి, చదువుకుంటూ ఉండేవారు. వేలసంఖ్యలో మతగురువులు, ఆచార్యులు ఈ విశ్వవిద్యాలయంలో నివసిస్తూ గురుకుల పద్ధతిలో విద్యార్థులకు చదువు చెబుతూ ఉండేవారు. ఇక్కడి విద్యార్థులు, ఉపాధ్యాయులు యువాన్ చ్వాంగ్ రాకకు సంతోషించి ఆయనకు గొప్ప స్వాగతమిచ్చారు.

దాదపు 15 ఏళ్ళు ఈవిధంగా దేశాటనం చేసిన తరువాత యువాన్ చ్వాంగ్‌కు స్వదేశానికి తిరిగి వెళ్లాలని సంకల్పం కలిగింది. ఈ సంగతి తెలిసి హర్షుడు ఖిన్నుడయ్యాడు. విచారంతో ఆ వృద్ధ పండితునికి వీడ్కోలుచెప్పి అనేక కానుకలు సమర్పించాడు. ఎముకలు కొరికే చలిలో ప్రయాణం సాగించవలసి ఉంటుంది. కనుక యువాన్ చ్వాంగ్ రాజిచ్చిన బహుమతులలో ఒక్క ఉన్ని కోటు వస్త్రమే స్వీకరించాడు. యువాన్ చ్వాంగ్ తీసుకువెళ్ళదలచిన పుస్తకాలు, చిత్రాలు, ప్రతిమలను మోసుకువెళ్లడానికి కొన్ని గుర్రాలను, ఆయన స్వారీ చేసేందుకు ఒక ఏనుగును హర్షుడు ఆయనకు సమర్పించాడు. చివరికి వీడ్కోలు చెప్పి యువాన్ చ్వాంగ్‌ను విడవలేక విడువలేక విడిచిపెట్టాడు. యువాన్ చ్వాంగ్ కనుమరుగైన వెంటనే హర్షుడు విషాదంతో కుంగిపోయాడు. హర్షుడు తక్షణమే గుర్రం మీద బయలుదేరి ఊరి పొలిమేరలో యువాన్ చ్వాంగును మళ్లీ కలుసుకొని చివరిసారిగా వీడ్కోలు చెప్పి విధిలేక రాజధానికి తిరిగి వచ్చాడు.

# పల్లవులు, చాళుక్యులు

ఉత్తరదేశంలో హర్షవర్ధనుడు పరిపాలించిన కాలంలో, దక్షిణాపథంలో పల్లవ రాజులు ఉచ్ఛదశకు వచ్చారు. పల్లవులు మొదట సాతవాహనులకు సామంతులు. సాతవాహనుల ప్రాబల్యం క్షీణించిన తరువాత పల్లవులు స్వతంత్రులై స్వంత రాజ్యం నిర్మించుకున్నారు. దక్షిణదేశంలో వీరి పరిపాలన దాదాపు మూడు శతాబ్దాలు సాగింది. పల్లవుల రాజ్యంలో కాంచీపురంవద్ద గొప్ప విశ్వవిద్యాలయం ఉండేది. దేశంలో నాలుగు మూలలనుంచీ సంస్కృతం అభ్యసించడానికి ఎందరెందరో ఈ విద్యా పీఠానికి వస్తూ ఉండేవారు. కాంచీపురం ఆ కాలంలో దక్షిణ దేశంలోకెల్లా గొప్ప విద్యా సాంస్కృతిక కేంద్రంగా వినుతికెక్కింది.

నేటి మద్రాను నగరానికి దాపున ఉన్న మహాబలిపురంలో పల్లవులు అనేక దేవాలయాలు నిర్మించారు. నాటి శిల్పులు ఇక్కడ గండశిలలను మలచి పెద్ద పెద్ద జంతువులుగా, రథాలుగా చెక్కారు. కొండలను తొలిచి రమణీయమైన అలయాలుగా గండరించారు. ఇవన్నీ పల్లవుల కాలం నాటి శిల్పాలే. యువాన్ చ్వాంగ్ తన దేశాటనంలో మహాబలిపురం కూడా సందర్శించాడు. పల్లవుల శిల్పకళా సంపదకు ముగ్ధుడై, వారిని అందుకు చాలా మెచ్చుకొన్నాడు.



*మహాబలిపురంలో ఏకశిలలపై పెద్దగా జంతువుల ప్రతిమలను చెక్కారు*

పల్లవులు బలాఢ్యులై ఉన్న కాలంలోనే ఇటు గోదావరి ప్రాంతంలో చాళుక్యులు

రాజ్యం చేసేవారు. బలపరాక్రమాలలో సమానులైన చాళుక్యులకు, పల్లవులకు దాదాపు రెండు శతాబ్దాల పాటు వైరం సాగింది. పల్లవుల వలెనే చాళుక్యులకు కూడా పెద్ద నౌకాదళం ఉండేది. తమ వ్యాపార నౌకలలో వారు దేశ విదేశాలతో వర్తకం సాగించేవారు. మలయా, ఇండొనీషియా ప్రజలు చాళుక్య దేశపు నావికులను మిత్రులుగా స్వీకరించి సత్కరించేవారట.

హర్షుడొకసారి దక్షిణదేశం కూడా జయించాలని అక్కడికి దండెత్తి వెళ్లిన సంగతి లోగడ వ్రాసిఉన్నాం. అపారమైన సైనిక బలం, అంతులేని సంపద కలిగిఉన్న హర్షవర్ధనుణ్ని సైతం పులకేశి అనే దక్షిణ దేశపు రాజు ఓడించి వెనుకకు తరిమి వేయగలిగాడు. పైన చెప్పిన చాళుక్య వంశానికి చెందినవాడే ఈ పులకేశి.

# భూ, సముద్ర మార్గాలపై రాకపోకలు

హిందూ మహాసముద్రంలో బాలీ అనే ద్వీపం ఉంది. ఇప్పుడది ఇండోనేషియా దేశంలో భాగం. ఈ ద్వీపంలో నివసించే ప్రజలు, అచ్చుగా మన మోస్తరుగానే రామాయణ గాథను నృత్య నాటక రూపాలలో ప్రదర్శిస్తారు. అక్కడి ప్రజలు జరుపుకునే పండుగలు, పర్వాలు, వారు పాటించే ఆచారాలు, కట్టుబాట్లు చాలావరకు మన వాటినే పోలి ఉంటాయి. ఎంతో దూరాన ఉన్న వారికీ మనకూ ఇన్ని పోలికలు ఎలా వచ్చాయని మీరడగవచ్చు.

చాలా పూర్వకాలం క్రిందటే దక్షిణదేశ ప్రజలు దృఢమైన నౌకలను నిర్మించేవారు. ఈ నౌకలలో వారు ముత్యాలు, రత్నాలు, సుగంధ ద్రవ్యాలు, నూలు వస్త్రాలను, నెమళ్లవంటి పక్షులను ప్రాచ్య పాశ్చాత్య దేశాలకు ఎగుమతి చేసేవారు. ఒక పర్యాయం మన దేశపు రాకుమారుడొకడు ఆరు పెద్ద నౌకలలో ఐదువేల మందిని వెంట తీసుకొని జావా ద్వీపానికి వెళ్లాడు. వీరు మళ్లీ భారత దేశానికి తిరిగి రాలేదు. ఆ ద్వీపంలోనే స్థిరపడిపోయారు. జావా ద్వీపవాసులు వీరినుండి అనేక కొత్త విషయాలు నేర్చుకొన్నారు. అంతేకాక ఈ ఆగంతుకుల మతాన్ని, భాషను అవలంబించారు. భారతదేశంలో దేవాలయాలను, గోపురాలను ఎలా నిర్మిస్తారో ఆ శిల్పరీతులను కూడా జావా ప్రజలు వీరివద్ద నేర్చుకున్నారు. ఈ విధంగా క్రమేణా జావా ద్వీపం మన సంస్కృతీ సంప్రదాయాలకు నిలయమై భారత దేశానికి ఒక చిన్న ప్రతిరూపంగా తయారైంది.

ఇదేవిధంగా ఇంకా కొన్ని ఇతర దేశాలు కూడా భారతీయ సంస్కృతీ, సంప్రదాయాల చేత ఆకర్షించబడి, వాటిని అవలంబించాయి. కాంబోడియా, థాయ్‌లాండ్, మలయాలలో ఇప్పటికీ అనేక చోట్ల శిలలపై సంస్కృత భాషలో చాలాకాలంనాడు చెక్కిన శాసనాలను, రచనలను చూడవచ్చు. ఈ దేశాలలో అసంఖ్యాకంగా ఉన్న హిందూ బౌద్ధ దేవాలయాలలో కొన్నిటిని చూస్తే అచ్చుగా మనదేశంలోని ప్రాచీన దేవాలయాలను చూస్తున్నట్లే ఉంటుంది.

దాదాపు 2000 సంవత్సరాలనాడు రోమన్లు వాడిన బంగారు నాణాలు, మట్టి పాత్రలలో కొన్ని దక్షిణదేశంలో దొరికాయి. అక్కడినుండి అవి ఇంతదూరం ఎలా వచ్చాయన్న ప్రశ్న

కలుగుతుంది. మనదేశం నుండి రోముకు ఎగుమతి చేసిన వస్తువులకు బదులుగా ఈ నాణాలు, మట్టి పాత్రలు ఇక్కడకు దిగుమతి అయి ఉండాలి. భారతదేశం ఆ కాలంలో రోముతోనే కాకుండా ఈజిప్టు, ఇరాక్, తదితర మధ్యధరాసముద్ర ప్రాంత దేశాలతోకూడా విస్తారంగా వర్తకం సాగించేది. ఈ మధ్యధరాసముద్ర ప్రాంత దేశాలన్నీ అటు రోముతో కూడా వ్యాపారం చేసేవి. ప్రాచీన కాలంలోనే భారతదేశ కోస్తాలో ఇటు గుజరాతు నుండి అటు బెంగాలు వరకూ గొప్ప ఓడ రేవులనేకం ఉండేవి. దూరదేశాలనుండి వచ్చే నావికులు ఈ రేవులలో దిగి అక్కడి పట్టణాలలో జట్లుజట్లుగా తిరిగేవారని, ఆయా దేశాలనుంచి వారుతెచ్చిన రకరకాల సరకులతో మన రేవు పట్టణాలలోని గిడ్డంగులు ఎప్పుడూ నిండి ఉండేవని ప్రాచీనగాథల వల్ల తెలుస్తోంది.

అంత పూర్వకాలంలోనే మనదేశ నావికులు దూరదేశాలకు సముద్రాలమీద ప్రయాణాలు చేయగిలిగే వారంటే, సముద్రయానానికి అనువైన పెద్ద పెద్ద నౌకలను నిర్మించడం మనవారికి అప్పటికే తెలుసునన్నమాట. దీనికి మించిన ముఖ్యవిషయం ఆ కాలపు నావికులు ప్రాణాలకు తెగించిన పరమ సాహసికులు, ఉత్సాహవంతులు అయి ఉండాలి.

ప్రాచీనకాలంలో ఒక్క సముద్రం మీదనేగాక భూమార్గాలగుండా కూడా రాకపోకలు విశేషంగా జరుగుతూ ఉండేవి. అశోక చక్రవర్తి పనుపున బౌద్ధమత వ్యాప్తికై పండితులు అనేకమంది కొండ కనుమలగుండా వాయవ్యాన ఉన్న ఆఫ్ఘనిస్థాన్, బాక్ట్రియా మొదలైన దేశాలకు వెళ్లేవారని లోగడ తెలుసుకున్నారు. ఒక పర్యాయం సాక్షాత్తూ అశోకుని కుమారుడు, కుమార్తె కూడా సింహళం వెళ్ళి బౌద్ధమత ప్రచారం చేశారని ప్రతీతి. చైనా నుండి పెక్కుమంది యాత్రీకులు మనదేశం వచ్చి అనేక కొత్త విషయాలు తెలుసుకొని తాము ఆర్జించిన జ్ఞాన సంపదతోబాటు కోరిన వస్తుసామగ్రి కూడా కొల్లలుగా తమతో తీసుకొని వెళ్ళేవారు. ఇటు భారతదేశంనుంచి కూడా పెక్కుమంది పండితులు చైనాకు వెళ్లేవారు. దుర్గమమైన భూమార్గాలలో భారతీయులు పలువురు టిబెట్టుకు, మధ్య ఆసియా దేశాలకు ప్రయాణాలు చేసేవారు.

ఈ విధంగా భారతదేశ పేరు ప్రఖ్యాతులు ఆనాటికే ప్రపంచం అంతటా వ్యాపించాయి.

# శంకరాచార్యులు

హర్షుడు మరణించిన తరువాత సుమారు నూరేళ్ళకు దక్షిణ దేశంలో కేరళలో మహనీయుడైన మహాపురుషుడొకరు జన్మించారు. అతని పేరు శంకరుడు. అతడు చిన్నతనంలోనే సంస్కృత భాషను అభ్యసించి, గొప్ప విద్వాంసుడయ్యాడు. హిందూ మతస్థులకు పరమ పవిత్రమైన ఉపనిషత్తులను, పురాణాలను తదితర గ్రంథాలను క్షుణ్ణంగా మథించి వాటి సారాన్ని కరతలామలకం చేసుకొన్నాడు. పిన్నవయస్సులో పండితుడైన శంకరునికి అనేక సందేహాలు పొడమసాగాయి. ''భౌతిక ప్రపంచం వాస్తవమైనదేనా?'', ''భగవంతుడెవరు?'' ''నేనెవరిని?'' మొదలైన ప్రశ్నలతో శంకరుడు అహోరాత్రులు మథన పడుతూ తనలోతాను ఎప్పుడూ మీమాంస చేసుకుంటూ, కొంతకాలానికి గొప్ప వేదాంతి అయ్యాడు.

శంకరుడు పదునైన మేథకలవాడు. అపారమైన ప్రతిభా సంపన్నుడు. తాను కనిపెట్టిన వేదాంత రహస్యాలను ప్రచారం చేయడానికి శంకరుడు దేశసంచారం మొదలుపెట్టాడు. ఆ రోజులలో అనువైన ప్రయాణ సాధనాలు లేవు. యువకుడైన శంకరుడు కాలినడకనే దేశాటనం చేస్తూ తన వేదాంత విజ్ఞానాన్ని దేశమంతటా వెదజల్లాడు. తనను సవాలు చేసిన వారితో ఓపికగా వాదించి తర్కబలంతో ప్రతిపక్షులను ఓడించి, ప్రజలకు తన సిద్ధాంతాలమీద గట్టి విశ్వాసం కుదురుకొనేట్టు చేశాడు. వినుగూ విరామం లేకుండా శంకరులు వాదనలు, బోధనలు చేస్తూ వచ్చారు. చివరికి కన్యాకుమారి మొదలుకొని కాశ్మీరం వరకు దేశంలో ఉన్న అశేష ప్రజానీకమూ శంకరుని సిద్ధాంతాలనుగురించి ముచ్చటించుకోసాగారు. శంకరులు అనేక వేదాంత గ్రంథాలను, భక్తి శ్లోకాలను రచించారు. శంకరుని వేదాంత బోధనలు హిందూమతం బలపడడానికి ఎంతో తోడ్పడ్డాయి. ఆయన వేదాంత ప్రచార ప్రభావంవల్ల ఎంతోమంది బౌద్ధులు హిందువులయ్యారు. క్రమంగా హిందూ, బౌద్ధమతాల మధ్య వ్యత్యాసమే కనుపించనంతగా సన్నిహితమైన పోయాయి. శంకరుని పుణ్యమా అని హిందూ మతం మళ్ళీ పూర్వపు ఔన్నత్యాన్ని అందుకోగలిగింది.

శంకరులు తమ వేదాంతబోధకు దేశంలో నాలుగు కేంద్రాలను స్థాపించారు. అవిః

ఉత్తరాన బదరీనాథ్, దక్షిణాన శృంగేరి, పశ్చిమాన ద్వారక, తూర్పున పూరి. ఈ స్థలాలలో శంకరులు మఠాలను స్థాపించడంవల్ల అవి గొప్ప తీర్థాలై నేటికీ పవిత్ర క్షేత్రాలుగా పరిగణించబడుతున్నాయి. ఈ మఠాలలోని విద్యార్థులు శంకరుని వేదాంత సూత్రాలను పఠించి పారాయణచేస్తూ యోగులుగా జీవించేవారు. క్రమంగా వారి శిష్య పరంపర దేశం నలుమూలలకూ వెళ్ళి శంకరుని సిద్ధాంతాలను సర్వత్ర వ్యాపింపజేశారు.

''ఆచార్య''డంటే గురువు లేక అధ్యాపకుడు అని అర్థం. శంకరులు క్రమంగా శంకరాచార్యులపేర దేశమంతటా ప్రసిద్ధులయ్యారు. భారతదేశంలో జన్మించిన గొప్ప వేదాంతులలో, మతబోధకులలో శంకరాచార్యులు తలమానికం వంటివారు.

శంకర భగవత్పాదులు 32 ఏళ్ల లేత వయస్సులోనే హిమాలయాలలో కేదరనాథ్ వద్ద సిద్ధి పొందారు.

# సామాన్య ప్రజల స్థితిగతులు

ఇంతవరకూ ప్రాచీన కాలానికి చెందిన మనరాజులు, చక్రవర్తులు, మహాపురుషులను గురించి చదివారు. మరి ఆ రోజులలో సామాన్య ప్రజల స్థితిగతులెలా ఉండేవి? వారి ఆహార విహారాలు, వేషభూషలు ఎలాంటివి? వారు వాడుతూవచ్చిన భాషలేమిటి? వాటి లిపులెట్టివి?

ముందు మీరొక విషయం జ్ఞప్తిలో ఉంచుకోవాలి. ఇప్పటి కంటె అప్పుడు దేశంలో ప్రజల సంఖ్య చాలా తక్కువ. ఈ నాడు మన దేశ జనాభా సుమారు 100 కోట్లు. గౌతమ బుద్ధుని మొదలుకొని హర్షవర్ధనుని వరకు జరిగిన కాలంలో ప్రజల స్థితిగతులను గురించి ఇప్పుడు తెలుసుకుందాం. ఆ కాలంలో మనదేశ జనాభా కొద్ది కోట్లు మాత్రమే. కాబట్టి అప్పుడు గ్రామాల సంఖ్య కూడా బహుతక్కువ అన్నమాట. సాగులో ఉన్న భూమి విస్తీర్ణమూ స్వల్పమే. దేశంలో చాలా ప్రాంతం అడవులతో నిండి ఉండేది. హరప్పా, మొహంజోదారో పట్టణాలు వెలసినప్పుడు, సింధుప్రాంతమంతా పెద్ద అడవిగా ఉండేదని మీరు లోగడనే తెలుసుకొన్నారు.

ఆర్యులు వచ్చిన తరువాత మనదేశంలో పెద్ద పెద్ద పట్టణాలు అనేకం వెలిశాయి. అయోధ్య, మిథిల, హస్తినాపురం, మొదలైన పౌరాణిక నగరాల గురించి ఇదివరకే చదివారు. పాటలీపుత్రము, కన్యాకుబ్జాలను గురించి కూడా కొంత తెలుసుకున్నారు. ఇటువంటివే మరి కొన్ని పట్టణాలు ఉండేవి. వీటిలో కొన్ని నగరాలు సామ్రాజ్యాలకు రాజధానులుగా, కొన్ని ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలుగా విలసిల్లాయి. అనేక రేవు పట్టణాలు కూడా ఉండేవి. బెంగాలులో తామ్రలిప్తి, ఈనాటి బ్రోచ్ అనే చోట భృగుకచ్ఛ, మహారాష్ట్రలో సోపార, దక్షిణదేశంలో కావేరీ పట్టణం నాటి ప్రసిద్ధ రేవు పట్టణాలు. వారణాసి, గయ, ప్రయాగ వంటి పుణ్యక్షేత్రాలకు దేశం అన్ని వైపులనుంచి జనం తండోపతండాలుగా తీర్థయాత్రల నిమిత్తం వచ్చేవారు. ఆయా స్థలాలలో వెలసిన విద్యాపీఠాలనుబట్టి, వాటి చుట్టూ పెరిగి పెద్దవై ప్రసిద్ధి పొందిన మహానగరాలు కూడా అనేకం ఉన్నాయి. వందలకొలదీ విద్వాంసులు, వేదాంతులు ఈ విశ్వవిద్యాలయాలలో నివసిస్తూ, దేశవిదేశాల నుంచి వచ్చిన శిష్యపరంపరకు విద్యాదానం

చేసేవారు. ఉత్తరాన తక్షశిల, తూర్పున నలంద, విక్రమశిల, పడమటన వలభి ఈవిధంగా విద్యాపీఠాలుగా ప్రఖ్యాతిపొందిన నగరాలే. పోగా దక్షిణాన కాంచీపురం కూడా గొప్ప సంస్కృత విద్యాపీఠంగా పేరు పొందింది.

ఆ కాలంలో ప్రతి పట్టణంలో విశాలమైన వీధులు, మంచినీటి సౌకర్యాలు, నగరాల నుంచి వెలుపలకు మురుగు పారించడానికి కాల్వలు ఉండేవి.

కాగా అప్పటి విద్యావిధానం వేరుగా ఉండేది. ఈ రోజులలో మాదిరి పాఠశాలలు అప్పుడు లేవు. చదువుకొనేఈడు వచ్చిన బాలురు ముఖ్యంగా బ్రాహ్మణ, క్షత్రియ కులాలవారు తమకు నచ్చిన ఒక గురువును ఎన్నుకొని ఆయన ఇంటిలోనే నివసిస్తూ విద్యాభ్యాసం చేసేవారు. ఈ విధంగా గురువుల సన్నిధిలో 12 ఏళ్లు గడిపి, విద్య సొంతం పూర్తి అయిన తరువాతనే తమ ఇండ్లకు వారు తిరిగి వేళ్లేవారు. విద్యార్థులు ఎంత సంపన్న కుటుంబంలో పుట్టినవారైనప్పటికీ ఇతర సహపాఠకులతోబాటు గురువుల ఇండ్లలోనే నివసించేవారు. ఇదే ప్రాచీనకాలపు గురుకుల విద్యావిధానం. బాలికలకు తలిదండ్రులే తగిన విద్యలను నేర్పేవారు. కాగా కొందరు బాలికలు బాలురవలెనే గురువుల వద్ద చేరి విద్యాభ్యాసం చేసిన వారున్నూ లేకపోలేదు.

ఇప్పటివలెనే అప్పుడు కూడా తల్లిదండ్రులు ఇండ్లలో తమ బిడ్డలకు రామాయణ, మహాభారతాలవంటి పురాణాలను, నీతి కథలను బోధించేవారు. బ్రాహ్మణ విద్యార్థులకు, ఇతర ఉచ్ఛకులాల వారికి మాత్రమే శాస్త్రాలను అధ్యయనం చేసే అధికారం ఉండేది. ఇక మామూలుగా అన్ని కులాలవారూ చదువను, వ్రాయను నేర్చుకోవడంతోబాటు సామాన్యమైన గణితం కూడా కొంత నేర్చుకుని ఉండేవారు. అందరూ తమ కులవిద్యలో తర్ఫీదు పొందేవారు. పిత్రార్జితంతోపాటు కులవృత్తులు కూడా వంశపారంపర్యంగా సంక్రమిస్తూ ఉండేవి. ఆ రోజులలో 64 కళలు, 64 చేతివృత్తులు వ్యాప్తిలో ఉన్నట్లు తెలుస్తోంది.

ప్రాచీన భారతావనిలో నివసించిన ప్రజలు బ్రాహ్మీ లిపిని ఉపయోగించేవారు. అశోకచక్రవర్తి శాసనాలు బ్రాహ్మీలిపిలోనే వ్రాయబడినాయి. ఈనాడు హిందీ, మరాఠీ, సంస్కృత భాషలలో ఉపయోగించే దేవనాగరిలిపి బ్రాహ్మీలిపి నుండి పుట్టినదే. ఇంతే కాకుండా, దేశంలో ఇప్పుడు వాడుకలో ఉన్న ఇంకా అనేక ముఖ్య భాషల తాలూకు లిపులన్నీ బ్రాహ్మీ నుండి ఉద్భవించినట్టివే. ఆ రోజులలో బ్రాహ్మీతోబాటు 'ఖరోష్ఠి' అనే

లిపి కూడా కొన్ని ప్రాంతాలలో వాడుకలో ఉండేది. అయితే ఒక విషయం మీరు గుర్తుంచుకోవాలి. ప్రాచీనకాలంలో నివసించిన ప్రజలు మన మాదిరి ఎక్కువగా వ్రాతపై ఆధారపడేవారు కాదు. విద్యార్థులు తమ గురువుల సన్నిధిలోనే శాస్త్రాలను, కావ్యాలను వల్లెవేసి పొల్లుపోకుండా కంఠస్థం చేసుకొనేవారు. అన్ని విద్యలను ఇలా కంఠోపాఠం చేసేవారంటే వారి జ్ఞాపకశక్తి ఎంత అద్భుతమో ఊహించుకోండి! అయితే వల్లె వేస్తున్నవి మననులో నాటుకొని తేలికగా నోటికి వచ్చేందుకుగాను ప్రాచీనులు చాలావరకు అన్నిరకాల శాస్త్రగ్రంథాలను పద్యరూపంలో ఛందోబద్ధంగా రచించేవారు. ఆ కాలంలో వైద్యం, వాస్తు, శిల్పం వంటి సాంకేతిక శాస్త్ర గ్రంథాలు కూడ పద్యకావ్యలుగానే రచించబడేవి.

భారతదేశానికి ఈజిప్టు, గ్రీసు వంటి ఇతర దేశాలకు ప్రాచీన కాలం నుంచీ వైజ్ఞానిక సంబంధాలు ఉంటూ వచ్చాయి. ఈజిప్టు, గ్రీసుల నుండి భారతీయులు రేఖాగణిత, ఖగోళశాస్త్రాలు నేర్చుకోగా, ఆ దేశాలు భారత్ నుంచి సంఖ్యావద్ధతిని స్వీకరించాయి. బీజగణితం (ఆల్జీబ్రా) మనదేశంలోనే కనిపెట్టబడింది. ఆ తరువాత ఆరబ్బులనుండి కూడా భారతీయులు అనేక విషయాలను గ్రహించి, వారికి తాము ఎన్నో కొత్త విషయాలు నేర్పారు. ప్రాచీన భారతావనికి చెందిన గణితశాస్త్రజ్ఞులందిరలో ఆర్యభట్టు సుప్రసిద్ధుడు. పూర్వకాలంలో గొప్ప వైద్యులు, శస్త్ర చికిత్సకులు కూడా ఉండేవారు. వీరిలో చరకుడు, శుశ్రుతుడు ఎక్కువగా పేరు పొందినవారు. ఆ కాలంలో కూడా బహుసున్నితమైన శస్త్ర చికిత్సా పరికరాలుండేవి. ఒక వెంట్రుకను నిలువుగా అనేకమైన సన్నని చీలికల కింద చీల్చగలిగిన బహు సున్నితమైన పరికరాలు కూడా ఉండేవట.

కులవ్యవస్థ ఎలా ప్రారంభం అయిందో మీరు చదివారు. హిందూ సమాజం నాలుగుకులాల కింద విభజించబడినట్లుగానే, వ్యక్తి జీవితం కూడా నాలుగుదశలు లేదా ఆశ్రమాలుగా విభజించారు. ఇందులో మొదటి దశ బ్రహ్మచర్యాశ్రమం. ఈ దశలో విద్యాభ్యాసం పూర్తి అవుతుంది. రెండవ దశ గృహస్థాశ్రమం. ఈ ఆశ్రమంలో వ్యక్తి వివాహితుడై భార్యా బిడ్డలతో సంసార జీవితం గడుపుతాడు. మూడవది వానప్రస్థాశ్రమం. ఈ దశలో మానవుడు సంసార తాపత్రయాలను మానుకొని ఏ అడవులకోపోయి తన వెనుకటి అనుభవాలను నెమరుకు తెచ్చుకుంటూ, మౌనియై సచ్చింతనతో కాలక్షేపం చేయాలి. ఇక చివరి దశ సన్యాసం. ఈ దశలో ప్రపంచంనుంచి పూర్తిగా వేరుపడిపోయి, సన్యాసం

పుచ్చుకొని ముముక్షువై జీవితశేషమంతా ఈశ్వరధ్యానంలో గడపాలి.

ఇక ఆ కాలపు బాలబాలికలను గురించి కూడా మీకు తెలుసుకోవాలని ఉండడం సహజం. నిజానికి మీకు, వారికి ఎందులోనూ తేడా లేదని చెప్పవచ్చు. ఆ కాలపు పిల్లలు కూడా మీలాగే కడుపునిండా పాలు తాగుతూ, గడ్డపెరుగు, మీగడ, నెయ్యి దోసిళ్ళకొద్దీ జుర్రుతూ ఉండేవారు. వారికీ మీ లాగానే మిఠాయిలు, తీపి వస్తువులంటే మహాప్రీతి. అయితే ఈనాడు ఎక్కువగా వాడుకలో ఉన్న బంగాళాదుంప, రామములక్కాయల వంటి కూరగాయలు ఆరోజులలో ఉండేవికావు. ఇలాంటి కూరగాయలన్నీ ఆ తరువాత వచ్చినవే. గ్రామస్థులు రెల్లుతో లేదా గడ్డితోనేసిన మట్టి ఇళ్ళలో నివసించేవారు. ఆ రోజులలో పెద్ద పెద్ద పట్టణాలలో ప్రభుత్వ కట్టడాలను కలపతో కట్టడమే పరిపాటి. అశోక చక్రవర్తి నివసించిన ప్రాసాదం ఇటుకలతోను కలపతోను నిర్మించబడిందని లోగడ తెలుసుకున్నాం. పాటలీపుత్రంలోని కోట కూడా ఇలా నిర్మించబడినదే.

ఇక ఆనాటి ప్రజలు ధరించిన దుస్తుల సంగతికి వద్దాం. ఉన్నత తరగతికి చెందినవారు మామూలుగా కుట్టుపనిలేని సన్నని వస్త్రాలు ధరించేవారు. అయితే చీరె, ధోవతి వంటి వస్త్రాలతోబాటు పరికిణీలు, పంట్లాములు కూడా వాడుకలో లేకపోలేదు. స్త్రీలు రకరకాల నగలు పెట్టుకొనేవారు. కాని అవి ఇప్పటి ఆభరణాల వంటివికావు. అజంతా గుహాలయాలలో ఉన్న చిత్రాలనుగానీ, శిల్పాలనుగానీ పరీక్షగా చూస్తే ఆ కాలపు స్త్రీలు ఏ రకాల నగలు ధరించేవారో తెలుసుకోవచ్చు. సిగలో పువ్వులు తురుముకోవడమే కాకుండా మెడలో పూలమాలలు వేసుకొనేవారు. చెవులలోకూడా పూలు సింగారించుకొనేవారు.

ఆరోజులలో ప్రయాణమంటే బహుప్రయాసతో కూడినపని. అయితే దేశం నాలుగు మూలలకూ రహదారులుండేవి. పెషావరు నుండి పాటలీపుత్రం వరకు వేసిన పెద్ద రహదారిని గురించి ఇంతకు ముందు చదివారు. చైనా యాత్రీకుడు ఫాహియాన్ ఈ రహదారుల వెంట సురక్షితంగా దేశాటనం చేశాడు. అతనికి దొంగలవల్ల ఎక్కడా ఏ విధమైన ఉపద్రవం కలుగలేదు. పుణ్యక్షేత్రాలకు వెళ్లే యాత్రికులు, చదువులకోసం విశ్వవిద్యాలయాలకు వెళ్ళవలసిన విద్యార్థులు ఎంత దూరాభార ప్రయాణమైనా నిశ్చింతగా చేసేవారు. ఇంతకుముందు శంకరాచార్యులవారిని గురించి మీరు చదివారు. ఆయన జీవించిన స్వల్పకాలంలోనే దేశం అంతటా ఆయన నాలుగు సార్లు పర్యటించారట!

నేడు దేశంలో హిందీ, తెలుగు, బెంగాలీ, మరాఠీ, తమిళం మొదలుగా ఎన్నో భాషలు వాడుకలో ఉన్నాయి. ఆ కాలంలో ఇంకా ఈ భాషలేవీ పుట్టలేదు. పండితుల వ్రాత కోతలే కాక, వారు ఒకరితో ఒకరు మాట్లాడుకొనడంకూడా సంస్కృతంలోనే జరిగేది. జనసామాన్యం మాత్రం పాలీ, ప్రాకృతభాషలను వాడేవారు. సామాన్య ప్రజలకు సైతం తాను బోధించే మత ధర్మాలు సులభంగా అర్థం కావాలన్న ఉద్దేశ్యంతో పండిత భాషయైన సంస్కృతంలో కాక పామరులు వాడుకొనే సామాన్య భాషలలోనే గౌతమబుద్ధుడు ధర్మ ప్రచారం చేశాడు. ఈ కారణంగానే బౌద్ధధర్మానికి చెందిన సాహిత్యమంతా చాలవరకు పాలీ భాషలో వచ్చింది. దేశంలో ఈనాడు వాడుకలో ఉన్న భాషలన్నింటిలోకి ఒక్క తమిళమే చాలా ప్రాచీనమైనదని చెప్పదగింది.

ఆ కాలపు ప్రజలు ప్రాచీన ధర్మశాస్త్రాలను, పండితుల బోధనలను తు. చ. తప్పకుండా అనుసరిస్తూ, నిష్ఠగా జీవితాలను గడిపేవారు. కుటుంబంలో కలహాలు ఏవైనా వస్తే, కుటుంబ పెద్దలే వాటిని పరిష్కరించేవారు. గ్రామప్రజలలో తగవులువస్తే గ్రామపంచాయితీలు తీర్పు ఇచ్చేవి. పంచాయితీలు గ్రామ వ్యవహారాలను చక్కబెట్టడంతోపాటు ప్రజలవద్ద పన్నులు వసూలుచేస్తూ, రాబడిలో రాజుల కివ్వవలసిన భాగం రాజులకు ఇచ్చి, మిగతా సొమ్ము గ్రామంకోసం ఖర్చు చేసేవి. వర్తక వాణిజ్యాల పర్యవేక్షణకు వర్తక ప్రముఖులతో కూడిన వాణిజ్యమండళ్లు ఉండేవి. న్యాయస్థానాలకు వివాదాలు విచారణకు వచ్చినప్పుడు వాటిని త్వరత్వరగా పరిష్కారం చేసేవారు. అయితే నేరస్తులకు ఇప్పటికంటె తీవ్రమైన శిక్షలు విధించేవారు. దొంగతనం చేసినవారికి ఆ కాలంలో మామూలుగా చేతులు నరకడమే శిక్ష. అబద్ధం ఆడినవారి నాలుకలు కోసివేసేవారు. ఎక్కడైనా దొంగతనం జరిగి దొంగ ఎవరో ఋజువు కాని పక్షంలో అనుమానం ఉన్నవారిని పట్టుకొని వారిచేత నిప్పుల్లో చేతులు పెట్టించేవారు. ఇలాంటి అగ్ని పరీక్షలో నిర్దోషులకు ఎలాంటి ప్రమాదమూ కలుగదనీ, నేరం చేసినవారికి మాత్రమే చేతులు కాలిపోతాయని అప్పటివారి విశ్వాసం.

రాజులు పెద్ద పెద్ద సైన్యాలను పోషిస్తూ ఉండేవారు. ఈ సైన్యాలను చతురంగ బలాలు అనేవారు. చతురంగ బలమంటే నాలుగు రకాల సైన్యం అన్నమాట. ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు, పదాతులు సైన్యంలో భాగాలు. ఇప్పటి యుద్ధాలలో వాడే టాంకుల మాదిరిగా అప్పుడు ఏనుగులు ఉపయోగించేవారు. ఏనుగుదళాలు శత్రుసేనలలను ఢీకొని

కాళ్ళ కింద మట్టగించి చెల్లాచెదురు చేసేవి. ధనుర్ధారులైన రథికులు ఏనుగుదళాల వెనుకనే యుద్ధ రంగంలో ప్రవేశించి అమ్ములవర్షం కురిపించేవారు. కంచుతోను, ఇనుముతోను చేసిన ఈటెలను, కత్తులను ఆశ్వికులు ప్రయోగించేవారు.

ఇలాంటి పూర్వకాలంనాటి విషయాలన్నీ ఎలా కనుక్కోగలిగారని మీకు ఆశ్చర్యం కలుగవచ్చు. రామాయణ, మహాభారతాలవంటి పురాణాలు, బౌద్ధుల మత గ్రంథాలు చదివితే, అప్పటి రాజాధిరాజులు, పండితులు, పామరులు ఎలా జీవించేవారో ఆ వైనం చాలావరకు తెలుస్తుంది. చంద్రగుప్తమౌర్యుని ముఖ్యమంత్రి చాణక్యుడు రచించిన అర్థశాస్త్రమనే గ్రంథంలో ప్రభువులు ఏవిధంగా ప్రజలను పరిపాలించాలో, ప్రజలు నెరవేర్చవలసిన విధులేమిటో, యుద్ధాలలో ఏవిధమైన వ్యూహాలను, తంత్రాలను అవలంబించాలో మొదలైనవి అనేకం వివరించబడ్డాయి. విష్ణుశర్మ రచించిన పంచతంత్రంలో కథలు మీరు విని ఉంటారు. రాజకుమారులు తెలిసికోవలసిన వివిధకళలు, అలవరచుకోవలసిన నీతి నియమాలు అందులో చక్కని కథలుగా చెప్పబడ్డాయి. కాళిదాసు, భవభూతి, భానుడు, బాణుడు, శూద్రకుడు మొదలైన మహాకవులు, పండితులు వ్రాసిన కావ్యాలవల్ల, నాటకాలవల్ల కూడా నాటి దేశ కాలపరిస్థితులను తెలుసుకోవడానికి వీలవుతున్నది.

మెగస్తనీస్, ఫాహియాన్, యువాన్ చ్వాంగ్ వంటి విదేశీ రాయబారులు, యాత్రీకులు మనదేశం వచ్చి, ఇక్కడ తాము విన్నట్టి, కన్నట్టి వింతలను విశేషాలను పుస్తకాలుగా వ్రాసారు. ఇవేగాకుండా పురాతన శిథిలాలను తవ్వితీసి వాటిని సూక్ష్మంగా పరిశీలించి కూడా మన చరిత్రకారులు గతాన్ని చాలవరకు ఊహించగలిగారు. సింధులోయలో తవ్వకాలు సాగించగా అనేక పురాతన నగరాల శిథిలాలు బయటపడ్డ విషయం మీరు ఎరిగి ఉన్నదే. స్కూలుకు వెడుతుండగా తోవలో నీకు ఏదో పక్షి ఈకలు నేల మీద కనిపిస్తాయి. అక్కడ రాలివున్న ఈకలను బట్టి ఆ తోవన పక్షి ఎగిరి వెళ్ళి ఉంటుందని వెంటనే నువ్వు ఎలా ఊహించగలవో అదేవిధంగా తవ్వకాలలో దొరికిన శిథిలాలను బట్టి శాస్త్రజ్ఞులు ఆ కాలపు చరిత్రను కొంతవరకు తెలుసుకోగలిగారు. సింధు లోయలో దొరికిన శిథిలాలలో శాసనాలు, రాజముద్రలు కూడా కొన్ని ఉన్నాయి. తరతరాల క్రిందట జీవించిన మన పూర్వీకులను గురించి ఇదివరకు తెలియని అనేక కొత్త సంగతులను వివరంగా తెలుసుకోవడానికి ఈ శిథిలాలు ఎంతగానో ఉపయోగపడ్డాయి.

# రాజపుత్రులు, చోళులు

రాజపుత్రవీరుల పరాక్రమం గురించి, వారి రాణుల ధైర్య సాహసాలను గురించి మన దేశంలో లెక్కలేనన్ని కథలు నేటికీ ప్రచారంలో ఉన్నాయి. యుద్ధంలో శత్రువుకు వెరచి పారిపోవడంకంటె హేయమైనది మరొకటిలేదని రసపుత్రవీరుల నినాదం. వారి స్త్రీలు మాననష్టం కంటె ప్రాణత్యాగం మేలని భావించేవారు. మానం కాపాడుకోవడానికి మార్గం లేక, అగ్నిదేవుని శరణుజొచ్చిన రాజపుత్ర వీరవనితలు ఎందరో ఉన్నారు.

దాదాపు వెయ్యి సంవత్సరాల క్రిందట, అంటే శంకరాచార్యులు జీవించి ఉన్న కాలంలో, రాజపుత్రులు బలాఢ్యులై దేశంలో మొదటిసారిగా కొన్ని స్వంత రాజ్యాలను ఏర్పాటు చేసుకొన్నారు. ప్రతీహార వంశానికి చెందిన రాజపుత్రులు కన్యాకుబ్జం రాజధానిగా ఒక గొప్ప సామ్రాజ్యం స్థాపించారు. పశ్చిమ తీరంలో కథియవాడ్ నుంచి తూర్పున బీహారు వరకు ఈ రాజ్యం విస్తరించింది. సింధు రాష్ట్రాన్ని వశపరచుకొన్న అరబ్బులను అక్కడ నుంచి అడుగు ముందుకు వేయనీయకుండా అరికట్టగలిగిన పరాక్రమశాలులు వీరు.

ఒకప్పుడు ఉత్తరదేశంలో అప్రతిహతంగా విజృంభించిన ప్రతీహారులశక్తి క్రమంగా క్షీణించిపోయింది. ఐకమత్యం లోపించినందువల్ల, ప్రతిహారుల సామ్రాజ్యం కొంత కాలానికి చిన్న చిన్న ఖండాలుగా చీలిపోయింది. అయితే ఈ చిన్న రాజ్యాలకు అధిపతులు అయినవారు కూడా రాజపుత్రులే. రసపుత్రయోధుడు పృథ్వీరాజు, రాణిసంయుక్త కథలు మీరు చదివే ఉంటారు. చౌహానువంశానికి చెందిన పృథ్వీరాజు ఇటువంటి ఒక చిన్న రాజ్యానికి అధిపతి అయ్యాడు. అజ్మీరు నగరాన్ని నిర్మించింది ఈ చౌహాను రాజవంశీకులే. పారామరులనే మరొక రాజపుత్రవంశం ఉండేది. వీరిలో భోజరాజు సుప్రసిద్ధుడు. భోపాల్ పట్టణం ఆయన పేరు మీదనే నిర్మించబడింది. ఆ నాడది భోజ్‌పాల్ అని పిలువబడేది. భోజరాజు పండితుడు, న్యాయవర్తనుడు, దయాశీలి. ఈ రాజు సౌజన్యం గురించి, విజ్ఞతను గురించి అనేక కథలు ఇప్పటికీ ప్రచారంలో ఉన్నాయి. తరువాత బుందేల్‌ఖండ్‌ను పాలించిన చందేలా రాజపుత్రులు కూడా ఎన్నదగినవారే. వీరు వాస్తుశిల్పానికి ప్రసిద్ధులు. నేటి మధ్యప్రదేశ్‌లోని

ఖజురాహోలో ఉన్న సుందర మందిరాలు, దేవాలయాలు వీరు కట్టించినవే.

అప్పుడు దక్షిణదేశంలో చోళరాజులు పాలిస్తూ ఉండేవారు. చోళరాజులందరిలో రాజరాజ అగ్రగణ్యుడు. ఆరితేరిన ఆ యోధుడు అనేక యుద్ధాలు చేసి తన రాజ్యాన్ని బహుముఖాలుగా విస్తరింపజేశాడు. విదేశాలతో సముద్రమార్గాన వర్తక వాణిజ్యాలు సాగించేందుకు, అతను గొప్ప నౌకాదళం కూడా నిర్మించుకొన్నాడు. ఈ నౌకాదళం ఒక పర్యాయం సింహళద్వీపాన్ని జయించింది. రాజరాజు తంజావూరులో ప్రసిద్ధమైన దేవాలయం ఒకటి కట్టించాడు. ఈ దేవాలయ కుడ్యాలపై రాజరాజు చేసిన యుద్ధాలు, ఆయన సాధించిన విజయాలకు సంబంధించిన కథలు చెక్కబడి ఉన్నాయి. రాజరాజు కుమారుడు రాజేంద్రచోళుడు కూడా జనకునికి తగ్గ తనయుడే అనిపించుకున్నాడు. నౌకాదళాన్ని ఆయన ఇంకా పెంచి బర్మా, మలయా, సుమత్రాలలో కొన్ని భాగాలను ఆక్రమించుకున్నాడు. రాజేంద్ర చోళుడు గంగానది వరకు దండెత్తి వెళ్లి వంగదేశాన్ని పాలిస్తున్న పాలరాజులను ఓడించి ''గంగైకొండ చోళు'' డని బిరుదు .సంపాదించాడు. గంగను దక్షిణానికి తెచ్చిన చోళుడనని ఆయన ఆ బిరుదు ద్వారా చాటుకున్నాడు. తన రాజ్యంలో రైతులకు ఏడాది పొడుగునా నీటి వసరు లభించేందుకుగాను రాజేంద్రచోళుడు అనేక నదులపై ఆనకట్టలను నిర్మించి, కాల్వలను చెరువులను తవ్వించాడు.



రాజేంద్ర చోళుడు తన నౌకాదళాన్ని సముద్రయానానికి పంపించాడు

చోళరాజ్యంలోని శిల్పులు బహుసుందరమైన దేవతా విగ్రహాలను, తమను పాలించిన రాజులు, రాణుల ప్రతిరూపాలను తయారు చేసేవారు. వీరు కంచుతో చేసిన విగ్రహాలు కొన్ని మ్యూజియంలలో నేటికీ భద్రపరచబడి ఉన్నాయి. ఇలాంటి ఉత్తమ శిల్ప ఖండాలన్నింటిలో ప్రపంచ ప్రసిద్ధమైనది నటరాజ విగ్రహం. నాట్య భంగిమలో ఉన్న ఈ శివవిగ్రహం పురాణాలలో వర్ణించిన శివ తాండావాన్ని మనోజ్ఞంగా కన్నులెకు కట్టిస్తుంది. పుస్తకాలలో ఈ బొమ్మను మీరు చూసే ఉంటారు.

దక్షిణ దేశంలో చోళరాజులు పరిపాలిస్తున్న కాలంలో బెంగాలులో పాలవంశపు రాజులు ఏలుతూ ఉండేవారు. వీరు కూడా నౌకాదళాలు నిర్మించి మలయా మొదలైన దేశాలతో వ్యాపారం చేసేవారు. పాలరాజులు పెక్కు దేవాలయాలను, విద్యాలయాలను నిర్మించారు. వీరి తరువాత ''సేన'' వంశపురాజులు పాలించారు. వీరిలో లక్ష్మణసేనుడు ముఖ్యుడు. గీతగోవిందమనే మధురకావ్యాన్ని రచించిన జయదేవుడు ఈతని ఆస్థానంలోని వాడే. రాధాకృష్ణుల ప్రణయగాథను శ్రవణ పేయంగా వర్ణించిన ఈ గీతాలు దేశమంతటా నేటికీ వినబడుతూ ఉంటాయి.

ఈ కాలంలో భారతదేశం చిన్నచిన్న రాజ్యాలుగా ఎలా చీలిపోయిందో మీరు తెలుసుకొన్నారు. ఈ చిన్న రాజ్యాలు ఐకమత్యంతో కలిసి ఉండక, అసూయలు పెంచుకుంటూ అంతఃకలహాలతో సతమతం అయిపోతూ ఉండేవి. అంతులేని స్పర్ధలతో జవసత్వాలు ఉడిగిపోయి క్రమంగా అవి బలహీనమైపోయాయి. సరిగా ఆ తరుణంలోనే విదేశీయులు మనమీద దండయాత్ర చేశారు. అప్పుడుకూడా రాజ్యాలు కలిసి కట్టుగా నిలవక పోవడంవలన అన్నీ ఒకటొకటిగా శత్రువులకు త్వరలోనే లొంగిపోవలసి వచ్చింది.

# ఇస్లాం పుట్టుక

దాదపు వేయి సంవత్సరాల క్రిందట అరేబియాదేశంలో మక్కా పట్టణంలో ఒక బాలుడు జన్మించాడు. అతని పేరు మహమ్మదు. మహమ్మదు భూమి మీద పడడానికి పూర్వమే తండ్రి గతించాడు. తరువాత అచిరకాలానికే తల్లికూడా దూరమైంది. మహమ్మదు పేదవాడైనందువల్ల అనేక కష్టాలు పడవలసివచ్చింది. నాటి ప్రజలు అజ్ఞానులై, క్రూరులై దుర్భరంగా జీవిస్తూ ఉండటం చూసి బాలుడైన మహమ్మదు మిక్కిలి ఖేదపడ్డాడు. వారిని మంచి మార్గానికితిప్పి దైవచింతన కలుగజేయాలని తాపత్రయపడ్డాడు.

## మహమ్మదు ప్రవక్త

మానవజాతికి తన ద్వారా దివ్య సందేశాన్ని అందజేయడానికి భగవంతుడే తననీ లోకంలోకి పంపాడని మహమ్మదు విశ్వాసం. కొందరు అనుచరులను చేరదీసి, సృష్టికంతటికీ ఈశ్వరుడు అనేవాడు ఒక్కడేనని, ప్రాణంలేని రాతిబొమ్మలను ఆరాధించడం కూడదనీ, తానే భగవంతుని ప్రవక్తనని బోధించాడు. అతను అనుయాయులకు ''మునల్మానులు'' లేక ''ముస్లింలు'' అని పేరువచ్చింది. అతను బోధించిన మతం ''ఇస్లాం'' లేక ''మహమ్మదీయ'' మతమని వ్యవహరించబడుతోంది. ముస్లిములు అంతా అన్నదమ్ముల వలె మెలగుతూ నీతిగా బతకాలని, పేదవారికి చేతనైనంతగా సహాయపడాలని మహమ్మదు ఉద్బోధించాడు. ఆయన బోధనలన్నీ ''కొరాన్'' అనే గ్రంథంలో పొందుపరచబడ్డాయి. మహమ్మదీయులకు ఇదే మతగ్రంథం అయింది.

మొదట ప్రజలు మహమ్మదును తృణీకరించి నానా హింసలు పెట్టారు. అందువల్ల అతను తన జన్మస్థలమైన మక్కాను వదలి మదీనాకు పారిపోవలసివచ్చింది. అయితే అచిరకాలానికే ప్రజలు మనసు మార్చుకొని మహమ్మదును గౌరవించి, ఆయన బోధనలను మన్నించసాగారు. మహమ్మదు అరేబియాలోని జాతులన్నింటినీ ఏకంచేసి, వారికి నాయకుడయ్యాడు.

మహమ్మదు పుట్టడానికి పూర్వమే, అరబ్బులు భారతదేశంతో నౌకా వ్యాపారం చేస్తూ

ఉండేవారు. కాలక్రమేణా అనేకమంది ముస్లిం వర్తకులు మన దేశపు పడమటి తీరంలో స్థిరపడ్డారు. కొందరు హిందూ స్త్రీలను వివాహమాడి మహమ్మదు ప్రవచనాలను ప్రచారం చేయసాగారు. ఈ విధంగా అనేకమంది భారతీయులు ముస్లిములయ్యారు.

ముస్లింలు మొదటిసారి దక్షిణదేశానికి వచ్చినప్పుడు అలజళ్లూ ఏమీ లేకుండా మామూలు వర్తకులుగానే ప్రవేశించారు. ఆ సందర్భంలో యుద్ధాలుగాని, రక్తపాతంగాని జరగలేదు. అయితే వారు ఉత్తరదేశంలోకి ప్రవేశించినతీరు మాత్రం ఇందుకు భిన్నంగా నడిచింది.

## మహమ్మద్ బిన్ కాసిం

అరబ్బు వర్తకులు భారతదేశంలో చూసిన భోగభాగ్యాలనుగురించి తమదేశానికి వెళ్ళి కథలుగా చెప్పేవారు. ఇవి విన్న ముస్లింలు కొందరు ఈ దేశాన్ని కొల్లగొట్టాలనే దురుద్దేశ్యంతో అనేకసార్లు పశ్చిమతీర ప్రాంతాలమీద దాడి జరిపారు. అయితే తగిన సన్నాహాలు చేసుకొని సైన్యం కూర్చుకొని మన దేశంపైకి దండెత్తివచ్చిన మొట్టమొదటి ముస్లిము మహమ్మద్ బిన్ కాసిం. దండయాత్రకు బయలుదేరినప్పుడు అతడు నూనూగు మీసాల నూత్న యవ్వనంలో ఉన్నాడు. వయస్సు నిండా 17 సంవత్సరాలు కూడాలేదు. గుర్రాలు, ఒంటెలమీద సైన్యంతో పర్షియా తీరంగుండావచ్చి సింధుపై దాడిచేశాడు. ప్రత్యర్థి సైన్యాలమీద బ్రహ్మాండమైన వడిసెళ్ళను, విషలిప్తమైన బాణాలను ప్రయోగించి ముందుగా ముల్తాన్ పట్టణాన్ని వశపరచుకొన్నాడు. ఇతని ధాటికి తట్టుకోలేక సింధురాజు లొంగిపోవలసివచ్చింది. ఈ విధంగా సింధుప్రాంతమంతా అరబ్బులచేతికి చిక్కింది. అయితే మహమ్మద్ బిన్ కాసిం ప్రజలను దయతో పాలించాడు. సింధులో అరబ్బుల పరిపాలన 300 సంవత్సరాలపాటు సాగింది. పరిసర ప్రాంతాలను కూడా జయించడానికి వారు ప్రయత్నించారు. అయితే ఉత్తరదేశాన్ని పాలిస్తున్న రాజపుత్రవీరులు వీరిని ముందుకు సాగిరాకుండా అరికట్టారు. ఈ విషయం మీరు వెనకటి అధ్యాయంలోనే చదివి ఉన్నారు.

అయితే కొంతకాలమైన తర్వాత మన దేశంలోని రాజులు, మండలాధిపతులు ఒకరిపై ఒకరు శతృత్వం వహించి తరచుగా తమలో తాము పోట్లాడుకోసాగారు. అందువల్ల క్రమంగా వారిబలం క్షీణించి, బయటనుండి పెద్ద పెట్టున దండయాత్రలు జరిగినప్పుడు దేశాన్ని కాపాడగల సమర్థులు లేకపోయారు.

## ఘజ్నీ మహమ్మదు

భారత్‌పై ఇలా దండయాత్రలు చేసిన ముస్లింలందరిలో పట్టుదలతో పదేపదే దాడులు జరిపినవాడు ఘజ్నీ మహమ్మదు. ఇతడు తురుష్కుడు (టర్కీకి చెందినవాడు). ''ఘజ్నీ'' అనేది అతని తండ్రి నిర్మించిన పట్టణం. ఆ రోజులలో అది ఆఫ్ఘానిస్థాన్‌కు రాజధాని. మహమ్మదు భారతదేశంపై 17 సార్లు దండయాత్ర చేశాడు.

ఘజ్నీ మహమ్మదు ఆశయమల్లా భారతదేశాన్ని కొల్లగొట్టి, తనతో మోసుకుపోగలిగినంత సంపదను స్వదేశానికి మోసుకుపోవడమే. అతని తురుష్క సైనికులు కాకలు తీరినవారు. మంచి రౌతులు. మగటిమి గల జోదులు. పెద్ద పెద్ద నదులగుండా ఈదటమన్నా, అరణ్యాలను నరికి దారిచేసుకుపోవడమన్నా, ఎముకలు కొరికే చలిలో మొలలోతు మంచులో లేదా మండుటెండలో ఎర్రని ఎడారి ఇసుకల్లో రోజుల తరబడి ప్రయాణం చేయటమన్నా వారికి ఒక లెక్కలోది కాదు. బాణాలు, ఈటెలు ప్రయోగించటంలో వారు చేయితిరిగినవారు. ఇట్టి సైనికులను కూడతీసుకొని వచ్చిన మహమ్మదు అనేక మంది హిందూ రాజులను ఓడించి దేవాలయాలను నేలమట్టం చేసి, అపారమైన సంపదను కొల్లగొట్టాడు. అతను ఘజ్నీ పట్టణానికి కొనిపోయిన వెండిబంగారాలకు, రత్న వైడూర్యాలకు, నగలకు, నాణ్యాలకు లెక్కలేదు. ఒకసారి భారత్‌పై దాడి జరపడము, ఘజ్నీకి కొల్లగొట్టిన ధనంతో తిరిగి వెళ్ళడము, అక్కడ ఆ సంపదనంతా తన వైభోగాలకు నీళ్ళప్రాయంగా వెచ్చించి వేయడము, భారత్‌మీదికి మళ్లీ దండెత్తి రావడము అతనికి పరిపాటి అయిపోయింది.

పశ్చిమ ప్రాంతంలో కథియవాడ్ కోస్తాలో సోమనాథ దేవాలయమనే ప్రసిద్ధమైన ఆలయం ఉంది. ఈ ఆలయంలోని సంపద అపారమైంది, వేయి మంది పురోహితులు దీనిని కాపాడుతూ ఉండేవారు. దాదాపు 700 మైళ్ల ప్రయాణం చేసి సింధు, రాజపుటానా ఎడారులు దాటి ఘజ్నీ మహమ్మదు ఈ దేవాలయం చేరుకున్నాడు. ఆకలి దప్పులకు తాళలేక అతని సైనికులు అనేకమంది దారిలో మరణించారు. అయినా లెక్కచేయకుండా మొండి పట్టుదలతో మహమ్మదు ముందుకు సాగివచ్చాడు. చివరికి దేవాలయం చేరుకొని దానిలో ఉన్న సంపదనంతా కొల్లగొట్టి తనతో కూడా మోసుకుపోవడానికి వీలుకాని వస్తువాహనాలను ధ్వంసం చేసివేశాడు. చక్కని పనితనం గలిగిన బ్రహ్మాండమైన ఈ దేవాలయం తాలూకు ద్వారాలను ఊడబెరికించి, వాటిని తనతో కూడా ఘజ్నీకి తీసుకొనిపోయి

తన ప్రాసాదానికి అమారుచేయించాడు.

కొల్లగొట్టిన సంపదలో చాలా భాగం ఘజ్నీలో ఒక విశ్వవిద్యాలయాన్ని నిర్మించడానికి మహమ్మదు ఉపయోగించాడు. మహమ్మదు ఆస్థానంలో కొంతకాలంపాటు ఫిరదౌసి అనే పారసీక కవి, అల్బరూని అనే గొప్ప విద్వాంసుడు ఉండేవారు.

# ఢిల్లీ సుల్తానులు

మహమ్మదు ఘజ్నీ జరిపిన దండయాత్రలు నాటి భారతదేశ రాజులకు గుణపాఠం నేర్పి ఉండవలసిందేగాని వారు దానితో ఏమాత్రం తెలివితెచ్చుకోలేదు. ఎప్పటివలెనే ఒకరితో ఒకరు ఎడతెగకుండా కలహించుకుంటూ ఉండడంవల్ల దేశం అంతకంతకూ బలహీనమైంది. ఈ పరిస్థితులను ఆసరాగా చేసుకొని, మహమ్మదు ఘోరీ అనే మరొక సుల్తాను భారతదేశం మీదికి దాడి వచ్చాడు.

## మహమ్మదు ఘోరీ - పృథ్వీరాజు

మహమ్మదు ఘోరీ దాడి జరిపినప్పుడు ఢిల్లీ, ఆజ్మీరులను పృథ్వీరాజు అనే బలాఢ్యుడైన చౌహాను వంశీయుడు పరిపాలిస్తున్నాడు. పృథ్వీరాజు సేనలు ఘోరీ సైన్యాలను తరైన్ అనేచోట ఢీకొన్నాయి. ఘోరీ సైనికులు మంచి అశ్వికులు. ఇటు రాజపుత్ర సైనికులు కూడా వారికి ఏమాత్రమూ తీసిపోయినవారు కాదు. ఈ రెండు సైన్యాల మధ్యా హోరాహోరీగా యుద్ధం జరిగింది. రాజపుత్ర సైనికలు ఘోరీ సైన్యాన్ని ఓడించి తరిమివేశారు. మహమ్మదు పరాజితుడై ఆఫ్ఘనిస్థాన్ చేరుకొన్నాడు. అయితే అతను ఈ పరాభవాన్ని మరచిపోలేదు. సమయం చూసి మళ్లీ దండయాత్రకు తయారయ్యాడు.

మరుసటి సంవత్సరమే మహమ్మదు ఘోరీ మరింత పెద్ద సైన్యాన్ని తీసుకొని మళ్లీ తరైన్ వద్దనే పృథ్వీరాజును ఎకుర్కొన్నాడు. ఈసారి జరిగిన యుద్ధంలో రాజపుత్ర సైన్యం ఓడిపోయింది. యోధాగ్రణి పృథ్వీరాజు రణరంగంలో వీరమరణం పొందాడు. నేటికీ రాజస్థాన్‌లోని గాయకులు పృథ్వీరాజు శౌర్యపరాక్రమాలను వర్ణించే వీరరసగీతాలను పారవశ్యంతో పాడుతూ ఉంటారు.

మహమ్మదు ఘోరీ రసపుత్రులనుండి ఢిల్లీ సింహాసనాన్ని గెలుచుకొని ఆఫ్ఘనిస్థాన్ తిరిగి వెళ్ళిపోయాడు. అతని వద్ద కుతుబుద్దీన్ ఐబక్ అనే బానిస ఉండేవాడు. ఇతడు చాలా చురుకైనవాడు. మహమ్మదు ఈ కుతుబుద్దీన్‌ను తనతరఫున భారత్‌లో పాలకుడుగా

నియమించాడు. కాగా కుతుబుద్దీన్ చక్రవర్తి పేరు మీద భారత్‌లో మరి కొన్ని యుద్ధాలు చేసి సామ్రాజ్యాన్ని ఇంకా విస్తరింపజేశాడు. ఇతని సైన్యాధిపతి బక్తియార్ ఖిల్జీ బీహారు, బెంగాలులను జయించాడు. నాటి రాజపుత్ర కుటుంబాలు వీరికి దాసోహమనక తప్పలేదు. మహమ్మదు ఘోరీ మరణించిన తరువాత కుతుబుద్దీన్ ఢిల్లీకి సుల్తాను అయ్యాడు. భారతదేశాన్ని స్వతంత్రంగా పరిపాలించిన సుల్తానులలో ఇతడే మొట్టమొదటివాడు. ఈతని తరువాత దాదాపు 600 సంవత్సరాల వరకు ఢిల్లీ సింహాసనాన్ని అధిష్టించిన రాజులందరూ ముస్లింలే.



ఢిల్లీలోని ప్రసిద్ధ కుతుబ్ మినార్ నిర్మాణాన్ని కుతుబుద్దీన్ ప్రారంభించాడు

## బానిసరాజులు

కుతుబుద్దీన్ తరువాత ఇల్టుట్మిష్ రాజు అయ్యాడు. ఢిల్లీకి సమీపంలో ఉన్న సుప్రసిద్ధమైన కుతుబ్ మినార్ నిర్మాణాన్ని కుతుబుద్దీన్ ప్రారంభించగా ఇల్టుట్మిష్ దానిని పూర్తిచేశాడు. అతడు నలభైమంది బానిస నాయకుల సహాయంతో పరిపాలన చేసేవాడు. ఇందువల్లను, కుతుబుద్దీనే బానిస వంశానికి చెందినవాడైనందువల్లను ఢిల్లీని మొదట పాలించిన రాజులకు బానిసరాజులని పేరువచ్చింది.

ఇల్టుట్మిష్‌కు రజియా అనే కుమార్తె ఉండేది. అతనికి కుమారులు కూడా ఉన్నారు. కాని వారంతా అసమర్థులని నిశ్చయించి, కూతురు రజియాయే సింహాసనం ఎక్కాలని ఇల్టుట్మిష్ ఆదేశించాడు. ఇల్టుట్మిష్ కోరిక ప్రకారం అతని మరణానంతరం, రజియా ఢిల్లీ సుల్తానా అయింది. సుల్తానా రజియా తెలివైనదేకాక దయావతి. ప్రజలను కన్నబిడ్డలవలె చూసుకొనేది. పురుషవేషం ధరించి ఏనుగునెక్కి సైన్యాలను ముందుండి నడిపించేది. ఢిల్లీ సింహాసనాన్ని అధిష్టించిన ఏకైకవనిత సుల్తానా రజియాయే. అప్పటి సైన్యాధిపతులకు తమపై ఆడది పెత్తనం చెలాయించడం సుతరామూ గిట్టలేదు. అందువల్ల వారు కుట్ర పన్ని

అదను దొరకగానే ఆమెను హత్య చేయించారు.

బానిస రాజుల తరువాత బాబరు మొగలు సామ్రాజ్యాన్ని స్థాపించేవరకూ, నడుమ కాలంలో ఖల్జీ, తుగ్లక్, సయ్యీద్, లోడీ వంశాల రాజులు ఢిల్లీని పరిపాలించారు.

## అల్లావుద్దీన్ ఖల్జీ

ఢిల్లీనేలిన ఖల్జీ వంశపు రాజులలో అల్లావుద్దీన్ ప్రసిద్ధుడు. సింహాసనానికి రాక పూర్వమే అతడు జైత్రయాత్ర ప్రారంభించాడు. గొప్ప సైన్యం తీసుకొని వింధ్యపర్వతాలను దాటి దక్కను ప్రాంతం కొల్లగొట్టి అపారమైన సంపదను చేజిక్కించుకున్నాడు.

అల్లావుద్దీన్ ఢిల్లీకి సుల్తాను అయిన వెంటనే దేశంలో మద్యపానం, జూదం, విందులు మొదలైన విలాసాలను నిషేధించాడు. సైన్యాధికారులను ఒకరి నొకరు కలుసుకోనిస్తే వారు తనకే ఎసరుపెట్టి ముప్పుతేవచ్చునన్న అనుమానంతో రాజుగారి సమక్షంలోనేతప్ప వారు ఇతరత్రా కలుసుకోరాదని ఆజ్ఞాపించాడు. తన కింది అధికారులకు మితిమీరిన స్వతంత్రం ఇస్తే పేద ప్రజలను వేపుకు తింటారని కింది ఉద్యోగులను ఎప్పుడూ ఒక కంట కనిపెడుతూ ఉండేవాడు.

అల్లావుద్దీన్ రాజపుత్రులను ఓడించి తన సామ్రాజ్యాన్ని దక్షిణదిశగా విస్తరింపజేశాడు. శత్రుభయం లేకుండా రాజ్యం సురక్షితమై ఉండాలనే సంకల్పంతో సైన్యాన్ని ఎప్పుడూ యుద్ధానికి సన్నద్ధంగా ఉంచేవాడు. సైనికులకు ఇస్తున్న జీతాలు చాలడంలేదని దేశంలో అన్నవస్త్రాలు, తదితర నిత్యజీవితావసరవస్తువుల ధరలను తగ్గించివేసి, సైనికులు ఏవిధమైన ఇబ్బందీ పడకుండా జాగ్రత్త వహించాడు.

అల్లావుద్దీన్ సైన్యాధిపతులలో ముఖ్యుడైన మాలిక్ కాఫర్ దక్షిణదేశం మీదికి దండెత్తివెళ్ళాడు. తమిళ రాజ్యాల మీదికి ఒక మహమ్మాదీయుడు దండెత్తి వెళ్లడం ఇదే మొదటిసారి. ఈ దండయాత్రలో అపారమైన సంపద అతని కైవసమైంది. లెక్కలేని వెండి బంగారు వస్తువులు, రత్నాలు, ముత్యాలు, ఏనుగులు, గుర్రాలు అతను చేజిక్కించుకొన్నాడు. మాలిక్ కాఫర్ ఎలా లేదన్నా 96,000 మణుగుల బంగారం దోచుకుపోయాడని ప్రతీతి.

## అమీర్ ఖుస్రో

అల్లావుద్దీన్ ఏమంత చదువుకున్నవాడు కాదు. అయితేనేమి అతని దర్బారులో అనేకమంది

కవులు పండితులు ఉండేవారు. వారిలో అమీర్‌ఖుస్రో ప్రఖ్యాతుడు. ఖుస్రో, నిజాముద్దీన్ అనే ముస్లిం భక్తాగ్రేసరునికి శిష్యుడు, అతని ప్రియమిత్రుడూను. ఢిల్లీలో నిజాముద్దీన్ సమాధికి సమీపంలోనే అమీర్ ఖుస్రో గోరీ కూడా ఉంది. అమీర్ ఖుస్రో హిందీ భాషలో మంచి కవిత్వం చెప్పేవాడు. అనేక పొడుపు కథలను అతను పద్యాలుగా వ్రాశాడు. ఈ పద్యాలలో ఒకదానికి అనువాదం ఇది:

ఇరవై మంది తలలు తీసేశారు;
కాని ఎవ్వరికీ ప్రాణంపోలేదు, ఒక్క నెత్తురు చుక్కకూడా రాలలేదు.

ఈ పొడుపు కథను మీరు విప్పగలరేమో చూడండి. దీనికి సమాధానం ఏమిటో చెప్పమంటారా? తలలు తీసివేయబడినవి మరేవీకాదు చేతిగోళ్లు, కాలిగోళ్లు.

అమీర్ ఖుస్రో పర్షియన్ భాషలో కూడా కవిత అల్లేవాడు. అతను మంచి సంగీత విద్వాంసుడు కూడా. సితార్ వాద్యాన్ని కనిపెట్టింది అతనే.

అల్లావుద్దీన్ నిర్భయుడు. అతనిలో ఎన్ని మంచి గుణాలు ఉన్నాయో చెడుగుణాలు కూడా అన్ని ఉండేవి. ఒకప్పుడు మహాక్రూరంగా ప్రవర్తిస్తే, మరొకప్పుడు ఎంతో దయగా ఉండేవాడు. ఒకరోజున అతని కాజీ (న్యాయమూర్తి) వచ్చి ఢిల్లీ బజారులలోని దుకాణదారులంతా వట్టిదగాకోరులంటూ ఫిర్యాదు చేశాడు. దానిపై అల్లావుద్దీన్ దుకాణదార్ల మీద మండిపడి, వారి అక్రమాలు కనిపెడుతూ ఉండటానికి వెంటనే గూఢచారులను నియమించాడు. ప్రజలను మోసపుచ్చి అన్యాయంగా లాభాలు దండుకొనే వర్తకులకు కఠిన శిక్షలు వేయాలని శాసించాడు.

## మహమ్మద్ బిన్ తుగ్లక్

అల్లావుద్దీన్ చనిపోయిన తరువాత కొన్ని సంవత్సరాలకు ఢిల్లీ సింహాసనం తుగ్లక్ వంశీయుల కైవసమైంది. ఈ వంశానికి చెందిన మహమ్మద్ బిన్ తుగ్లక్ చదువుకున్న వాడే కాని ప్రపంచ జ్ఞానం ఏమాత్రము లేనివాడు. అందువల్ల అతడు సదుద్దేశ్యంతో తలపెట్టిన పనులు సైతం మంచి కలిగించకపోగా దుష్ఫలితాలు తెచ్చిపెట్టేవి.

రాజధానిగా ఉన్న ఢిల్లీ పట్టణం దేశానికి నడిబొడ్డున లేదని రాజధానిని ఢిల్లీ నుండి వేయిమైళ్ళ దూరంలో ఉన్న దేవగిరికి బదలాయించమని తుగ్లక్ ఆజ్ఞాపించాడు. ఢిల్లీ నగరంలోని ప్రజలు ఆబాలగోపాలము, వృద్ధులు, కుంటివారు, గుడ్డివారితో సహా దేవగిరికి తరలిపోవాలని

హుకుం చేశాడు. కాని తన పథకం అనుకున్న ప్రకారం ఫలించక బెడిసికొట్టడంతో విరక్తి చెంది మహమ్మద్ బిన్ తుగ్లక్ రాజధానిని ఏడాది తిరిగేలోగానే మళ్లీ ఢిల్లీకి మార్చివేశాడు. చచ్చిచెడి దేవగిరికి చేరిన ప్రజలంతా కాళ్లకు బలపాలుకట్టుకొని ఢిల్లీకి తిరుగుముఖం పట్టవలసివచ్చింది.

మరొకసారి ధనికులతోబాటు పేదవారికి కూడా డబ్బు చేతినిండా ఉండాలన్న ధర్మబుద్ధితో తాను జారీచేసిన రాగి నాణాలకు సైతం వెండి, బంగారు నాణాలతో సమానమైన విలువ ఇవ్వవలసిందని ఉత్తర్వు చేశాడు. అతనిది నిజంగా సత్సంకల్పమే అయినా అతను అనుకున్నది ఒకటైతే జరిగింది వేరొకటి. రాజు ఆ ఉత్తర్వు జారీ చేయగానే చాలా మంది వెండి, బంగారు నాణాలను దాచుకుని స్వయంగా రాగి నాణాలు తయారు చేసుకోవడం మొదలు పెట్టారు. కొంత కాలం అయేసరికి దేశం దివాలా తీసే పరిస్థితి ఏర్పడింది. వెండి బంగారు నాణాలు మాయమైపోయి వాటిస్థానే కుప్పతిప్పలుగా రాగి నాణాలు చలామణిలోకి వచ్చాయి. దానితో నాణాలకు అసలు విలువ అనేది ఏమీ లేకుండా పోయింది. ఈ విపరీతం చూసి బిత్తరపోయి మహమ్మద్ బిన్ తుగ్లక్ తన వెనుకటి ఉత్తర్వును వెంటనే రద్దు చేశాడు.

## ఫిరోజ్ తుగ్లక్

మహమ్మద్ బిన్ తుగ్లక్ తరువాత రాజ్యానికి వచ్చిన ఫిరోజ్ తన పూర్వీకుని తెలివిమాలిన ఆలోచనవల్ల కలిగిన అవకతవకలను సరిదిద్ది పరిస్థితులను చక్కబరచడానికి ప్రయత్నించాడు. యుద్ధాలను పూర్తిగా మానుకొని అలా ఆదా అయిన డబ్బునంతా కాల్వలు, చెఱువులు తవ్వించడానికి, పాఠశాలలు, కళాశాలలు, వంతెనలు మొదలైనవి కట్టించడానికి ఖర్చు పెట్టాడు. రైతుల సుఖసంపదల కోసం చాలా కృషి చేశాడు. ఫిరోజ్ తుగ్లక్ పండితులను ఆదరించి అనేక ప్రాచీన సంస్కృత గ్రంథాలను పర్షియన్ భాషలోకి అనువాదం చేయించాడు.

ఫిరోజ్ తరువాత రాజ్యం ఏలిన తుగ్లక్ రాజులు ఏమాత్రమూ సమర్థులు కాదు. అధికారులు ఒకరిపై ఒకరు కుట్రలు పన్నుకోవడంతో మళ్లా అంతర్యుద్ధాలు చెలరేగాయి. ఐకమత్యం లోపించి, దేశం తిరిగి బలహీనమైపోయింది. పశ్చిమోత్తర దిశ నుండి నల్లేరుపై బండిలాగా దేశం మీద మళ్లీ దండయాత్రలు ప్రారంభం కావడానికి ఇది అవకాశం ఇచ్చింది.

## తైమూరు

ఆ కాలంలో మధ్య ఆసియాలో తైమూరు అనే ఉగ్రుడైన చండశాసనుడు ఉండేవాడు.

అతడు సేనాధిపతి. అయితే అతని కాళ్ళలో ఒకటి అవిటిది. అందువల్ల కుంటుతూ నడిచేవాడు. దీనిని బట్టి అతనికి కుంటి తైమూరని పేరువచ్చింది. అతడు భారతదేశపు సిరి సంపదలను గురించి కర్ణాకర్ణిగా విని ఎప్పుడెప్పుడు భారత్ మీద వెళ్ళి పడదామా అన్ని ఉవ్విళ్లూరుతూ ఉండేవాడు. ఒక ఏడు వేసవి కాలంలో 90,000 మంది ఆశ్వికులను వెంటతీసుకొని, సమర్ఖండ్‌లోని తన రాజధాని నుంచి భారతదేశానికి బయలుదేరాడు. సైన్యంతో అతడు సింధునది దాటి ఢిల్లీ చేరుకోడానికి సుమారు ఆరునెలలు పట్టింది. తైమూరు అప్పటి తుగ్లక్ సుల్తానులను ఓడించి ఢిల్లీ నగర్నాన్ని వశపరచుకున్నాడు. అతని సైనికులు నగరాన్ని కొల్లగొట్టి అనేక మందిని హతమార్చారు. తాను ఎక్కడ కాలు పెడితే అక్కడ ప్రజలు భీతావహంతో కంపించి పోయేటట్లు బీభత్సాలు చేసి తైమూరు ఎట్టకేలకు స్వదేశానికి తిరిగిపోయాడు.

ఢిల్లీని ఏలిన తురుష్క సుల్తానులలో తుగ్లకువంశీయులే ఆఖరువారు. వారి తరువాత కొంతకాలం పాటు ఢిల్లీ సింహాసనాన్ని తైమూరు ప్రతినిధి ఒకడు అధిష్ఠించాడు. మొగలులు రావడానికి ముందు మరో రెండు వంశాలు ఢిల్లీని పాలించాయి. అయితే ఢిల్లీ సుల్తానుల రాజ్యం వీరి చేతులలోకి వచ్చే నాటికే చాలా హరించుకుపోయింది.

# ఢిల్లీకి ఆవలి వైపు రాజ్యాలు

ఫిరోజ్ తుగ్లక్‌కు తరువాత వచ్చిన సుల్తానులు బలహీనులు, అసమర్థులు అయినందువల్ల వారి మండలాధిపతులు స్వతంత్రులై, ఎవరికివారు చిన్న చిన్న రాజ్యాలను స్వతంత్రంగా నిర్మించుకొన్నారు. దీనితో దేశం మళ్లీ ముక్కచెక్కలుగా చీలిపోయింది.

బెంగాలుకు, జౌన్‌పూరుకు (ఈనాటి ఉత్తరప్రదేశ్ తూర్పు భాగంలో ఉండేది) నవాబులుండేవారు. మీలో పశ్చిమభారత ప్రాంతంలో పర్యటించినవారు మండూ, ధార్‌లనే రమణీయ నగరాలను స్వయంగా చూసిగానీ లేదా వాటిని గురించి వినిగానీ ఉండవచ్చు. ఇవి నాటి మాల్వా రాజ్యానికి ముఖ్యనగరాలుగా ఉండేవి. పోతే గుజరాతు మరో రాజ్యం. ఇక్కడ నుంచి చక్కని నేత పట్టు వస్త్రాలు, బంగారు నరిగ ఇతర ప్రాంతాలకు ఎగుమతి అయేవి. కాశ్మీరులో కూడ సుల్తానులు పాలిస్తూ ఉండేవారు. వీరిలో పెక్కుమంది పండిత పోషకులుగా ప్రసిద్ధికెక్కారు.

## సిసోదియాలు

హిమాలయ పర్వతాలను ఆనుకొని ఉన్న ప్రాంతాలలోను, రాజపుటానా, మధ్య భారతదేశంలో కొండ ప్రాంతాలలోను రాజపుత్రులు పరిపాలిస్తూ ఉండేవారు. ఢిల్లీ సుల్తానులు అనేకమంది రాజపుత్రులను ఓడించారు. అయితే రాజపుత్రులలో శత్రువుకు చివరివరకు తల ఒగ్గనివారు కొందరు ఉన్నారు. ఈ విధంగా స్వతంత్రాన్ని కాపాడుకొన్న వారిలో మేవాడ్‌కు చెందిన సిసోదియా వంశంవారు బలాఢ్యులు. వీరి నాయకుడు రాణా కుంభ. ఇతడు అనేక యుద్ధాలలో కాకలు తీరిన యోధుడు. రాణా కుంభ మాల్వాను జయించి, తన విజయానికి చిహ్నంగా చిత్తోడ్ వద్ద ఒక సుందరమైన గోపురాన్ని నిర్మించాడు. ఇప్పటికీ ఈ గోపురం నిలచి ఉన్నది. మీరెప్పుడైనా రాజస్థాన్‌కు వెళితే అక్కడ చూడదగిన విశేషాలలో ఇది ఒకటి. రాణా కుంభ గొప్ప వీరుడేకాక కళలలో మంచి అభినివేశం కలవాడు. అతడు నాటకాలను, కావ్యాలను రచించాడు. అతనికి సంగీతం అంటే మిక్కిలి మక్కువ.

మేవాడ్‌ను పాలించిన సిసోదియా వంశపురాజులందరిలో రాణా సంగ్రామ సింహుడు ప్రథమగణ్యుడు. ప్రజలు ఆయనను ప్రేమతో ''రాణా సంగా'' అని పిలిచేవారు. రాజస్థాన్‌లోని రాజపుత్ర వంశాలన్నీ అతనిపట్ల ప్రేమాదరాలు కలిగి ఆయనను తమ నాయకునిగా శిరసావహించాయి. ప్రజలకు ఆయనపట్ల అమితమైన భయభక్తులుండేవి. సంగ్రామసింహుడు గొప్ప పరాక్రమశాలి. అనేక యుద్ధాలలో పాల్గొని విజయపరంపర సాధించిన మహావీరుడు. అతడు పదే పదే చేసిన యుద్ధాలలో అతనికి తీవ్రమైన గాయాలు తగిలి ఆపాదమస్తకమూ 80 గాయపు మచ్చలు పడ్డాయని చెప్పుకుంటారు. యుద్ధాలలో ఈ వీరునికి ఒకచేయ్యి, కన్ను కూడా పోయాయి. ఒక పర్యాయం యుద్ధంలో ఫిరంగిగుండు కాలిగుండా దూసుకుపోయింది. రాణా సంగ్రామ సింహుడు ఆఫ్ఘనులను పద్దెనిమిది పర్యాయాలు ఓడించాడు. అయితే అదృష్టం లేక బాబరుతో చేసిన యుద్ధంలో అతను ఓడిపోయాడు. మొగలు ఆశ్వికుల మెరుపుదాడికి, మందగమనంతో సాగే అతని గజబలం తట్టుకోలేకపోయింది. సంగ్రామసింహుని తరువాత మేవాడ్ ఘనత అంతరించిపోయింది.

## బహమనీ రాజ్యం

వింధ్యపర్వతాలకు దక్షిణాన రెండు ముఖ్యమైన రాజ్యాలు వెలిశాయి. అవి బహమని, విజయనగర రాజ్యాలు.

బహమనీరాజుల పరిపాలన సుమారు 200 సంవత్సరాలు కొనసాగింది. సుల్తాన్ ఫిరోజ్‌షా పరిపాలనలో బహమనీ రాజ్యం పడమటి వైపున అరేబియా సముద్రం నుండి తూర్పున బంగాళాఖాతం వరకు వ్యాపించింది. ఈ వంశపు రాజులలో అనేకమంది దక్షతతో న్యాయంగా పాలించిన ప్రభువులు ఉన్నారు. పర్షియా మొదలైన దేశాలనుండి ఎందరో కవులు, కళాకారులు వీరి దర్బారుకు తరలివచ్చారు. వీరి కాలంలో గొప్ప భవనాలు అనేకం నిర్మించబడ్డాయి.

ఉర్దూభాష ఈనాడు దేశంలోని ముఖ్యభాషలలో ఒకటి. అసలు 'ఉర్దూ' అనే పదానికి 'శిబిరం' అని అర్థం. మొట్టమొదట యుద్ధశిబిరాలలో సిపాయిలలో ప్రచలితమైనందు వల్ల, ఈ భాషకు ఆ పేరు వచ్చింది. బహమనీరాజులు ఉర్దూ భాషను పోషించారు. ఉత్కృష్టమైన ఉర్దూ గ్రంథాలు వీరి కాలంలో అనేకంగా వెలువడ్డాయి.

బహమనీ వంశీయులలో కట్టకడపటి రాజు దుర్బలుడైనందువల్ల అతని మరణానంతరం బహమనీ రాజ్యం ఛిన్నాభిన్నమైంది. అహమ్మద్‌నగర్, బీరార్, బీదర్, బీజపూర్, గోల్కొండ

అనే అయిదు చిన్న రాజ్యాలుగా విడిపోయింది.

## విజయనగర సామ్రాజ్యం

తుంగభద్రకు దక్షిణాన ఇటీవల కొత్తగా కట్టిన ఆనకట్ట సమీపంలో హంపి అనే చిన్న ఊరు ఉంది. ఇక్కడ చెల్లాచెదరై ఉన్న ప్రాచీన భవనాల శిథిలాలను చూడడానికి నేటికీ వినోద యాత్రికులు పెక్కుమంది వెళ్తూ ఉంటారు. ఒకప్పుడు ఒక గొప్ప సామ్రాజ్యానికి రాజధానిగా ఉండి సిరిసింపదలతో తులతూగిన ఒక ప్రాచీన మహానగరపు జీర్ణశిథిలాలే ఇవి. 200 సంవత్సరాలకు పైగా ఉచ్ఛదశ అనుభవించిన విజయనగర సామ్రాజ్యా చరిత్ర సువర్ణాక్షరాలతో లిఖించదగింది.

విజయనగర సామ్రాజ్యాన్ని ఏలిన రాజులలో శ్రీకృష్ణ దేవరాయులు మేలుబంతి అనదగినవాడు. ఇతర విజయనగర మహారాజులకు వలెనే ఇతనికిన్నీ అంతులేని సౌందర్యపిపాస ఉండేది. శ్రీకృష్ణ దేవరాయులు స్వయంగా పండితుడు. భాషాపోషకుడు. సర్వకళలకు ఏడుగడయై నిలిచినవాడు. తెలుగు సంస్కృత రచయితలకు కల్పతరువు. పరిపాలనా దక్షుడు. అతని కాలంలో విజయనగర రాజ్యం కృష్ణానదికి దక్షిణాన ఉన్న దేశమంతటా వ్యాపించి, మహర్దశను అనుభవించింది. ఇటలీ, పోర్చుగల్, పర్షియా, సమర్ఖండ్ మొదలైన విదేశాలనుండి రాయబారులు, యాత్రీకులు ఈ ప్రభువు ఆస్థానం చూడవచ్చి, అక్కడి శేముషీ విలాసవైభవాలను చూసి విస్మితులయేవారు. సమస్త సౌకర్యాలతో అందంగా కట్టిన ఆ నగరాన్ని, అందులోని సుందర దేవ మందిరాలను, ప్రాసాదాలను, నడగొండలవంటి గజయూథాలను, బలిష్ఠమైన అశ్వదళాలను తిలకించి యాత్రీకులు అబ్బురపడేవారు. విజయనగర సామ్రాజ్యంలో వాస్తుశిల్పానికి నిలయాలనదగిన రమ్యహర్మ్యాలనేకం కృష్ణదేవరాయలు కట్టించినవే. శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానంలో అష్టదిగ్గజాలని వినుతికెక్కిన ఎనమండుగురు కవులుండేవారు. కవులు, కళాకారులు, గాయకులతో ఆయన ఆస్థానం కళకళలాడుతూ ఉండేది. కృష్ణదేవరాయలు సింహాసనం అధిష్ఠితుడై ఉన్న కాలంలోనే పోర్చుగీసువారు గోవాను వశపరచుకొన్నారు. ఈ కథ ముందుముందు వివరించబడుతుంది.

విజయనగర, బహమనీ రాజ్యాల మధ్య మొదటి నుండి తరచుగా యుద్ధాలు జరుగుతూ ఉండేవి. బహమనీ రాజ్యం అయిదు చిన్న రాజ్యాలుగా చీలిపోయిన తరువాత కూడా వాటి బద్ధవైరం సాగుతూనే వచ్చింది.

కృష్ణ దేవరాయుల తరువాత రాయరాయలు విజయనగరాధీశ్వరుడయ్యాడు. ఒకసారి ఒక సుల్తానును ఆయన అవమానించాడని, వారందరూ కలిసి విజయనగరం మీద కత్తిగట్టారు. సమయం చూసి ఆ అయిదుగురు సుల్తానులు ఒక్కుమ్మడిగా విజయనగరంపై దండెత్తారు. కృష్ణానది తీరాన తల్లికోట అనే గ్రామం వద్ద ఇరుపక్షాలకు భీకర యుద్ధం జరిగింది. ఇందులో విజయనగర సైన్యం పరాజితమైంది.

సుల్తానుల సైనికులు రాజధానిపై పడి ఇష్టం వచ్చినట్లు పట్టణాన్ని కొల్లగొట్టి తగులబెట్టారు. ఒకప్పుడు మహోచ్ఛదశను అనుభవించిన ఆ రమణీయ నగరం చివరికి ఈ విధంగా బుగ్గిపాలై, నిర్మానుష్యమై పోయింది. దీనితో దక్కను ప్రాంతమంతా సుల్తానుల చేతిలోకి వచ్చింది. కాని తరువాత వారుకూడా మొగలుల చేత ఓడించబడి తమ రాజ్యాలను పోగొట్టుకొన్నారు.

# భక్తియోగులు

మహమ్మదు ఘజ్నీ దండయాత్రలు జరిగిన తరువాత భారతదేశానికి వచ్చిన ముస్లిములు దేశసంపదను కొల్లగొట్టి వెంటతీసుకుపోవడానికికాక ఈ గడ్డమీద స్థిరపడి, దీనిని మాతృభూమిగా చేసుకోవడానికి వచ్చినవారే. హిందువులతో కలసి మెలసి జీవిస్తూ వారి ఆచార వ్యవహారాలలో కొన్నిటిని వీరు అవలంబించారు. అందువల్లనే ఇప్పటికీ కొన్ని ఉత్సవాలలోను పెళ్లిళ్ల సందర్భంలోను జరిగే తంతు దేశంలో ఉభయమతాలవారికి చాలావరకు ఒకేవిధంగా ఉన్నది. ఇటు హిందువులు కూడ ముస్లింలనుండి అనేక కొత్త విషయాలు నేర్చుకొన్నారు. ఉదాహరణకు, కాగితం తయారు చేయడమెలాగో హిందువులు ముస్లింలనుండి నేర్చుకొన్నదే. హిందువులు పర్షియన్ భాషనుకూడా అభ్యసించారు. అంతేకాదు, మనం హిందుస్థానీ అనే భాష హిందువుల, ముస్లింల భాషలు రెండు కలవగా పుట్టినదే.

హిందువులు, ముస్లింలు కలిసిమెలిసి జీవించడం అలవరచుకొన్న ఫలితంగా, హిందూ ముస్లిం శిల్పాల మేలుకలయిక అనదగిన కొత్త వాస్తుకళ ఒకటి అవతరించింది. ఆ కాలంలో నిర్మించబడిన పెద్ద పెద్ద కట్టడాలలో పర్షియా శిల్పరీతులు కూడా మేళవించాయి. వెనుకటి ముస్లిం రాజులు పర్షియా, మధ్య ఆసియాలనుండి వచ్చినవారు కావడమే ఇందుకు కారణం. ఇటు ప్రాచీన హిందూ శిల్పశైలి కూడ వీటిలో కనిపిస్తుంది. అందుకనే ఈ శిల్పాన్ని హిందూ ముస్లిం మిశ్రమ వాస్తు శైలి అంటారు. ఈవిధమైన సమ్మేళనం ఒక్క వాస్తు శిల్పంలోనే కాకుండా జీవనవిధానంలో, ఆలోచనాసరళిలో, సంగీతసాహిత్యాలలో, చివరికి మత విశ్వాసాలలో సైతం ప్రతిబింబించింది.

మీరింతవరకూ అనేక రాజ్యాలను గురించి, వాటిని ఏలిన రాజులను గురించి చదివారు. ఇప్పుడు ఆ కాలం నాటి సామాన్య ప్రజలను గురించి తెలుసుకొందాము. ఆ రోజులలో భాగ్యవంతులకు, బీదవారికీ మధ్య అంతరం ఎక్కువగా ఉండేది. పేదవారు తమ పాలకులు ఎవరైనదీ పట్టించుకొనేవారు కాదు. ఏలిక ఎవరైనా తమ స్థితిగతులలో మాత్రం మార్పేమీ ఉండబోదన్న నిరాశ చేత ప్రజలు ఉదాసీనులై ఉండేవారు. పెద్ద పెద్ద యుద్ధాలు జరిగే

కాలంలో కూడా యుద్ధరంగానికి చేరువలో పొలాలలో రైతులు ఆ సంగతి ఏమీ తమకు పట్టనట్లు తమ పనిపాటులను తాము ఎవరిపాటున వారు చేసుకుంటూ ఉండేవారు.

అప్పటికి కుల వ్యవస్థ బాగా వేరూని రాటుతేలింది. అగ్రకులాలవారు తక్కిన కులాలవారిని హీనంగా చూసేవారు. అగ్రకులాలవారికి తమకు ఎలాంటి సంబంధము లేదని, ఎవరి దోవ వారిదే అని తక్కువ కులాలావారు భావించసాగారు.

పరిస్థితులు ఇలా ఉండగా ఒక అద్భుతం జరిగింది. భగవంతుని పట్ల, మతం పట్ల దేశంలో ఒక నూతన దృక్పథం బయలుదేరింది. ఆ కొత్తభావాలు ప్రజల జీవితాలను గుర్తుపట్టరానంతగా మార్చివేయసాగాయి. మనదేశంలో అవతరించిన కొందరు మహాభక్తులు, యోగులు ఈ నూతన పథానికి ప్రవర్తకులైనారు. ఈ కొత్త దృక్పథం క్రమంగా యావద్దేశానికి వ్యాపించి, ప్రజా బాహుళ్యాన్ని మంత్రముగ్దుల్ని చేసింది. వీరు బోధించిన భక్తిమార్గం హిందువులను, ముస్లింలను మరింత సన్నిహితపరచి యావద్దేశాన్ని ఒకటిగా కలిపివేసింది. ఇందువల్ల దేశంలోని పేద ప్రజలకు కొత్త ఆశలు చిగురించాయి. ఈ పరిణామం ఏవిధంగా ప్రారంభం అయిందో ఇప్పుడు తెలుసుకొందాము.


భగవంతుని చేరుకునేందుకు జీవుడు తనను మరచిపోవాలన్నాడు రామానుజుడు

## రామానుజులు

ముస్లింలు ఈ దేశంలో స్థిరపడుతున్న రోజులలోనే దక్షిణదేశంలో, మద్రాసుకు సమీపంలో శ్రీపెరంబుదూర్ అనే గ్రామంలో ఒక మహాపురుషుడు జన్మించాడు. అతని పేరు రామానుజుడు. రామానుజుడు పెరిగి పెద్ద-వాడయిన తర్వాత, సమకాలిక సమాజంలో హిందువులు సంకుచిత స్వభావులై ఉండడం చూసి ఎంతో పరితపించాడు. అగ్రకులస్థులు తక్కువ కులాలవారితో సంబంధం పెట్టుకోకుండా, అహంభావంతో విర్రవీగుతూ

ఉండేవారు. నాటి హిందువులు మతం పేరుతో అర్థం లేని కర్మకాండలు ఏవేవో పొద్దస్తమానం జరిపిస్తూ ఉండేవారు. తాము జరిపే క్రతువులు, పూజలు వారికే అర్దమయ్యేవికావు. ఈ పద్దతి రామానుజులకు నచ్చలేదు. భగవంతుణ్ణి చేరడానికి అన్ని కులాలవారు అర్హులేననీ, అహంభావం వదులుకొని, నిర్మలమైన భక్తితో ఈశ్వరుణ్ణి ధ్యానించడమే మోక్షప్రాప్తికి మార్గమని ఉద్బోధించారు. ఇదే భక్తిమార్గం. ప్రాచీన కాలం నుండి సంస్కృత విద్యా కేంద్రంగా విలసిల్లిన కాంచీపురంలో రామానుజులు తమ భక్తి మార్గాన్ని మొదట ప్రవచించారు. రామానుజులు బోధించిన సత్యాలు నిజానికి కొత్తవేమీకావు. ఉపనిషత్తులలో, భగవద్గీతలో చెప్పబడిన నిత్య సత్యాలే అవి. అయితే ప్రజాబాహుళ్యానికి వారి స్వంత భాషలో భక్తిమార్గాన్ని ఉపదేశించి, ఆ మార్గాన్ని విరివిగా ప్రచారం చేసిన మతబోధకులలో రామానుజుడు మొదటివాడు. రామానుజుని బోధలకు ముగ్దులై ప్రజలు అనేకమంది ఆయనకు అనుయాయులయ్యారు.

రామానుజులకు రామానందుడనే శిష్యుడున్నాడు. అతడు తన ఆచార్యుని భక్తి సందేశాన్ని వారణాసివరకు వ్యాపింపచేశాడు. అనేకమంది ఆయనను అనుసరించారు. వీరిలో ఒక్క బ్రాహ్మణులే కాకుండా అన్ని కులాలవారూ ఉన్నారు. ఇలా శిష్యులైన వారిలో కొందరు ధనికులు కూడా ఉన్నా, ఎక్కువమంది పేదవారే. సాలె పనిచేసుకొనే ఒక ముస్లిం భక్తుడు కూడా ఆయన శిష్యకోటిలో చేరాడు.

## కబీరు

ఆ సాలె భక్తుడెవరో ఈపాటికి మీరు గ్రహించే ఉంటారు. ఆయనే కబీరు. ఈశ్వరుని మహిమను కీర్తిస్తూ ఆ భక్తుడు పాడిన పాటలు ఆసేతుశీతనగ పర్యంతం దేశంలో నేటికీ ప్రచారంలో ఉన్నాయి. ''మనకు అందరికీ భగవంతుడు ఒక్కడే. అల్లా అన్నా, రాముడన్నా, ప్రపంచానికి ఈశ్వరుడు ఒక్కడే'' అని కబీరు గానం చేశాడు. నిజమైన భక్తి లేకపోతే



''మనం అల్లాగా గాని రాముడుగాగాని ఎలా పూజించినా దేవుడు ఒక్కడే '' అన్నాడు కబీరు

ఉపవాసాలు చేసినా, జపమాల తిప్పినా ప్రయోజనం శూన్యం. భగవంతుడు రాతి విగ్రహాలలో, మతగ్రంథాలలో లేడు. భక్తితో నిండిన నిర్మల హృదయంలోనే భగవంతుడు ఉన్నాడు. ఈ విధంగా కబీరు బోధించేవాడు. కబీరు సూక్తులచేత ఆకర్షించబడి వేలసంఖ్యలో హిందువులు, ముస్లింలు ఆయనకు శిష్యులయ్యారు. కబీరు మరణించినప్పుడు ఆయన మృతదేహం మాకు కావాలంటే మాకు కావాలని హిందువులు, ముస్లింలు తగవులాడుకొన్నారు. కబీరు కళేబరాన్ని తమ ఆచారం ప్రకారం దహనం చేయాలని హిందువులు కోరగా, వల్లకాడు, ఖననం చేయాలని ముస్లింలు పట్టుపట్టారు. ఈవిధంగా ఇరువైపులవారికీ తగవు సాగుతూ ఉండగా, శిష్యుడు ఒకడు కబీరు శవం మీద కప్పిన వస్త్రం తొలగించాడని, అప్పుడు చిత్రంగా కబీరు మృతదేహానికి బదులు గుబాళిస్తున్న గులాబులరాసి అక్కడ కనిపించిందని ఒక కథ ఉన్నది. అప్పుడు ఆ గులాబి పూరేకులను హిందువులు, ముస్లింలు చెరిసగంగా పంచుకొన్నారట. భక్త కబీరును ఆరాధించేవారు దేశంలో నేటికీ అనేకమంది ఉన్నారు. వీరిని కబీరు పంథీలని పిలుస్తారు.

## నానక్

కబీరు మరణించిన అనంతరం పంజాబులో ఒక మహాత్ముడు అవతరించాడు. ఆయన సిక్కుల మతగురువైన గురునానక్. హిందు, ముస్లిం మతాల మధ్య సామరస్యం కుదర్చడానికి గురునానక్ జీవితమంతా కృషి చేశాడు. కబీరువలెనే ఆయనకూడా, మానవులు ఏమతానికి, లేదా కులానికి చెందినవారైనప్పటికి అందరూ భగవంతుని దృష్టిలో సమానులేనని ప్రవచించాడు. ''భగవంతుడు ఎవరినీ నీ కులం ఏమిటని గానీ, నీ మతం ఏమిటని గానీ ప్రశ్నించడు. జీవితకాలంలో పుణ్యకార్యాలు చేశావా, పాపకార్యాలు చేశావా అని మాత్రమే అడుగుతాడు'' అనేవాడు నానక్. ప్రజలలో ఈ సందేశం ప్రచారం చేస్తూ



హిందు, ఇస్లాం మతాలను దగ్గరకు తెచ్చేందుకు నానక్ ప్రయత్నించాడు

నానక్ దేశపర్యటన చేసి ఎన్నో హిందూ దేవాలయాలను, ముస్లిం మసీదులను సందర్శించాడు. ముస్లింలకు పవిత్రమైన మక్కాకు, హిందువులకు పుణ్యతీర్థాలైన వారణాసి, హరిద్వారం, పూరీ మొదలైన యాత్రా స్థలాలకు వెళ్లి తన సందేశం వినిపించాడు. గురునానక్ అనుయాయులు సిక్కులని పిలువబడుతున్నారు. ''శిష్య'' అనే సంస్కృతపదం నుంచి పుట్టినదే ''సిక్కు'' అనేమాట.

## మీరాబాయి

భక్త మీరాబాయి గురించి విననివారంటూ ఉండరు. ఈమె రాజపుత్ర కుటుంబంలో జన్మించింది. మేవాడ రాజకుటుంబానికి కోడలుగా వెళ్లింది. మీరాబాయి చిన్నతనంలోనే శ్రీకృష్ణుని భక్తురాలు అయింది. ఆమెకు వేషభూషలంటే ఏనాడూ మోజులేదు. శ్రీకృష్ణుణ్ణే తన సర్వస్వంగా భావించి, ప్రభువుగా ప్రేమించి ఆయన మహిమను సదా ధ్యానం చేస్తూ తన్మయం చెందేది. మీరాబాయి పాడిన భజన గీతాలను దేశమంతటా ప్రజలు భక్తితో నేటికీ పాడుకుంటున్నారు.



*తాను ఆరాధించిన కృష్ణ భగవానుని గురించే మీరాబాయి ఎప్పుడూ ఆలోచిస్తూండేది*

అనేకమంది పుణ్యపురుషుల ప్రబోధంవల్ల, భక్తిభావం దేశమంతటా ఇలా వ్యాపించింది. బెంగాలులో చైతన్యుడు, మహారాష్ట్రలో జ్ఞానేశ్వర్, సంత్ తుకారాం, గుజరాతులో నర్సీమెహతా, దాదూ మొదలైన యోగులు జన్మించి సులభమైన వాడుక భాషలో ఉపదేశాలు చేసి, భక్తి సందేశాన్ని నలుమూలలా వ్యాపింపచేశారు. నిర్మలమైన భక్తియోగమే మోక్షసాధనకు ఉత్తమ మార్గమని బోధించారు. హృదయాలను భక్తిరస పూరితం చేసుకుంటే పురోహితుల మధ్యవర్తిత్వంతో అవసరంలేకుండానే నిరుపేదలు, దీనులు సైతం ఈశ్వర సాన్నిధ్యాన్ని పొందగలరని వారు ఉగ్గడించారు. దేశంలో ఈవిధంగా చివరికి భక్తిమార్గమే ఒక మతంగా రూపొందింది.

# మొగలుల రాక

మనదేశ చరిత్రలో మరొక గొప్ప యుగాన్ని గురించి, మనమిప్పుడు తెలుసుకుందాము. ఇప్పుడు మీరు చదవబోయేది మొగలుల యుగం గురించి.

ఘనత వహించిన ఆరుగురు ప్రఖ్యాత చక్రవర్తులు ఈ యుగంలో దాదాపు 200 సంవత్సరాలు భారత దేశాన్ని పరిపాలించారు. మొగలు సామ్రాజ్యానికి స్థాపకుడైన వ్యక్తి బాబరు. చివరి ప్రముఖ మొగలు చక్రవర్తి ఔరంగజేబు. బాబరు తైమూరు వంశంవాడు. తైమూరు వలెనే బాబరుకూడా మొదట భారతదేశంపై దండెత్తి కొల్లగొట్టడానికే వచ్చాడు. అయితే కొల్లగొట్టి తిరిగిపోకుండా బాబరు ఇక్కడనే స్థిరపడి, తనకు, తనవారికి భారతదేశాన్ని ఆవాసంగా చేసుకొన్నాడు.

''బాబరు'' అంటే ''సింహం'' అని అర్థం. 12 సంవత్సరాల చిరుత ప్రాయంలోనే బాబరు మధ్య ఆసియాలో ఒక చిన్న రాజ్యానికి అధిపతి అయ్యాడు. పెద్దవాడైన తరువాత బాబరు కాబూలను జయించాడు. భారతదేశంనుండి విదేశాలకు సుగంధ ద్రవ్యాలను, నాజూకైన వస్త్రాలను, తదితర వస్తువులను ఎడతెగకుండా మోసుకొని వెళ్లే ఒంటెల బారులను బాబరు ఆసక్తితో పరికిస్తూ ఉండేవాడు. చివరకి ఒకనాడు భారత్‌ను జయించాలని బాబరు తీర్మానించుకున్నాడు. ఎక్కువ కష్టంలేకుండానే పంజాబును వశపరచుకోగలిగాడు. అక్కడనుంచి బాబరు ఢిల్లీపై దండయాత్ర సాగించాడు.

లోదీ వంశానికి చెందిన ఇబ్రహీం ఆ రోజులలో ఢిల్లీకి ఏలికగా ఉన్నాడు. బాబరు సైన్యానికి మూడింతల సైన్యాన్ని కూర్చుకొని ఇబ్రహీం లోదీ శత్రువుతో తలపడడానికి వెళ్ళాడు. ఇరువర్గాల సైన్యాలు పానిపట్ వద్ద కలుసుకున్నాయి. బాబరు దగ్గర మందుగుండు, ఫిరంగులు, ఇతర ఆయుధాలు పుష్కలంగా ఉన్నాయి. అతని సైనికాధికారులు కడుసమర్థులు. వారిలో అతని కుమారుడు హుమాయూన్ ఒకడు. ఆ రోజులలో శతఘ్నులు ఇంకా కొత్త కావడంవల్ల ఇబ్రహీం లోదీ సైన్యానికి వాటినెలా ఎదుర్కోవాలో తెలియలేదు. శత్రు సైనికులు ప్రయోగించిన ఫిరంగుల మోతకు ఇబ్రహీం లోదీ ఏనుగు దళాలు బెదిరి పారిపోతూ లోదీ

సైనికులనే అనేకమందిని కాళ్ళతో మట్టగించి చంపివేశాయి. సుల్తానుతోసహా లోదీ సైన్యంలో 20 వేలమంది యుద్ధంలో హతులయ్యారు. బాబరుకు ఘనవిజయం లభించింది.

ఆ తర్వాత బాబరు మేవాడ్‌ను పాలిస్తున్న రాణా సంగాను, అతని నాయకత్వాన ఎదురొడ్డి నిలిచిన రాజపుత్రులను ఓడించాడు. బీహారులో రాజ్యం చేస్తున్న ఆఫ్గాన్ రాజవంశీయులను కూడా బాబరు జయించాడు. ఈ విజయ పరంపరలతో బాబరు సామ్రాజ్యం అటు హిందూకుష్ పర్వాతాలనుండి, ఇటు బెంగాల్ సరిహద్దుల దాకా వ్యాపించింది.



బాబరు మంచి ధైర్య సాహసాలుగల యోధుడు

బాబరు గొప్ప ధైర్యశాలియే కాకుండా ప్రజ్ఞావంతుడు కూడా. తాను చూచిన విశేషాలను, తన అభిప్రాయాలను ఎప్పటికప్పుడు వివరంగా వ్రాసిపెట్టుకుంటూ ఉండేవాడు. ఈ రచనల సంకలనానికే ''బాబరునామా'' అని పేరు.

బాబరు తన జీవితంలో చివరిరోజులను ఆగ్రాలో గడిపాడు. అనేక సంవత్సరాల క్రిందట తాను వదలిపెట్టివచ్చిన ఫర్గానా దేశంలో పండే తీయని పళ్ళను అక్కడి సెలఏటి నీటి మంజుల ధ్వనులను తలపునకు తెచ్చుకుంటూ దిగులుగా రోజులు గడిపేవాడు. జలజల పారే సెల ఏరులన్నా, చక్కని ఉద్యానవనాలన్నా బాబరుకు ప్రాణం. గొప్ప సామ్రాజ్యానికి స్థాపకుడై పండు వయస్సులో బాబరు మరణించినప్పుడు, అతని మృతదేహాన్ని కాబూలుకు తీసుకొని వెళ్ళి అక్కడ ఖననం చేశారు.

బాబరు మృతిని గురించి ప్రసిద్ధమైన కథ ఒకటి ఉంది. ఒకసారి అతని కుమారుడు హుమాయూన్‌కు జబ్బుచేసి మంచమెక్కాడట. హుమాయూన్ అంటే బాబరుకు ప్రాణం. కొడుకుకు రానురాను జబ్బు తీవ్రమైంది. అప్పుడు ముస్లిం సాధువు ఒకడు బాబరు వద్దకు వచ్చి అమూల్యమైనదిగా తాను దేనిని భావిస్తాడో ఆ వస్తువును త్యాగం చేస్తే హుమాయూన్

జబ్బు నయం అవుతుందని సలహా ఇచ్చాడు. బాబరు అందుకు సంతోషంతో అంగీకరించాడు. బాబరు వద్ద ఒక అమూల్యమైన వజ్రం ఉండేది. బహుశా ఆయన ఆ వజ్రాన్ని వదులుకుంటాడని అందరూ అనుకొన్నారు. అయితే బాబరు దృష్టిలో తన ప్రాణమే అన్నిటికన్నా అమూల్యమైనదని కనుక దానినే వదులుకుంటానని అన్నాడు. సన్యాసి చెప్పిన ప్రకారం బాబరు తన కుమారుని మంచం చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చేసి తాను అమూల్యమైనదిగా భావించే తన ప్రాణాన్ని అర్పించదలచానని ప్రతిజ్ఞ చేశాడట. ఆ తర్వాత అచిరకాలానికే హుమాయూన్‌కు జబ్బు నయమై కోలుకొన్నాడు. అదే సమయంలో తండ్రి బాబరు వ్యాధిగ్రస్తుడై మరణించాడు.

## హుమాయూన్

బాబరుకు అత్యంత ప్రేమపాత్రుడైన హుమాయూన్ తండ్రి తదనంతరం రాజుగా ఎంచుకోబడ్డాడు.

హుమాయూన్ పెద్ద సైన్యంతో దండెత్తి వెళ్ళి మొదట గుజరాతును జయించాడు. హుమాయూన్ వీరుడేగాని అతనిలో ఒక పెద్ద లోపం ఉండేది. మించిపోయే రాచకార్యాలు ఎన్నివున్నా, ఎక్కువకాలం విలాస వినోదాలతోనే కాలక్షేపం చేసేవాడు. గుజరాతును జయించిన తరువాత హుమాయూన్ వినోద కాలక్షేపాలలో పూర్తిగా మునిగిపోయాడు.

హుమాయూన్ మద్యపానంతో, కవితా గోష్టులతో ఉల్లాసంగా కాలం గడుపుతూండగా అటు బీహారులోని ఆఫ్ఘాను సేనాని షేర్షా సూరి హుమాయూన్‌పై అదాటుగా తిరుగుబాటు చేశాడు. రెండేళ్లు సాగిన ఈ యుద్ధంలో హుమాయూన్ చివరికి పరాజితుడయ్యాడు. అతని సైనికులలో అధికభాగం శత్రువుకు పట్టుబడటమో, యుద్ధంలో మరణించడమో జరిగింది. పారిపోవడానికి దారిలేక ప్రాణసంకటంలో పడ్డ హుమాయూన్‌కు నీళ్లు చేరబోసే కూలివాడు ఒకడు పెద్దతోలు తిత్తి ఇచ్చి దారికి అడ్డుగా ఉన్న నదిని దానిసాయంతో దాటిపోవచ్చునని ఉపాయం చెప్పాడు. నిరాశ్రయుడై హుమాయూన్ దాదాపు 15 సంవత్సరాలు దేశాలు పట్టి తిరగవలసి వచ్చింది. ఢిల్లీ సింహాసనాన్ని షేర్షా సూరి అధిష్ఠించాడు.

విధేయులైన కొందరు అనుచరులతో హుమాయూన్ ఏలగైతేనేమి రాజస్థాన్ ఎడారిని దాటి సింధురాష్ట్రంలో అమర్‌కోట్ అనే ప్రదేశాన్ని చేరుకున్నాడు. తాపానికి, దాహానికి తాళలేక తోవలో అతని భృత్యులు పలువురు చనిపోయారు. అమర్‌కోట్ చేరిన తరువాత

కూడ శత్రువులు తనను వెన్నాడుతూనే ఉన్నట్లు అతనికి తోచింది. కొంతమంది పరివారంతో భార్యను అక్కడ వదలి, హుమాయూన్ పడమటి దిశగా సాగిపోయాడు. కొద్దిదూరం వెళ్లాడో లేదో వార్తాహారుడొకడు గుర్రంపై దౌడుతీస్తూవచ్చి హుమాయూన్‌కు కుమారుడు కలిగినట్లు శుభవార్త వినిపించాడు. ఈ వార్తవిన్న హుమాయూన్ సంతోషానికి మేరలేకపోయింది. అయితే తగువిధంగా వేడుకలు జరిపించడానికి అతనివద్ద చిల్లిగవ్వ కూడా లేదు. ఉన్నదల్లా ఒక కస్తూరి ముద్ద మాత్రమే. దానినే చిన్న ముక్కలుగా కోసి కష్టదశలో తనను అంటిపెట్టుకొని ఉన్న కొద్దిమంది సన్నిహిత సహచరులకు పంచిపెట్టి తృప్తి పడ్డాడు. హుమాయూన్‌కు అప్పుడు పుట్టిన ఆ పిల్లవాడే అక్బర్. అక్బర్ పెద్దవాడై మొగలు చక్రవర్తులలో సాటిలేని మేటిగా పేరుపొందాడు. ఆపత్సమయంలో హుమాయూన్‌కు అతని సోదరులు సైతం ఆశ్రయమివ్వవేదు. గత్యంతరం లేక హుమాయూన్ పర్షియాకు శరణార్థియై పోవలసివచ్చింది.

## షేర్షా సూరి

హుమాయూన్‌ను ఓడించి ఢిల్లీ సింహాసనం ఎక్కిన షేర్షా ప్రజానురంజకుడు. అతను పేదరైతులను ఎంతో ప్రేమతో చూసేవాడు.

షేర్షా దేశాన్ని సర్వే చేయించి పరిపాలనకు అనువుగా దేశాన్ని పరగణాల కింద విభజించాడు. ప్రభుత్వానికి సంబంధించిన లెక్కలు సామాన్య ప్రజలకు కూడా అర్థమయ్యేట్లు పర్షియను, హిందీ భాషలలో రెంటిలో లెక్కలు వ్రాయించేవాడు. ప్రతి రైతూ శిస్తుకింద ఎంత మొత్తం చెల్లించాలో ఖరారు చేసి, ఆ ప్రకారం అందరివద్ద శిస్తులు వసూలు చేయించేవాడు. ఉద్యోగులకు, అధికారులకు న్యాయంగా రావలసిన జీతభత్యాలకు మించి చిల్లిగవ్వ కూడా పైన ముట్టేదికాదు.

షేర్షా అనేక చోట్ల రోడ్లు వేయించి రోడ్ల కిరువైపులా చక్కని చెట్లు నాటించాడు. ఆఫ్ఘనిస్థాన్ సరిహద్దునుండి సరాసరిగా బెంగాలుకు వెళ్ళే పొడవైన పాతరహదారికి మరమ్మత్తులు జరిపించి అదివరకటికంటే దానిని చాలా వెడల్పు చేయించాడు. దేశం నలుమూలలకు రహదార్లు పడడంవల్ల వాణిజ్యం పెరిగి వర్తకులు ధనవంతులయ్యారు.

షేర్షా మరణించిన తరువాత తిరిగి తన పైతృకమైన సింహాసనాన్ని చేజిక్కించుకునే అవకాశం హుమాయూన్‌కు లభించింది.

అయితే ఆ విధంగా మళ్లీ గద్దె ఎక్కిన ఆరునెలలోగానే హుమాయూన్ మరణించాడు. ఒకనాడు పొద్దున గ్రంథాలయంలో ఆయన చదువుకుంటూ ఉండగా నమాజుకు పిలుపు వినిపించింది. హడివిడిగా లేచి మెట్లు దిగుతూఉంటే కాలుజారి అమాంతం కిందికి దొర్లిపోయాడు. ఆ పడ్డ పాటుకు ఒంటినిండా తీవ్రమైన గాయాలు తగిలి కొద్దిరోజులలోనే హుమాయూన్ ప్రాణాలు విడిచాడు. అప్పటికి సరిగ్గా 13 ఏళ్ళ వయస్సుగల హుమాయూన్ కుమారుడు అక్బరు తండ్రి మరణానంతరం రాజ్యానికి వచ్చాడు.


అక్బరు సామ్రాజ్యం
కాబూల్
పెషావర్
శ్రీనగర్
జీలమ్
లాహోర్
ఖండహార్
బ్రహ్మపుత్ర
సింధు
సట్లెజ్
ఢిల్లీ
గంగ
యమున
రాజపుటానా
ఆగ్రా
అమర్‌కోట
సింధ్
చిత్తూరు
మాల్వా
బీహార్
బెంగాల్
నర్మద
గోండ్వానా
బేరార్
గోదావరి
అహమద్‌నగర్
గోల్కొండ
బీజాపూర్
కృష్ణ
మచిలీపట్నం
కావేరి
కాలికట్
కొచ్చిన్
మదుర

85

# అక్బరు, అనంతర మొగలు చక్రవర్తులు

ఆ చిన్న వయస్సులో అక్బరు మొగలు సింహాసనమెక్కినప్పుడు ప్రపంచంలోని చక్రవర్తులలోకెల్లా ఉత్తరోత్తరా అతడే అగ్రగణ్యుడు అవుతాడని ఎవ్వరూ బహుశా ఊహించి ఉండరు. అక్బరు అదృష్టంవల్ల అతని తండ్రి తాతల కొలువులో తల పండిన బైరాంఖాన్ అనే నమ్మినబంటు బాల్య వయస్సులో అతనికి రక్షకుడుగా దొరికాడు. ఇలా ఉండగా కొంత కాలం తరువాత హేమూ అనే సేనాధిపతి అక్బరు మీద తిరుగుబాటు చేశాడు. వెంటనే బైరాంఖాన్ సైన్యాన్ని సమీకరించాడు. అక్బరు తాతగారైన బాబరు ఇబ్రహీం లోదీని అదివరకు ఎక్కడ ఓడించాడో ఆ యుద్ధరంగంలోనే హేమూ సైన్యాలపై బైరాంఖాన్ ఘనవిజయం సాధించాడు.

సుమారు 18 ఏళ్ళ వయస్సు వచ్చిన తరువాత అక్బరు రాజ్య వ్యవహారాలను స్వయంగా చూసుకోవడం మొదలుపెట్టాడు. తన సామ్రాజ్యాన్ని ఇంకా పెద్దది చేయాలని అక్బరు నిశ్చయించుకున్నాడు. తూర్పున బర్మానుంచి, పడమట పర్షియా వరకు ఉన్న ప్రాంతమంతా తన రాజ్యంలో కులుపుకునే దాకా విశ్రమించకూడదని ప్రతిజ్ఞ పట్టి, రెండు దశాబ్దాలు విధి విరాయమం లేకుండా పోరాడి అక్బరు తన లక్ష్యాన్ని సాధించాడు.

రాజపుత్రులకు, ముస్లింరాజులకు మొదటినుంచి పొత్తు కుదిరేదికాదు. వారు వీరిని పరాయివారుగానే చూస్తూ వచ్చారు. ఇద్దరి మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమనేది. రాజపుత్రులు కట్టుకున్న బలిష్ఠమైన దుర్గాలలో చిత్తోడ్ ఒకటి. ఇది ఒక కొండ కొమ్ముపై ఉంది. చిత్తోడ్‌ను అప్పుడు రాణా సంగా కుమారుడు ఉదయ్‌సింగ్ పరిపాలిస్తూ ఉండేవాడు. కాని ఉదయ్‌సింగ్ అసమర్థుడు. ఈ ప్రసిద్ధమైన దుర్గంమీద దండెత్తి వశపరుచుకోవడానికి అక్బరు బయలుదేరాడు. కాని ఆ పని ఏమంత సులువుగా కనుపించలేదు. మొగలు సైన్యాలు అనేకసార్లు దుర్గంమీద దాడిచేయడం, ప్రతిసారీ దెబ్బతిని వెనక్కు తిరిగిపోవలసి రావడం జరిగింది. జయమల్ అనే ప్రముఖ రాజపుత్ర సేనాని చిత్తోడ్ దుర్గాన్ని ప్రాణాలొడ్డి కాపాడుతున్నాడు. ఒక పర్యాయం మొగలు సైన్యాలు కోటమీద దాడి చేస్తున్నప్పుడు బురుజుల వెనుక అక్బరు జయమల్‌ను

చూశాడు. వెంటనే గురిచూసి కాల్చి జయమల్‌ను కూల్చివేశాడు. దీనితో నగరంలో భీతావహం అలముకుంది. ఉదయ్‌సింగ్ పలాయనం చిత్తగించాడు. మొగలు సైన్యాలు చీమల బారువలె కొండమీదికిపాకి కోటలోకి దూకాయి. అయితే దుర్గంలో ఉన్న 8000 మంది రాజపుత్రులంతా ఒకరై నిలిచి కడపటి సైనికుడు నేలకొరిగేవరకు భీకరంగా పోరాటం సాగించారు. ఇంతలో దూరాన చిత్తోడ్ దుర్గం గోపురాలమీదుగా అక్బరుకు నల్లనిపొగ సుళ్లు తిరుగుతూ పైకి లేవడం కనిపించింది. శత్రువుకు చిక్కకుండా అనూచానంగా వస్తున్న ఆచారం ప్రకారం, రాజపుత్ర వీరవనితలు అగ్నిదేవునికి ప్రాణాలను ఆహుతి చేస్తున్నారని అక్బరుకు వెంటనే అర్థమైంది. మరునాటి ఉదయం అక్బరు గజారూఢుడై దుర్గంలో ప్రవేశించాడు. నగరంలో ఉన్న ఐశ్వర్యమంతా ఆగ్రాకు తరలించబడింది. పీనుగు పెంటలతో నిండి చిత్తోడ్ శ్మశాన వాటికగా మారిపోయింది.

## మహారాణా ప్రతాప్

ఉదయ్‌సింగ్ కుమారుడైన మహారాణా ప్రతాప్‌కు హతశేషులైన రాతపుత్రవీరులు బాసటగా నిలిచారు. మొగలు సైన్యాలను చీల్చి చెండాడేవరకూ విశ్రమించబోమని వారు ప్రతిజ్ఞ చేశారు. రాజస్థాన్‌లోని కొండలమాటున శిబిరాలలో తలదాచుకొని ఈ వీరులు అదను దొరికినప్పుడల్లా మొగలు సైన్యాలను చీకాకుపరుస్తూ, 25 సంవత్సరాలు స్వైర విహారం చేశారు. అడవిలో దొరికే పళ్లు, కసుగాయలతో కడుపు నింపుకుంటూ కటికరాతిపై ఆరుబయట నిద్రిస్తూ అసహాయ శూరులైన రాజపుత్రులు దీర్ఘకాలం ప్రతిఘటన సాగించారు. కాని మొగలు సామ్రాజ్యపు వజ్రఘాతానికి తట్టుకోలేక మహారాణా ప్రతాప్ తుదకు పరాజయాన్ని అంగీకరించక తప్పలేదు. దేశంలో రాజపుత్రుల అధికారం ఈవిధంగా అంతరించిపోయింది.

గుణశాలియైన అక్బరు తనతో యుద్ధంలో ఓడిపోయిన శత్రువులను కనికరంతో చూసి వారిని ఆప్తమిత్రులుగా చేసుకొనేవాడు. అక్బరు ఒక రాజపుత్ర రాకుమారిని పెళ్ళి చేసుకుని, తన ఆస్థానంలో రాజపుత్ర రాజన్యులకు ఉన్నతమైన పదవులిచ్చాడు. తన కొలువులో ఉన్న ముస్లింలకు, హిందువులకు మధ్య తాను ఏమాత్రం భేదం చూపేవాడు కాదు.

రాజస్థాన్‌ను వశపరచుకున్న తరువాత అక్బరు గుజరాత్, బీహారు, బెంగాలు, ఒరిస్సా రాజ్యాలను జయించాడు.

మాల్వాను కూడా ఆక్రమించుకోవలసిందిగా అక్బరు తనకు సోదర సమానుడైన

ఆదం ఖాన్‌ను ఆదేశించాడు. మాల్వారాజు బాజ్ బహదూర్ రూపవతియైన తన హిందూసతి రూపమతితో ఆ కోటలో కాపురం ఉంటున్నాడు. ఆదం ఖాన్ ఒక ఎత్తు వేశాడు. ఒకనాడు సాయంత్రం ప్రశాంతంగా నిద్రిస్తున్న రూపమతిని చూసి మరులుగొని ఆదం ఖాన్ మరింత దగ్గరకు వెళ్లాడు. కాని తీరా తేరి చూస్తే అక్కడ అతనికి కనిపించింది రూపమతి కాదు, ఆమె మృతకళేబరం మాత్రమే. ఆదంకాన్ చేతికి చిక్కకుండా రూపమతి సమయానికి విషం పుచ్చుకొని ప్రాణం తీసుకుంది. రూపమతి విషయంలో ఆదం ఖాన్ ఎలా ప్రవర్తించిందీ విని అక్బరు మండిపడ్డాడు. అందుకు గట్టిగా మందలించాడు.

వాయవ్య ప్రాంతంలోని కొండజాతులతో అక్బరు సైన్యాలు అనేక సంవత్సరాలు యుద్ధం చేశాయి. తుదకు కాశ్మీరు కూడా సామ్రాజ్యంలో కలిసిపోయింది. ఇప్పుడు అక్బరు సామ్రాజ్యం అతని తాతగారి రాజ్యంకంటె ఎన్నోరెట్లు పెద్దది. కాని ఒక విషయం మాత్రం అక్బరును ఇంకా చికాకు పరుస్తూనే ఉన్నది. దక్కను రాజులు అతనిని ఇంకా సామ్రాట్టుగా గుర్తించలేదు. ఈవిధంగా అక్బరు సార్వభౌమాధికారాన్ని గుర్తించని రాజ్యాలలో అహమ్మదు నగరు ఒకటి. అక్బరు సైన్యం అహమ్మదు నగరు మీద దాడి చేసినప్పుడు రాణి చాంద్ బీబీ అమిత పరాక్రమంతో అతని సైన్యాలను ఎదిరించి పోరాడింది. కాని చివరికి మార్గాంతరం లేక చాంద్ బీబీ కూడా మొగలు చక్రవర్తితో సంధి చేసుకొంది.

నిజానికి ఒక రాజు గొప్పతనం అతని రాజ్యం వైశాల్యాన్ని బట్టిగాక ప్రజలకు అతడు ఎంత మేలు చేశాడు అన్నదానినిబట్టే ఉంటుంది. తన రాజ్యంలోని ప్రతివ్యక్తికీ న్యాయం చేకూర్చడానికి అక్బరు పడిన శ్రమ ఇంతంత కాదు. పరిపాలనకు అనువుగా అతను తన సామ్రాజ్యాన్ని 15 రాష్ట్రాలుగా విభాగించాడు. తనకు పూర్వం షేర్షా సూరి చేసినట్లుగానే, భూములన్నింటిని జాగ్రత్తగా కొలిపించి, పన్నుల కింద ఎవరు ఎంత సొమ్ము ఇవ్వవలసిందీ ఖచ్చితంగా లెక్క కట్టించాడు. ఏ సంవత్సరంలోనైనా వానలు కురవక గానీ, తెగుళ్లు వచ్చిగాని, తూఫానుదెబ్బ తగిలిగాని పంటలు చెడిపోతే, ఆ ఏటికి శిస్తు మాఫీ చేసేవాడు. షేర్షా కంటె కూడా అక్బరు రైతులను ఎక్కువ దాక్షిణ్యంతో చూసేవాడని చెప్పవచ్చు. అక్బరు హయాంలో భూమిశిస్తు విధానాన్ని రూపొందించిన రాజాతోడర్‌మాల్‌కు ఈ ఘనతలో కొంత దక్కవలసి ఉంటుంది.

అక్బరు కాలంలో దేశంలో క్రూరమైన దురాచారాలు అనేకం ఉండేవి. వాటిలో ఒకటి

సతీసహగమనం. భర్త చనిపోయినప్పుడు వితంతువైన ఆడది చితిఎక్కి భర్తశవంతోపాటు దహనమైపోవడం పత్నీధర్మంగా భావించేవారు. మరో దురాచారం, తెలిసీ తెలియని ఈడులోనే పిల్లలకు పెళ్లిళ్లు చేయడం. పోతే మూడవది ముస్లింలు కాని వారంతా జిజియా పన్ను



అక్బర్ తన ప్రాసాదానికి అన్ని మతాల గురువులను ఆహ్వానించి వారితో చర్చలు జరుపుతూండేవాడు

చెల్లించవలసి రావడం. వీటన్నిటికి తోడు శ్రీమంతులకు ప్రత్యేకమైన దురాచారం ఒకటి ఉండేది. యుద్ధంలో ఓడిపోయిన సిపాయీలను తెచ్చుకొని ధనికులు వారిచేత తమ ఇళ్ళలో ఆమరణాంతం బానిసలుగా చాకిరీ చేయించుకొనేవారు. ఈ ఆచారాలన్నీ అక్బరుకు కంటకంగా తోచాయి. వాటిని నిషేధిస్తూ ఆయన శాసనాలు చేశాడు.

అక్బరు దైవభక్తి తత్పరుడు. వివిధ మతస్థులు ఒకరితో ఒకరు చీటికి మాటికి కొట్లాడుకుంటూ ఉండడం అక్బరుకు చెప్పరాని వ్యధ కలిగించింది. ప్రతి మతంలోను మంచి అనేది ఏదో కొంత లేకపోలేదని అతని దృఢ విశ్వాసం. ఇతర మతాలను గురించి వీలైనంత తెలుసుకోవాలని ఉబలాటపడేవాడు. అన్ని మతాలకు చెందిన సాధువులను, పండితులను తన ప్రాసాదానికి ఆహ్వానించి రోజులతరబడి వారితో మతవిషయాలపై ఇష్టాగోష్ఠి జరిపేవాడు. సంపూర్ణంగా మనశ్శాంతినివ్వగలిగిన కొత్త ప్రార్థనా విధానం కనిపెట్టాలని అక్బరుకు చిన్నతనం నుంచి కోరికగా ఉండేది. చివరికి ''దిన్ ఇ-ఇలాహి'' అనే పేరుతో అక్బరు స్వయంగా ఒక కొత్త మతాన్ని ప్రారంభించాడు. ఈ పదానికి ''దైవ మతం'' అని అర్థం. అతని దర్బారులోని ఉద్యోగులనేకులు ఈ కొత్త మతాన్ని స్వీకరించారు. దేశంలో అంతకు పూర్వం నుంచి ఉన్న మతాల కంటె ఈ కొత్త మతం భిన్నమైనదని, వారు వీరూ అనే భేదం లేకుండా ఎవరైనా దీనిని స్వీకరించవచ్చునని, అందరూ ఈ మతం పుచ్చుకుంటే దేశంలో ఇక మత సంబంధమైన కలహాలు పూర్తిగా సమసిపోగలవని అక్బరు పెద్ద ఆశలు పెట్టుకున్నాడు. కాని దురదృష్టవశాత్తు సామాన్య ప్రజలలో ఎక్కువ మందిని ఈ కొత్త మతం ఆకర్షించలేకపోయింది.

అక్బరుకు సరిగా సంతకం చేయడం కూడా చేతకాదంటే చదువరులకు విస్మయం కలుగవచ్చు. ఏమైనా అక్బరుకు అంతులేని జ్ఞానతృష్ణ ఉండేది. పండితులు, కళాకారులు, వేత్తలు పరివేష్ఠించి ఉన్నప్పుడు అక్బరు సాక్షాత్తు స్వర్గధామంలో ఉన్నంతగా సంతోషపడేవాడు. తన దర్బారులోని విద్వాంసులు, కళాకారులలో తొమ్మిదిమంది శ్రేష్ఠులను ఎన్నుకొని వారికి నవరత్నాలని పేరుపెట్టాడు. అతని ప్రధానమంత్రి అబుల్ ఫజల్ ఈ నవరత్నాలలో ఒకడు. భగవద్గీతను పారసీకంలోకి అనువదించిన మహాకవి ఫైజీ మరొకడు. ప్రఖ్యాత సంగీత విద్వాంసుడు తాన్ సేన్ మరొకడు. బీర్బల్ చమత్కారాలను, సమయస్ఫూర్తిని గురించి మీరంతా కథలు వినేఉంటారు. హాస్యరసనిధి బీర్బల్ కూడా ఈ నవరత్నాలలో చేరినవాడే. అక్బరుకు మాన్యుడైన మరొక వ్యక్తి రాజా తోడర్‌మల్.

అక్బరు జీవితాన్ని గురించి ఇంత విపులంగా ఎలా తెలుసుకోగలిగామంటే, ముఖ్యంగా ఆయన ప్రధానమంత్రి అబుల్ ఫజల్ వ్రాసిన ఒక గ్రంథం వల్ల. ఈ మహాచక్రవర్తి పరిపాలనను గురించి ''అక్బరు నామా'' అనే పేరుతో అబుల్ ఫజల్ ఒక పుస్తకం వ్రాశాడు. అక్బరును గురించి, ఆ కాలపు స్థితిగతులను గురించి ఈ పుస్తకంలో చాలా వివరాలున్నాయి.

అనేక విషయాలను బట్టి అక్బరు గొప్పవాడు. ఆయన యోధుడేగాక గొప్ప నిర్మాత. అక్బరు చక్రవర్తి ఒక మహానగారాన్ని నిర్మించి దానికి ఫతేపూర్ సిక్రీ అని పేరు పెట్టాడు. అక్బరు అన్ని మతాలను సమానంగా ఆదరించినందువల్ల దేశంలో ఉన్న ప్రజలంతా ఒకే ఇంటి వారన్నట్టు ఐకమత్యంతో మెలగటం అలవరచుకోగలిగారు.

## తులసీదాసు - సూరదాసు

దేశంలో భక్తిమార్గం ఒక మహోద్యమంగా ఎలా పెల్లుబికిందీ ఇంతకుముందే తెలుసుకున్నాం. అక్బరు కాలంలో భక్తి మార్గ ప్రవర్తకులైన ఇద్దరు మహనీయులు ఉండేవారు.

వీరిలో ఒకరు ప్రసిద్ధుడైన తులసీదాసు. సరళమైన శైలిలో సులభమైన హిందీలో ఆయన రామాయణం రచించారు. ''రామచరిత మానస్'' అనే ఈ పుస్తకంలోని గీతాలను ప్రజాసామాన్యం భక్తి పారవశ్యంతో నేటికీ పాడుకుంటూ ఉంటారు.



*సులభగ్రాహ్యమైన హిందీలో తులసీదాసు రామాయణాన్ని రచించాడు*

ఈ కాలంలోనే జీవించిన మరోభక్తుడు అంధకవి సూరదాసు. కృష్ణభగవానుని లీలలను, మహిమలను హృదయంగమంగా వర్ణిస్తూ వేలకొలది పద్యాలను సూరదాసు రచించాడు. బాలకృష్ణుని చిలిపి చేష్టలను చిత్రించే మధురగీతాలు ఆయన రచనలలో బాగా ప్రసిద్ధమై విరివిగా ప్రచారంలోకి వచ్చాయి.

ఈ కవులు వాడిన భాష సరళమైనదే కాక సుందరమైనది. భక్త మీరాబాయి పాటలవలె ఈ ఇరువురి పాటలూ అనేక ప్రాంతాలలో నేటికి వినబడుతూ ఉంటాయి.

## జహాంగీరు

అక్బరు మరణించిన తరువాత అతని కుమారుడు సలీం రాజయ్యాడు. సలీం తనకు జహాంగీరని పేరు పెట్టుకొన్నాడు. అంటే ''ప్రపంచ విజేత'' అని అర్థం. తండ్రి నిర్మించిన వ్యవస్థను చెడగొట్టకుండా వీలైనంతవరకు దానిని బాగు చేయడానికే జహాంగీరు ప్రయత్నించాడు. ధనికులైనా, దరిద్రులైనా తన రాజ్యంలోని పౌరులందరికీ సమంగా న్యాయం పొందే హక్కు ఉన్నదని జహాంగీరు ప్రకటించాడు. తన గదికి సమీపంలో ఒకపెద్ద గంట కట్టించి దానికి ఒక పొడుగైన గొలుసు తగిలించి గొలుసు రెండవకొనను ప్రాసాద ద్వారం వెలుపల అందరికీ అందుబాటులో వ్రేలాడ గట్టించాడు. ఎవరికైనా సరే ఏదైనా అన్యాయం జరిగితే వెంటనే అది పగలైనా రాత్రి అయినా రాజభవనం దగ్గరకు వెళ్ళి గొలుసు లాగి గంటకొట్టి చక్రవర్తికి స్వయంగా తన మొర వినిపించుకోవచ్చు. దేశంలో అందరికీ పూర్తిగా న్యాయం జరిగించాలని ఎంతగా అభిలషించేవాడో, నేరస్థులకు శిక్షలు విధించడంలో జహాంగీరు అంత కఠినంగాను వ్యవహరించేవాడు.

జహాంగీరు రాకుమారుడుగా ఉంటున్న కాలంలో అక్బరు దర్బారులో ఒక పారసీక రాజవంశీయుడు ఉండేవాడు. అతనికి మెహరున్నీస్సా అనే కూతురు ఉంది. ఆమె చక్కని చుక్క. రాకుమారుడు సలీం రాజ్యానికి వచ్చిన తరువాత ఆమెను రాణిగా చేసుకున్నాడు. ఆమెకు నూర్జహాన్, అనగా ''ప్రపంచ జ్యోతి'' అనిపేరుపెట్టాడు. జహాంగీర్ ఆమెను ఎంత ప్రేమించేవాడంటే ఆమె కోరిక ఏదైనా సరే వెంటనే చెల్లించేవాడు. ఆమె తండ్రికీ, సోదరునికి జహాంగీరు ఉన్నత పదవులిచ్చాడు. ఆమె సలహా తీసుకోకుండా ఏపనీ చేసేవాడు కాదు. అనేక ముఖ్య వ్యవహారాలల్లో కూడా నిర్ణయాలు చేయవలసిన బాధ్యతను ఆమెకే వదలిపెట్టేవాడు. క్రమంగా జహాంగీర్ స్థానే రాజ్యానికి నూర్జహాన్ అసలైన పరిపాలకురాలైంది. మధురమైన కవితవింటూ, హృద్యమైన చిత్రాలను చూసి ఆనందిస్తూ జహాంగీరు రాత్రింబవళ్లు వినోదాలతో, వేడుకలతో గడపడం మొదలుపెట్టాడు. నాణాలమీద, రాజముద్రికల మీద చక్రవర్తి బొమ్మతోబాటు నూర్జహాన్ బొమ్మనుకూడా వేయించేవాడు. ఒక పర్యాయం బలాఢ్యమైన ఒక శత్రు రాజ్యం మీదికి నూర్జహాన్ స్వయంగా సైన్యాన్ని నడిపించింది.

భారతదేశపు సిరిసంపదలను గురించి యూరపు ఖండానికి చిలువలు పలువలుగా కథలు వ్యాపించాయి. ఇంగ్లండుకు, ఇంకా అనేక దేశాలకు భారత్‌తో వ్యాపారం చేయాలని

కోరిక పుట్టింది. అక్బరు చక్రవర్తి భారత్‌ను పరిపాలిస్తున్న కాలంలో, ఇంగ్లాండులో ఎలిజబెత్ రాణి ఏలికగా ఉండేది. ఎలిజబెత్ రాణి హాయంలోనే ఈస్టిండియా కంపెనీ అనే వ్యాపార సంస్థకు మన దేశంతో వ్యాపారం చేయడానికి అనుమతి ఇవ్వడం జరిగింది. అంతకు ముందుగానే పోర్చుగీసు వర్తకులు మనదేశపు కోస్తాలో కొన్నిచోట్ల స్థిరపడి నివాసాలు ఏర్పాటు చేసుకున్నారు. ఇంగ్లీషువారు భారత దేశానికి వస్తే తమకు పోటీ వస్తుందనే ఉద్దేశ్యంతో వారిని రాకుండా చేయాలని పోర్చుగీసు వారు చూసేవారు. ఇంగ్లండు నుంచి కొందరు దూతలు భారత్‌కు వచ్చి చక్రవర్తిని కలుసుకొని, ఈస్టిండియా కంపెనీకి చెందిన వర్తకులకు వాణిజ్య సౌకర్యాలు కల్పించమని చక్రవర్తిని వేడుకున్నారు. ఇంగ్లండు నుంచి వచ్చిన ఆ రాయబారులలో కెప్టెన్ హాకిన్స్ ఒకరుకాగా సర్ థామస్‌రో మరొకరు. వారు చక్రవర్తితో ఎంతో వినయంగా వ్యవహరించారు. ఎన్నో బహుమతులు సమర్పించుకున్నారు. దర్బారులో కలకలం చెలరేగింది. చాలామంది మొగలాయీ ఉన్నతులు అంతకుమందు ఆంగ్లేయుని చూసివారు కాదు. ఆంగ్లేయుల దుస్తులు, టోపీలు మొగలాయీ బేగంలకు వింత కలిగించాయి. వాటిని చూసివారు అబ్బురపడ్డారు.

చక్రవర్తి దర్శనార్థం కెప్టెన్ హాకిన్స్ మొగలు దర్బారుకు వచ్చిన రోజున జహంగీర్ కుమార్తె సుస్తీ చేసి మంచంలో ఉందట. కెప్టెన్ హాకిన్స్‌కు వైద్యం కొంత తెలిసి ఉండటం వల్ల ఆమెకు చికిత్స చేస్తానంటూ ముందుకు వచ్చాడు. దైవవశాన అతనిచ్చిన మందు పనిచేసి రాకుమారికి జబ్బు నయమైంది. దానికి చక్రవర్తి సంతోషించి హాకిన్స్‌ను పిలిపించి ఏవరం కావాలో కోరుకోమన్నాడట. అందుకు హాకిన్స్ ''అయ్యా నాకై ఏమీ అక్కరలేదు, మీ దేశంతో వ్యాపారం చేయడానికి మా దేశస్థులకు సౌకర్యాలు కలిగించవలసిందని మాత్రమే మా వేడికోలు'' అని మనవి చేశాడట. అడిగినదే తడవుగా జహంగీరు అందుకు అంగీకరించాడు. పైకి అల్పమైనదిగా కనుపించిన ఈ కోరిక దేశానికి ముందు ముందు ఎంత ముప్పు తెచ్చిపెట్టనున్నదో జహంగీరు ఊహించలేకపోయాడు.

జహంగీరు గొప్ప సౌందర్యోపాసకుడు. కాశ్మీరులోని ప్రకృతి రామణీయకతకు ముగ్ధుడై తరచు అక్కడికి వినోద యాత్రలు చేసేవాడు. ఒకసారి కాశ్మీరు లోయలో కాలక్షేపం చేసి రాజధానికి తిరిగి వస్తూఉండగా తోవలో లాహోరు వద్ద ఆయన మరణించాడు. రావీనదీ తీరాన జహంగీరును సమాధి చేశారు. ఆయన తదనంతరం షాజహాన్ చక్రవర్తి అయ్యాడు.

## షాజహాన్

తాజ్‌మహల్ నిర్మాత షాజహాన్ పేరు ప్రపంచంలో వినని వారంటూ ఉండరు. ఢిల్లీలో ఎర్రకోట, జమ్మా మసీదు వంటి అనేక చక్కని కట్టడాలను కట్టించింది కూడా ఆయనే. ప్రపంచంలో ఉన్న పెద్ద మసీదులలో జమ్మా మసీదు ఒకటి.

రాణి ముంతాజ్ మహల్‌ను చక్రవర్తి షాజహాన్ గాఢంగా ప్రేమించేవాడు. వారికి అనేక మంది సంతానం. ఇరువురూ ఒద్దికగా అనురాగంతో ఉండేవారు. కొంతకాలం జరిగిన తరువాత ముంతాజ్ మహల్‌కు జబ్బుచేసి కన్నుమూసింది. తన ప్రేయసికి స్మృతి చిహ్నంగా ప్రపంచంలో ఎవ్వరూ కనివిని ఎరుగనట్టి అద్భుతమైన సమాధిని నిర్మిస్తానని షాజహాన్ ప్రతిజ్ఞ పూనాడు. దేశంలో ఉన్న ఉత్తమ వాస్తుశాస్త్రజ్ఞులను, కళాకారులను పిలిపించి సమాధి నిర్మాణం మొదలు పెట్టించాడు. ఈ సమాధి పేరే తాజ్‌మహల్. దీనిని కట్టడానికి 20 ఏళ్లు పైచిలుకు పట్టింది. ప్రపంచంలోని మహాద్భుతాలలో ఒకటిగా తాజ్‌మహల్‌కు పేరు వచ్చింది. ప్రపంచం మొత్తంలోనే ఇంతటి మనోజ్ఞమైన స్మారక చిహ్నం మరొకటి లేదు.



తాజ్‌మహల్ నిర్మాణానికి ఇరవై ఏళ్ళకుపైగా పట్టింది

షాజహాన్ దర్బారుకు దేశం నలుమూలలనుండి గొప్ప కవులు, చిత్రకారులు వచ్చేవారు. చక్రవర్తి వారికి విలువైన కానుకలు సమర్పించేవాడు. ప్రపంచంలో ఏ చక్రవర్తికీ లేని అపూర్వ రమణీయమైన సింహాసనాన్ని తనకోసం తయారు చేయవలసిందని షాజహాన్ పురమాయించాడు. వెంటనే స్వర్ణకారులు, శిల్పులు పని ప్రారంభించారు. ఏడేళ్లు అహోరాత్రాలు కృషి చేసి కోటిరూపాయల ఖర్చుతో చక్కని మయూర సింహాసనం నిర్మించారు. కళ్లు జిగేలుమనే పలురకాల వజ్రవైఢూర్యాలతో పొదిగిన రెండు పెద్ద నెమలి విగ్రహాలు ఈ సింహాసన మేలికట్టుపై రూపొందించబడ్డాయి.

చక్రవర్తి ప్రాసాదంలో భోగవైభవాలను గురించి దేశవిదేశాలలో ఆశ్చర్యంగా చెప్పుకొనేవారు. పచ్చలు పరచిన అక్కడి పాలరాతి మందిరాలను, మొగలు ఉద్యోగుల ముచ్చటైన దుస్తులను, దర్బారులో జరిగే వేడుకలను, చూడడానికి ఐరోపా దేశాలనుంచి కూడా వినోద యాత్రికులు పనిగట్టుకొనివచ్చేవారు. ఈ రాజభోగాలకు మంచినీళ్ల ప్రాయంగా ధనం ఖర్చయేది. అయితే మాత్రమేం, షాజహానుకు లెక్కలేనంత ఐశ్వర్యం ఉంది. చక్రవర్తి ఖజనాలు తరగని పాతరలు. మొగలు సామ్రాజ్యం షాజహాను కాలంలో విస్తరించి ఉన్నంతగా అదివరకెన్నడూ లేదు.

ఈ వేడుకలకు, వైభవాలకు కావలసిన ధనమంతా రాజ్యంలో పేదరైతులు రొండిని దాచుకున్న ముడుపునుంచే వచ్చేది. చక్రవర్తి భోగలాలసతను తీర్చడానికి సుంకాలమీద సుంకాలు కడుతూ, అది తమతలకు మించిన బరువు కాగా రైతులు నిరుపేదలై నానాటికీ కుంగి కృశించిపోసాగారు. యుగయుగాలనుంచీ భారతదేశానికి రైతాంగమే పెట్టని కోట. ఎప్పుడైతే రైతు బక్క చిక్కుతాడో అప్పుడు ఇక దేశానికికేదో కీడు మూడబోతున్నదని ఊహించవచ్చు. షాజహాను కాలంలోను సరిగ్గా ఇలాగే జరిగింది.

షాజహాను తన జీవితంలో చివర చివరకు తీవ్రమైన యాతనలు పడవలసివచ్చింది. మునలితనంలో చావుకెదురుచూస్తూ మంచంపట్టి ఉన్న సమయంలో, కొడుకులు నలుగురూ వారసత్వం కోసం ఒకరితొకరు తగవులాడుకోవడం మొదలుపెట్టారు. షాజహానుకు ఎక్కువగా ప్రేమపాత్రుడైన దారాషికో అతని పుత్రులలో జ్యేష్ఠుడు. అతడు పెద్ద గ్రంథాలయాన్ని నిర్మించుకొని పుస్తకపఠనంలో ఎప్పుడూ పొద్దుపుచ్చేవాడు. ద్వితీయుడు పరాక్రమశాలీ, మేధావంతుడు అయినప్పటికీ, సంశయాత్ముడై ఏ విషయంలోగాని త్వరలో

గట్టి నిశ్చయానికి రాలేకపోయేవాడు. నాల్గవవానికి వినోదవ్యాపకాలలో మునిగితేలుతూ ఉండడం వల్ల, మరి దేనికీ తీరిక లేకపోయేది. ఈ పరిస్థితిలో తృతీయుడైన ఔరంగజేబుదే పైచేయి అయింది.

ఒక్కరొక్కరుగా అన్నదమ్ములందరిని ఓడించి, వృద్ధుడైన తండ్రిని కారాగారంలో బంధించి ఔరంగజేబు పట్టాభిషేకం చేయించుకున్నాడు. అప్పటికి అతని వయస్సు నలబై. ఆ తరువాత ఎనిమిది ఏళ్లకు షాజహాన్ మరణించాడు.

## ఔరంగజేబు

మొగలు చక్రవర్తులు, వారి దర్బారులలోని సామంతులు భోగలాలన జీవితం గడుపుతూ ఉండటంవల్ల, సామాన్య ప్రజలపై పన్నుల భారం అంతకంతకూ పెరిగి వారు ఏవిధంగా దుస్థితి పాలయిందీ లోగడ తెలుసుకున్నాము. పేదరైతులు పూర్తిగా కుంగిపోయి గ్రామాలను విడిచిపెట్టి పనులకోసం పట్టణాలకు ఎగబడసాగారు. ఇటు వర్తకుల స్థితి కూడా అంతంత మాత్రంగానే ఉండేది. సుంకాలు వసూలుచేసే సర్కారు ఉద్యోగులు రాత్రనక పగలనక నడివీధిలో, బజార్లలో, బల్లకట్లమీద వర్తకులను వెన్నాడుతూ ఉండేవారు. ప్రజల జీవితం పూర్తిగా దుఃఖభాజనమైపోయింది. చివరికి ఉద్యోగులను ఎదిరించి తిరగబడటం కూడ మొదలుపెట్టారు. పన్నులు ఎగవేసి మొండికెత్తిన ఢిల్లీ, ఆగ్రా ప్రాంతపు జాట్ రైతాంగాన్ని దారికి తేవడం ఔరంగజేబు ఉద్యోగులకు శక్యం కాకపోయింది. సుదూరాన వాయవ్య ప్రాంతంలో నివసిస్తున్న పఠాన్ జాతివారు కాబూలుకు సరకులతో వెళ్లే వర్తకులను సార్థవాహులను అటకాయించి దోచుకోవడం సాగించారు. ఈ కొండజాతి ప్రాంతాలలో తిరిగి శాంతిని నెలకొల్పడానికి ఔరంగజేబు సైన్యాలు పఠానులతో 12 ఏళ్ల హోరాహోరీగా పోరాటం జరుపవలసి వచ్చింది.

## రాజపుత్రులు

అనేకమంది రాజపుత్ర సామంతులు కూడా మొగలుల ఆధిపత్యం నుంచి తప్పించుకొని స్వతంత్రులు కావాలని చూశారు. వారిని అణచి అణకువుగా ఉండేట్లు చేసుకోవడానికి ఔరంగజేబు కఠినమైన దండనీతిని ప్రయోగించాడు. ముత్తాత అక్బరువలె ఔరంగజేబు కూడా వారి ఎడ నఖ్యత చూపుతూ సామంగా ప్రవర్తించి ఉన్నట్లయితే మొగలు సామ్రాజ్యానికి

ఎంతో మేలు కలిగి ఉండేది. రాజపుత్రయోధుడు, మార్వార్ అధిపతి అయిన రాజా జస్వంత్‌సింగ్ ఔరంగజేబు సైన్యంలో సేనానాయకుడు. పఠానులను లొంగదీయడానికి పశ్చిమోత్తర సరిహద్దు ప్రాంతానికి పంపబడిన ఈ సేనాని అక్కడ మరణించినట్లు వినగానే ఔరంగజేబు తన సిబ్బందిని మార్వారుకు పంపి ఆయన రాజ్యాన్ని కైవసం చేసుకున్నాడు. జస్వంత్ సింగ్ భార్యను, అతని పసిపాపణ్ణి ఢిల్లీకి తెప్పించి రాజప్రాసాదంలో ఉంచాడు. పెరిగి పెద్దవాడైన తరువాత యువరాజు తండ్రి రాజ్యాన్ని తిరిగి ఇచ్చివేయమని అడగకుండా అతనిని కట్టడిచేద్దామని ఔరంగజేబు ఎత్తువేశాడు. రాజపుత్రులు ఈ కుతంత్రం గ్రహించి మండిపడ్డారు. జస్వంత్‌సింగ్ బతికి ఉండగా అతనిని నీడవలె అంటి పెట్టుకుని ఉన్న నమ్మకమైన బలగం కొంత ఉంది. వీరు ఒకరాత్రిపూట రహస్యంగా రాజప్రాసాదంలో చొరబడి యువరాజును అతని తల్లిని వెంట తీసుకొని కోటదాటారు. ద్వారం వద్ద కాపాల కాస్తున్న సైనికులు పరధ్యానంగా ఉన్నారు. అయితే సిపాయీలు అంతలో తేరుకొని పారిపోతున్న వారిని అటకాయించడానికి ప్రయత్నించారు. కానీ లాభం లేకపోయింది. రాజపుత్రవీరులు అద్భుతమైన కత్తిసాముతో వారికి దిక్కు తోచకుండాచేసి సైనికుల మధ్యగా దారి చేసుకుని మెరుపులా దూసుకుపోయారు. రాజపుత్రులు తమ తనువులలో శక్తి ఉన్నంత వరకూ మొగలు సైన్యాలను ప్రతిఘటిస్తూనే వచ్చారు. కానైతే వారు కూడా చివరకు లొంగిపోకతప్పలేదు.

మొగలు ప్రభుత్వాన్ని తీవ్రంగా ద్వేషించే ప్రజలు కొందరు ఆ కాలంలోనే ఔత్తరాహాన కూడా ఉండేవారు. వీరు సిక్కు మతస్థులు. వీరి గురువైన తేగ్‌బహదూర్‌ను పాదాక్రాంతం చేసుకోవాలని ఎన్నోసార్లు ప్రయత్నించి విఫలుడై చివరికి ఔరంగజేబు అతనిని హత్యచేయించాడు. ఢిల్లీలో అతను వధించబడిన స్థలంలోనే ఒకపెద్ద సిక్కు దేవాలయం వెలసింది. ఔరంగజేబు దారుణకృత్యానికి సిక్కులు క్రోధవరవశులైనారు. గురు తేగ్ బహదూర్ కుమారుడు గురుగోవిందసింగ్ అప్పటికి 12 ఏళ్ల కుర్రవాడు. తండ్రి హత్యకు ఎప్పటికైనా ప్రతీకారం చేసి తీరుతానని ఆ బాలుడు ప్రతిజ్ఞ పట్టాడు. అనేక సంవత్సరాలు మొగలులతో ఎడతెగకుండా పోరాటాలు సాగించాడు. ఈ యుద్ధాలలో గురుగోవింద్ సింగ్ కుమారులిద్దరు హతులైనారు. వీరుకాక 8 ఏళ్లు, 9 ఏళ్ల వయస్సులో ఉన్న అతని పిల్లలను మరో ఇద్దరిని మొగలు సైనికులు బందీ చేసి నిర్దాక్షిణ్యంగా వధించారు.

## మరాఠాలు

దక్కనులో మరాఠాల బలం క్రమంగా పెరుగుతూ వచ్చింది. ఛత్రపతి శివాజీయే

ఇందుకు దోహదం చేసిన వ్యక్తి. శివాజీ చరిత్రను కూడా మీరీ పుస్తకంలో ముందు చదువుతారు. మరాఠాలను లొంగదీసుకోవాలని రమారమి 20 ఏళ్లు ఔరంగజేబు వారితో పోరు సాగించాడు.

పడమటి కనుమల వెంట ఉన్న పర్వత ప్రాంతాలు మరాఠాల నివాస భూమి. ఆ పీఠ భూమిలో వారికి దుర్భేద్యమైన పెక్కు దుర్గాలుండేవి. మరాఠాలు నిపుణులైన అశ్వికులేకాక ప్రయాణకు, ప్రవాసానికి అలవాటుపడి క్లిష్టమైన పరిస్థితులలో జీవితం గడుప నేర్చినవారు. ఏనుగులు, లొట్టిపిట్టలలతో, పదాతిదళాలతో కూడిన మొగలు సేనావాహినులు నత్తనడకతో మందయానం చేసేవి. కాని మరాఠా అశ్వికులు ఆకాశంలోనుంచి ఊడిపడ్డట్టు హఠాత్తుగా ప్రత్యక్షమై మెరుపు తీగెలా మొగలు సైన్యాలలోకి దూసుకుంటూవెళ్ళి వారిని చీల్చి చెండాడి అంతలోనే మటుమాయమయేవారు.

దక్కనులో సాగించిన దీర్ఘయుద్ధాలతో ఔరంగజేబు ఖజనాలు ఖాళీ అయిపోయాయి. అప్పుడు సామాన్య ప్రజలను ఇంకా పిండి మరిన్ని పన్నులు వసూలు చేయడం మొదలుపెట్టాడు. చక్రవర్తి లేనప్పుడు ఉద్యోగులు తమ విధులను బొత్తిగా ఉపేక్షించి, ప్రజలను ఏక తీరుగా హింసపెడుతూ వారివద్ద డబ్బు గుంజుతూ ఉండేవారు. రహదారిన వెళ్లే ప్రయాణీకులను దొంగలు పట్టపగలే అటకాయించి నిలువుదోపిళ్ళు చేసేవారు. బందిపోటు ముఠాలను అరికట్టడానికి పైవారు ఎవ్వరూ చిటికెన వ్రేలు కూడా కదపకపోవడంతో, చివరికి రాజామార్గాలలో ప్రయాణించడం కూడా ప్రాణభీతిగా తయారైంది.

ఔరంగజేబు తీవ్రమైన ప్రవృత్తి కలవాడు. చక్రవర్తియైన కొద్ది సంవత్సరాలకే తన దర్బారులో సంగీతం వినిపించరాదని నిషేధించాడు. తన తండ్రి, తాతలు ఛేరదీసిన కవులను, కళాకారులను, చరిత్రకారులను ఒక్కొక్కరినే తరిమివేశాడు. ఔరంగజేబు అతి నిరాడంబరంగా జీవించేవాడు. దిగంత పరిక్రాంతమైన సామ్రాజ్యానికి ఏకచ్ఛత్రాధిపతి అయికూడా, స్వహస్తంతో కురాన్ ప్రతులు వ్రాస్తూ, టోపీలు కుడుతూ, వాటిని అమ్మకోగా వచ్చిన డబ్బుతో జీవిక సాగించేవాడు. అతడు నిష్ఠాగరిష్ఠుడైన మహమ్మదీయుడు. ఇస్లాంమతం ఒక్కటే పరమమైన మతమని, ఆ మతాన్ని అనుసరిస్తేనే తప్ప అన్యథా మానవులకు ఉన్నతి కలగదని అతని దృఢ విశ్వాసం. ఔరంగజేబు అనేక హిందూ దేవాలయాలను నేలమట్టం చేయించాడు. హిందూ వర్తకులపై మితిమీరిన పన్నులు వేసి తలకు మించిన బరువుమోపాడు. ముస్లింలు కానివారందరిమీద మళ్ళీ జిజియా పన్ను విధించాడు. దీనితో దేశంలో హిందువులందరికీ

విరోధి అయ్యాడు. మొగలు సామ్రాజ్యం ఉన్నట్లుండి ఒకనాడు నట్టేట మునిగినా, హిందువులు అందుకు చీమకుట్టినంతగా అయినా పట్టించుకోని స్థితి ఏర్పడింది. పోనీ అట్లా అని ముస్లింలకైనా చక్రవర్తిపట్ల భక్తి ప్రపత్తులు ఉన్నాయా అంటే అదీ కనిపించలేదు. కారణం, చక్రవర్తి వారిలోవారికి చీలికలు పెట్టి ఒకరిపై ఒకరిని రెచ్చగొడుతూ వచ్చాడు. 88 ఏళ్ళ పండు వయస్సులో ఔరంగజేబు కన్ను మూసేనాటికి, తన ముత్తాతగారైన అక్బరు దేశానికి చేసి ఉన్న మంచినంతటినీ పూర్తిగా తుడిచిపెట్టివేశాడు.

# మొగలు సామ్రాజ్య పతనం

శాఖోపశాఖలుగా విస్తరిల్లి పైకి ఎంతో బలిష్ఠంగా కనిపించే మహావృక్షం సైతం వేరుకు పురుగుపట్టి కొట్టివేసినట్లయితే, రేపో మాపో ఫెళఫెళ విరిగి నేలకొరిగిపోకతప్పదు. ఇదేమాట రాజ్యాలకూడా అన్వయిస్తుంది. రాజ్యానికి పునాదిగా ఉన్న సామాన్యప్రజ అల్లాడిపోతూంటే, ఆ రాజ్యం చూడడానికి ఎంత బలిష్ఠమైనదిగా కనిపించినా అనతికాలానికే పతనం చెందక తప్పదు. ఔరంగజేబు కాలంలో మొగలు సామ్రాజ్యం సరిగా ఇలాంటి స్థితికే వచ్చింది. ఔరంగజేబు చేయరాని పనులుచేసి అటు హిందువులతోను, ఇటు సిక్కులతోను కూడా బద్ధవైరం తెచ్చుకున్నాడు.

ఔరంగజేబు తదనంతరం 50 ఏళ్ళపాటు ఎడతెగకుండా యుద్ధాలు, అలజళ్ళు దేశవ్యాపితంగా కొనసాగాయి. ఔరంగజేబు వారసులలో చాలామంది అసమర్థులు. వినోద విలాసాలు తప్పవారికి మరో ధ్యాస లేదు. ఇట్టి రాజులలో ఒకడు మహమ్మదు షా. నర్తకీ గాయకులతో పరివేష్ఠితుడై, మదిరాపానలోలుడై వినోదవిలాసాలలో మునిగితేలుతూ ఉండేవాడు. అందుకే అతనికి 'రంగీలే' (విలాసపురుషుడు) అని పేరు వచ్చింది. ఆయన సామంతులలో ఒకడైన అసఫ్‌జా, మహమ్మదు షాను మంచి మార్గంలో పెట్టాలని చాలా ప్రయత్నించాడు. కాని ఆయన ప్రయత్నాలన్నీ బూడిదలో పోసిన పన్నీరు అయ్యాయి. చివరికి అతడు విసిగిపోయి ఢిల్లీ వదలిపెట్టి హైదరాబాద్‌కు తరలిపోయాడు. అసఫ్‌జా అక్కడ స్వతంత్ర ప్రభుత్వం ఏర్పాటు చేసుకొని మొగలు రాజుకు తాను ఇదివరకువలె సామంతుడుగా కాక స్వతంత్రుణ్ణి అని ప్రకటించుకున్నాడు. హైదరాబాద్ సంస్థానాన్ని మొన్న మొన్నటిదాకా పరిపాలించిన నిజాంలు ఈ అసఫ్‌జా వంశీయులే.

హైదరాబాద్‌లో అసఫ్‌జా స్వతంత్ర రాజ్యాన్ని ఏర్పాటు చేసుకున్న కొద్ది కాలానికే, బెంగాలులో ఉన్న రాజప్రతినిధి కూడా అసఫ్‌జాను అనుసరించి మొగలురాజును తాను సార్వభౌముడుగా గుర్తించడంలేదని ప్రకటించాడు. ఔధ్‌లోనూ ఇదే జరిగింది. ఒకప్పుడు ఇంచుమించు దేశపరివ్యాప్తంగా విస్తరించి ఉన్న మొగలు సామ్రాజ్యం క్రమంగా కృశించి

చివరికి ఢిల్లీ చుట్టూ ఉన్న పరిసర ప్రాంతాలకు పరిమితమైపోయింది. మొగలు చక్రవర్తులు కిరీటాలను ధరిస్తూ, తమ పేరిట టంకసాలలో ఇంకా నాణెములు ముద్రిస్తున్నప్పటికీ, వారి అసలు స్థితి పేరు గొప్ప ఊరు దిబ్బ అన్న సామెతగా తయారైంది.

## నాదిర్‌షా

ఇదే సమయంలో పర్షియానుంచి గొప్ప యోధవర్యుడైన నాదిర్‌షా భారత్ మీద దండెత్తి వచ్చాడు. కాబూలుగుండా వచ్చి పెషావరు, లాహోర్‌ల మీదుగా జైత్రయాత్ర చేసి నాదిర్‌షా ఢిల్లీ పురవీధులలో అడుగుపెట్టాడు. రాజధానిలో ప్రవేశించిన కొద్దిరోజుల తర్వాత తన సైనికులలో కొందరు నడివీధిలో ఎవరి చేతనో చంపివేయబడినట్లు నాదిర్‌షా విన్నాడు. ఇది వినగానే అతనికి శివమెక్కినట్లయిది. నగరంలో తమకు కనిపించిన వారినందిరినీ హతమార్చి చేతికి చిక్కినదల్లా దోచుకోవలసిందని నాదిర్‌షా సైనికులకు ఫర్మానా చేశాడు. వెంటనే చాందినీ చౌక్‌లోని రమ్య హర్మ్యాలన్నిటినీ సైనికులు భస్మీపటలం చేశారు. మొగలు సామ్రాజ్యపు సంపదలో హరించిపోగా మిగిలినది యావత్తూ పట్టించుకొని నాదిర్‌షా స్వదేశానికి తిరిగి వెళ్ళాడు. లెక్కలేనన్ని ఏనుగులు, గుర్రాలు, బారువలకొద్దీ బంగారం, వెలలేని నగలు, దుస్తులు కొల్లగొట్టి పట్టుకుపోయాడు. ప్రపంచ ప్రసిద్ధమైన కోహినూర్ వజ్రాన్ని, మాణిక్యాలు పొదిగిన మొగలు చక్రవర్తుల మయూర సింహాసనాన్ని కూడా ఎత్తుకొనిపోయాడు. నాదిర్‌షా దండయాత్రతో మొగలు సామ్రాజ్యానికి మళ్ళీ ఎన్నటికీ కోలుకోలేని మర్మఘాతం తగిలింది. మొగలు సామ్రాజ్యానికి ఈ దండయాత్ర భరతగీతమైంది.

# మరాఠాలు

ఔరంగజేబు రాజ్యంచేసిన కాలంలో దాదాపు సగం మరాఠాలతో యుద్ధాలు చేయడంలోనే గడచిపోయింది. మరాఠాలు తనకు పక్కలో బల్లెమువంటి వారని, వారిమీద నమ్మికతో ఆదమరచి ఉండడం ప్రమాదకరమని అతను భావించాడు. ఇతరుల చెప్పుచేతులలో ఉండడానికి సుతరామూ ఇష్టపడని మహారాష్ట్రులకు, హిందువులపట్ల ఔరంగజేబు ప్రవర్తన చూసి అతని మీద మరింతగా తీవ్రమైన ద్వేషం కలిగింది. మొగలు సామ్రాజ్యం ముక్కలైపోతున్న రోజులలో, మరాఠా ఆశ్వికులు యావత్తు ఉత్తరదేశాన్ని జయించారు. తూర్పున బెంగాలుదాకా ఉత్తరాన ఢిల్లీవరకు, అటు పంజాబులోకికూడా వడివడిగా వ్యాపించారు. దేశంలో బ్రిటిష్‌వారి ప్రాబల్యం విస్తరించేదాకా, సుమారు 100 సంవత్సరాల పైచిలుకు మరాఠాలు అవక్ర పరాక్రమంతో విజృంభించారు.

అయితే మహారాష్ట్రులు ఇంతటి శక్తిసంపన్నులు ఎలా కాగలిగారు? ఇది చాలా చక్కని కథ. భక్తి ఉద్యమం గురించి, కబీర్, నానక్‌లను గురించి ఇదివరకు చదివి ఉన్నారు. మహారాష్ట్రలో అవతరించిన భక్తాగ్రేసరులు మరాఠా ప్రజలను కూడగట్టి వారిని ఎంతో శక్తిమంతులుగా రూపొందించారు.

## జ్ఞానేశ్వర్

ఇట్టి భక్తశ్రేణిలో జ్ఞానేశ్వర్ ఒకడు. సంస్కృతం చదువుకొన్నవారికే పవిత్రమైన హిందూమత గ్రంథాలను పారాయణ చేసే అధికారం ఉందని, దైవసన్నిధిలో అడుగుపెట్టడానికి తామే అర్హులమనీ అప్పటి బ్రాహ్మణులు విశ్వసించేవారు. ఇది జ్ఞానేశ్వర్‌కు కంటగింపుగా ఉండేది. ప్రజలు మాట్లాడే భాషలో అందరికీ సుబోధకంగా ఉండేట్టు ఆయన భగవద్గీతను అనువదించారు. దీనితో బ్రాహ్మణులు క్రుద్ధులయ్యారు. భగవద్గీత మైలపడిపోయిందని గోలపెట్టారు. జ్ఞానేశ్వర్‌ను గురించి మహారాష్ట్రలో విచిత్రమైన కథ ఒకటి ప్రచారంలో ఉంది. ఒకసారి ఆయన బ్రాహ్మణులకు బుద్ధి చెప్పాలని బర్రెచేత వేదాలు వల్లింపచేశాడట! దీనితో ఆ బ్రాహ్మణులకు వెంటనే కళ్లుతెరిపిళ్లు పడ్డాయి. బ్రాహ్మణేతరులు పఠించినంత మాత్రాన

పవిత్రమైన గ్రంథాలు మైలపడిపోతాయనుకోవడం ఎంత వెర్రితనమో వారికి దానివల్ల తెలిసివచ్చింది. నోరులేని జంతువుకూడా భగవన్నామస్మరణ చేయడం అద్భుతం కాదా!

## తుకారాం

మహారాష్ట్రలో అవతరించిన మరో మహర్షి తుకారాం. ఆయన రైతు కుటుంబంలో పుట్టాడు. శైశవదశలోనే గంటల తరబడి ఈశ్వరారాధనలో గడిపేవాడు. ఆయన ఉదారుడు. చేతికి ఎముకలేదు. అతడు ఎంత దయాశీలి అంటే జంతువులు, పక్షులు కూడా ఆయనచుట్టూ చేరి నిర్భయంగా ఆడుకొనేవట! కొద్దిగా వయసు వచ్చిన తరువాత తుకారాం ఐహిక ప్రపంచాన్ని విస్మరించి, పూర్తిగా ధ్యానమగ్నుడై పోయాడు. తనతో కలిసి ఇష్టదైవమైన విఠోబాను (పాండురంగని) సేవించడానికి తరలిరావలసిందని పీడితులు, తాడితులు అయిన పేదప్రజలను ప్రేమతో ఆయన ఆహ్వానించేవాడు. బ్రాహ్మణులకిది కంటగింపై తుకారాంను నానాహింసలూ పెట్టారు. ఒకసారి తుకారాంను ముళ్ళకంచెలమీదుగా బరబరా ఈడ్చుకుపోయారట. మరొక పర్యాయం ఆయనచేత తాను వ్రాసిన గీతాలన్నింటిని కట్టగట్టించి ఏట్లో పారేయించారు. కాని అనతికాలానికే తుకారాం గీతాలకు గొప్ప ప్రచారం వచ్చింది. చివరికి మహారాష్ట్రమంతటా ఏనోట విన్నా ఆయన గీతాలే వినబడసాగాయి. ఈ గీతాలకు ''అభంగాలు'' అని పేరు. ''అభంగం'' అంటే ''భంగించరానిది'' అని అర్థం.

## రామదాసు

రామదాసు కూడా భక్త తుకారాంకు సమకాలీనుడైన మరొక మహారాష్ట్ర భక్తశిఖామణి. 12 సంవత్సరాలు విధీవిరామంలేకుండా రామదాసు దేశమంతటా సంచారం చేశాడు. వెయ్యి సంవత్సరాల క్రిందట జన్మించిన శంకరాచార్యునివలెనే రామదాసు కూడా అనేక మఠాలు కట్టించాడు. హనుమంతునికి అంకితమైన దేవళాలు అనేకం వెలయించాడు. రామదాసు రామభక్తుడే అయినా ముఖ్యంగా హనుమంతుణ్ణి ఆరాధించేవాడు. కారణం, ఆదర్శభక్తుడు భగవంతుణ్ణి ఏవిధంగా సేవించాలో శ్రీరామచంద్రుణ్ణి హనుమంతుడు ఆ విధంగా సేవించి రామభక్తులకు ఆయన గొప్పవరవడి దిద్దాడు కదా! అదీగాక హనుమంతుడు అమేయమైన జవసత్వాలకు చిహ్నం. ఆ కాలపు పరిస్థితులలో మహారాష్ట్రానికి ముఖ్యంగా అవసరమైనవికూడా జవసత్వ సంపదలే.

రామదాసు మరో 12 సంవత్సరాలు కీర్తనలతో, ఈశ్వరధ్యానంలో గడిపాడు. అతని

అతని వివేక విజ్ఞానాలు ఎంతో ప్రశస్తికెక్కాయి. ఆయన వ్రాసిన భజన కీర్తనలను మహారాష్ట్రమంతటా భక్తులు నేటికీ పాడుకుంటూ ఉంటారు.

రామదాసు గురించి చమత్కారమైన ఒక కథ ఉంది. ఒక శుభముహూర్తాన పెద్దలు అతనికి పెళ్ళి చేయాలని నిశ్చయించారట. వివాహమంటపంలో పురోహితులు మంత్రాలు చదువుతూండగా పెళ్ళి పీటలమీద ఉన్న రామదాసు ఉలిక్కిపడిలేచి వీధిలోకి పారిపోయాడట! పురోహితులు చదువుతున్న మంత్రాలలో ఒకచోట ''సావధానం'' అన్న ముక్క అలవోకగా ఉన్న రామదాసు చెవిన పడింది. ఆ మాట వినగానే రామదాసును వీపు చరిచి ఎవరో హెచ్చరించినట్లయిందని, దానితో ఆయనలో దైవభక్తి హఠాత్తుగా జాగరితమైందని ఐతిహ్యముంది.

జ్ఞానేశ్వరుడు, తుకారాం, రామదాసు మొదలైన భక్తులు కొన్నివందల ఏళ్ళుగా గాఢనిద్రలో మునిగి ఉన్న మహారాష్ట్రానికి మేలుకొలుపులు పాడారు. ఆ విధంగా జాగరితులైన మేటి మహారాష్ట్ర ప్రజకు అప్పుడిక కావలసిందల్లా ఒక గొప్ప నాయకుడు. అట్టి నాయకుడుగా మరాఠాలకు శివాజీ వెంటనే సాక్షాత్కరించాడు.

# ఛత్రపతి శివాజీ



*శివాజీ గొప్ప పాలకుడు*

షాజహానుకు పట్టాభిషేకం జరిగిన సంవత్సరంలోనే ఢిల్లీకి చాలాదూరంగా పడమటి కనుమలలో ఉన్న ఒక కోటలో ఒక శిశువు జన్మించాడు. ఈ బాలుడు పెరిగి పెద్దవాడైన తరువాత మొగలు సామ్రాజ్యాన్ని గడగడలాడించే మహావీరుడౌతాడని, భరతమాత పుత్రరత్నాలలో అగ్రగణ్యుడు కాగలడని, అప్పుడెవరూ ఊహించి ఉండరు. నాడు ఉదయించిన ఆ బాలుడే శివాజీ.

శివాజీ తండ్రి బీజపూర్ సుల్తాను కొలువులో సైనికాధికారిగా ఉండేవాడు. ఉద్యోగరీత్యా అతను తరచూ ఇంటికి దూరంగా ఉండవలసివచ్చేది. అందువల్ల పూర్తిగా తల్లిచాటు బిడ్డగానే శివాజీ పెరగవలసివచ్చింది. తల్లి జీజాబాయికి కొడుకుమీద అంతులేని మమకారం. గొప్ప ధైర్యశాలి, దైవభక్తురాలు అయిన జీజాబాయి శివాజీకి ధైర్య సాహసాలను ఉగ్గుతో పోసింది. పరాక్రమవంతులైన పాండుపుత్రుల కథలను, పుణ్యపురుషుడైన శ్రీరామచంద్రుని చరితాన్ని తరుచుగా వినిపిస్తూ ఉండేది. భారతదేశంలో అవతరించిన పురాణ పురుషులు, వారు సాధించిన మహత్కార్యాలను గురించిన గేయాలు, పాటలు పాడుతూ శివాజీకి వీరరసాన్ని వెన్నతో పెట్టింది. పెద్దవాడైన తరువాత తాను కూడా ఆ మహాపురుషులవలె ఘనకార్యాలు చేయాలని శివాజీ చిన్నతనంనుంచే కలలు కనేవాడు.

కొండలలో, గుట్టలలో ఉల్లాసంగా గంతులువేస్తూ కోతి కొమ్మచ్చులు ఆడుకునే గొల్లల కాపరులే శివాజీకి బాల్య స్నేహితులు. వారితో కలిసి గుఱ్ఱపు స్వారీలు చేయడం అతనికి సరదా. కొద్ది కాలానికే శివాజీ ఎంతటి మొరటు గుఱ్ఱాన్నైనా మచ్చిక చేసుకొని దట్టమైన

అడవులగుండా చాలా దూరం స్వారీచేసి దారితప్పకుండా ఇంటికి తిరిగి రాగలిగేవాడు. దీనికి తోడు గురితప్పకుండా తుపాకీ కాల్చడంలోకూడా శివాజీ నేర్పరి అయ్యాడు. కొంతకాలం అయేసరికి ఆ చుట్టు పట్ల యువకులు అనేకమంది దరిజేరి అతణ్ణి నాయకుడుగా చేసుకున్నారు.

20 సంవత్సరాల ప్రాయంలో ఉన్నప్పుడే శివాజీ బీజపూర్ సుల్తాన్ ఇలాకాలో ఉన్న కొన్ని కోటలపై దాడిచేసి వాటిని పట్టుకోగలిగాడు. ఈ వార్త విన్న వెంటనే సుల్తాను శివాజీ తండ్రిని బందిఖానాలో పెట్టించి అతని కుమారుని ప్రవర్తనకు సంజాయిషీ అడిగాడు. పాపం ఆ తండ్రి ఇందులో తాను చేయగలిగింది లేదని, తన కుమారుణ్ణి అదుపులో పెట్టటం తనవల్ల రాదని సవినయంగా సుల్తానుకు విన్నవించుకున్నాడు.

ఇంత జరిగిన తరువాత కూడా శివాజీ తన పద్ధతి మార్చుకోలేదు. బీజపూర్ సుల్తాన్ జమీలపై అదను దొరికినప్పుడల్లా దాడులు సాగిస్తూ అతని సైన్యాన్ని ముప్పతిప్పలు పెడుతూ ఉండేవాడు. చివరికి సుల్తాన్‌కది దుస్సహమైపోయింది. శివాజీకి శాస్తిచేయడానికి పెద్ద సైన్యంతో అఫ్జల్‌ఖాన్ అనే సేనానిని పంపాడు. ఎక్కిన గుఱ్ఱం దిగకుండానే శివాజీని గొలుసులతోకట్టి బందీగా తెస్తానని బయలుదేరేముందు అఫ్జల్‌ఖాన్ డంబాలు పలికాడు. కాని తీరా జరిగింది వేరొకటైంది. అఫ్జల్‌ఖాన్ సైన్యం సమీపిస్తున్నట్టు తెలియగానే శివాజీ తన సైనికులతో ప్రతాప్‌ఘడ్ అనే దుర్భేద్యమైన కొండ కోటవద్ద పర్వతాలలోకి తరలిపోయాడు. శివాజీ కొండలు దిగివస్తాడేమోనని అఫ్జల్‌ఖాన్ వారాల తరబడి దిగువన ఉన్న మైదానాలలో వేచి ఉన్నాడు. కానీ శివాజీ ఎంతకూ దిగిరాకపోయేసరికి అతనికి విసుగెత్తి శివాజీకి సందేశం పంపాడు. శతృత్వం మరచిపోయి తాము ఇద్దరూ మిత్రులవలె కలుసుకోవాలని, యుద్ధానికి దిగకుండా చర్చలద్వారానే వ్యవహారం తేల్చుకోవాలని అతని సందేశంలోని ముఖ్యాంశం. శివాజీ అందుకు సరే అన్నాడు. ఇద్దరూ కలుసుకున్నారు. కాని వారు ఆ కలుసుకోవడం మిత్రులవలె కలుసుకోలేదు. సమావేశానికి వెళ్ళే ముందు అఫ్జల్‌ఖాన్ పెద్ద అంగరఖా తొడుగుకొని అందులో పదునైన బాకు ఒకటు కనపడకుండా దాచిపెట్టాడు. పైకి మిత్రునివలె నటిస్తూనే శివాజీని సమీపించాడు. అయితే దూరదృష్టిగల శివాజీ కూడా పైకి కనిపించకుండా పాగాలో తలకు ఉక్కుటోపీ పెట్టుకొని, వంటికి గట్టికవచం తొడుక్కున్నాడు. చేతులతు పులిపంజాలు పెట్టుకున్నాడు. ఉభయులూ కలుసుకొన్న వెంటనే ఆదరంతో ఒకరినొకరు ఆలింగనం చేసుకొంటున్నట్లుగా చూపరులకు తోచింది. కాని అంతలోనే వారి ఆలింగనం బాహాబాహి యుద్ధంగా మారిపోయింది. ఈ ద్వంద్వ యుద్ధంలో అఫ్జల్‌ఖాన్ హతుడయ్యాడు.

వెంటనే ప్రతాప్‌గడ్ కోటలో ఒక ఫిరంగి ఢాం అని పేలింది. నలుమూలల నుంచి మరాఠా సైనికులు ఒక్కుమ్మడిగా కమ్ముకొనివచ్చి బీజపూర్ సైన్యంమీదపడి నుగ్గు నూచం చేసివేశారు.

శివాజీకి అప్పుడు మొగలులను కూడా సవాలు చేయాలని బుద్ధిపుట్టింది. మొగలు రాజ్యంమీదకూడా దాడులు చేయడం ప్రారంభించాడు. మొదట్లో శివాజీని గడ్డిపరకగా చూసిన ఔరంగజేబు హేళనగా శివాజీకి ''కొండ ఎలుక'' అని పేరు పెట్టాడు. అయితే శివాజీ మీద తన అభిప్రాయాన్ని త్వరలోనే అతడు మార్చుకొనవలసివచ్చింది. ఔరంగజేబు సైన్యాలు దాదాపు 20 ఏళ్లు శివాజీతో పోరు సాగించినా, అతనిని అంతెకు తీసుకురాలేక పోయాయి. శత్రువుతో శివాజీ ఎప్పుడూ ముఖాముఖిగా యుద్ధానికి తలపడేవాడు కాడు. మొగలు సైన్యానికి అపారమైన అంగబలము, గొప్ప ఆయుధాలు ఉండటంవల్ల అతను అదను కోసంవేచి వీలుచిక్కినప్పుడల్లా అదాటుగా దాడులు సాగిస్తూ, మెరుపువలె అంతలోనే మాయమైపోతూ ఉండేవాడు. ఈ విధమైన యుద్ధ తంత్రాన్ని ఈ కాలంలో ''గెరిల్లా యుద్ధం'' అంటారు. తమమీద దాడి జరిగే భయంలేదని మొగలు సైన్యాలు భరోసాతో ఎప్పుడు ఎక్కడైతే ఏమరి ఉంటాయో, సరిగ్గా అక్కడే శివాజీ అశ్విక దళాలు హఠాత్తుగా దాడిచేసి దెబ్బతీసి, ప్రతిపక్ష సైన్యాలు మళ్ళీ సమీకృతం అయ్యేలోగా అంతర్ధానం అయిపోతూ ఉండేవి. శివాజీ చేజిక్కిన ఒక కోటను మొగలు సైనికులు కష్టపడి వశపరచుకొనే సమయానికి అతని సైనికులు ఎక్కడో 50 మైళ్ళ దూరాన మరోకోటవద్ద దాడి ప్రారంభించినట్లు వార్త వచ్చేది. మెరుపులా దూసుకుపోయే శివాజీ అశ్వికదళంతో మత్తగజంలాగా మందయానం చేసే మొగలు సైన్యం వేగలేకపోయేది.

శివాజీ యుద్ధ తంత్రంతో విసిగివేసారిపోయిన ఔరంగజేబు అతనిని పట్టుకోవడానికి చివరికి ఒక పన్నుగడపన్నాడు. కొంతమంది తోటి మండలాధిపతులతోబాటు శివాజీనికూడా రాజధాని ఆగ్రాకువచ్చి తనను కలుసుకోవలసిందని ఔరంగజేబు శివాజీకి ఆహ్వానం పంపాడు. సాహస కృత్యాలంటే అంతులేని సరదా గనుక శివాజీ అందుకు వెంటనే అంగీకరించాడు. ఏ ఆయుధమూ ధరించకుండా ఒకనాడు ఉన్నట్టుండి శివాజీ మొగలు దర్బారులోకి హుటాహుటిన తరలివచ్చాడు. అతనికంటే తక్కువ హోదాగల ఉద్యోగుల సరసన శివాజీని కూర్చోమని ఔరంగజేబు చోటు చూపించాడు. ఆ అవమానానికి శివాజీ కోపోద్రిక్తుడై దర్బారు విడిచి విసవిసా బైటికి వెళ్ళిపోతూ ఉండగా, ఔరంగజేబు శివాజీని బంధించి

అతను మకాముచేస్తున్న విడిదిలోనే ఖైదు చేయించాడు. కానీ శివాజీ ఈ ఎత్తుకు పైఎత్తు వేసి తనను కావలా కాస్తున్న సైనికుల కళ్ళలోదుమ్ముకొట్టి వారిని తప్పించుకు పారిపోయాడు. ముందు బందిఖానాలో కొన్నాళ్ళు జబ్బుగా ఉన్నట్టు నటించి, ఒకనాడు కావలాదారులు ఏమరుపాటుగా ఉన్న సమయంలో ఒక పెద్ద మిఠాయిగంపలో దూరి ఎవరికీ తెలియకుండా చల్లగా బయటకు జారుకున్నాడు. శివాజీ ఆగ్రానుంచి క్షేమంగా తిరిగివచ్చినందుకు మహారాష్ట్రులందరూ ఉత్సాహంతో వేడుకలు జరుపుకొన్నారు. మహారాష్ట్రానికి అప్పుడే శివాజీ ఛత్రపతిగా పట్టాభిక్తుడయ్యాడు.

శివాజీ సాటిలేని మహానాయకుడు. అతని సైనికులేమి, ప్రజలేమి అతనిపట్ల అపారమైన అనురాగంతో, ఆయన ఆజ్ఞ ప్రకారం ప్రాణాలను ఒడ్డడానికైనా సిద్ధంగా ఉండేవారు. చురుకు పాలేగాని పిరికిపాలు మచ్చుకైనాలేని ఈ యోధానుయోధునియెడ ప్రజలకు అమితమైన గౌరవాదరాలు కలుగడంలో వింతలేదు. తనను నమ్ముకున్నవారిని జాగ్రత్తగా కనిపెట్టిచూస్తూ, అందరిపట్ల న్యాయంగా ప్రవర్తించడంవల్ల శివాజీని వారు విశ్వాసంతో కొలిచేవారు. శత్రువులను సైతం ముగ్ధులను చేయగలిగిన సద్గుణాలు ఆయనలో ఉండేవి. యుద్ధ తంత్రంలో శివాజీ కడునేర్పరి. దండయాత్ర చేసేముందు జాగ్రత్తగా ప్రతి చిన్న విషయమూ ఆలోచించి పథకం వేసుకునేవాడు. తన సైన్యంలో ఏఏ పదవులకు ఎవరెవరిని నియమించాలో తానే నిర్ణయించేవాడు. సైనికోద్యోగులు క్రమంతప్పి నడవకుండా గట్టిగా కట్టడి చేసేవాడు.

రాజ్యాన్ని సమర్థతతో పాలిస్తూ ప్రజలకు, ముఖ్యంగా గ్రామీణులకు, శివాజీ అనేక మేళ్లు చేశాడు. తన రాజ్యంలోని భూమినంతా కొలిపించి ఎవరెంత పన్ను చెల్లించాలో లెక్కవేయించాడు. పేద రైతులవద్ద సొమ్ము గుంజుతూ విలాసంగా జీవించే భూస్వాములకు గట్టిగా పాఠం చెప్పేవాడు. వారసులు ఎంత అనర్హులైనా, ఆ కాలంలో తండ్రి తాతల బిరుదులు, గౌరవాలు వంశపారంపర్యంగానే సంక్రమిస్తూ ఉండేవి. అవసవ్యమైన ఈ సంప్రదాయానికి శివాజీ స్వస్తి చెప్పాడు. శివాజీ కాలంలో అదివరకెన్నడూ లేనంత చక్కగా దక్కనులో పరిపాలన కొనసాగింది. పరిపాలనా నిర్వహణలో శివాజీకి సలహాలివ్వడానికి ఎనిమిదిమంది మంత్రులుండేవారు.

శివాజీ సమర్థుడైన పాలకుడే కాకుండా, మతంపట్ల భక్తి విశ్వాసాలు కలవాడు. యోగి రామదాసును శివాజీ గురువుగా స్వీకరించాడు. రామదాసుపట్ల శివాజీకి అపారమైన గురుభక్తి.

తనరాజ్యం యావత్తూ ఆయనకు గురుదక్షిణగా ధారపోయడానికికూడా శివాజీ ఒకసారి సిద్ధమయ్యాడు.

శివాజీ దేశభక్తినీ, అతని ధైర్య పరాక్రమాలను మహారాష్ట్రులు నేటికీ కీర్తనలుగా గానం చేస్తూంటారు. శివాజీ జన్మించి రెండువందల ఎనభై సంవత్సరాలు దాటిపోయినప్పటికి ప్రజలు శివాజీని నేటికీ నెత్తిన పెట్టుకుని వీరపూజ చేస్తున్నారు.

—

# శివాజీ అనంతరం

కుమారుడు శంభాజీకీ, తండ్రి శివాజీకి అణుమాత్రమూ పోలిక లేదు. శంభాజీ స్వార్థపరుడు, సుఖాలు మరిగినవాడు. శివాజీ మరణించిన తరువాత ఔరంగజేబు శంభాజీని అవలీలగా జయించాడు. ఖైదీగా పట్టుకొనిపోయి అతనిని చంపించాడు. అప్పటికి శంభాజీకి సాహూ అనే పిల్లవాడు కలిగాడు. మరాఠాలను పిడికిట పెట్టుకోవాలంటే సాహూను తీసుకువెళ్ళి తన అదుపాజ్ఞలలో ఉంచుకొని స్వయంగా పెంచడం ఒక్కటే ఉపాయమని ఔరంగజేబు భావించాడు. ఆ ప్రకారం సాహూను తీసుకువెళ్ళి తన పర్యవేక్షణ కింద రాజప్రాసాదంలో ఉంచాడు. సాహూ పెద్దవాడయ్యాక మొగలులు అతనిని విడిచిపెట్టి, ఇక నీవు దక్కనుకుపోయి నీరాజ్యం నీకు ఇవ్వమని తగవు పెట్టుకోమంటూ అతణ్ణి పురికొల్పారు. సాహూ రాకతో మహారాష్ట్రులలో చీలికలువచ్చి, అంతఃకలహాలతో వారు బలహీనులైపోతారని మొగలుల ఆశ. కొంతకాలం అయితే ఈ ఎత్తు పారింది. కాని త్వరలోనే మరాఠాలు ఏకమై మొగలుల మీద మళ్లీ కట్టుగా కత్తికట్టారు.

## పీష్వాలు

బాలాజీ విశ్వనాథ్ అనే బ్రాహ్మడు సాహూకు మంత్రిగా ఉంటూ రాజ్యపరిపాలనలో అతనికి సహాయపడేవాడు. బాలాజీ విశ్వనాథ్ గొప్ప ప్రజ్ఞావంతుడు. సాహూ వేటకు వెళ్ళినప్పుడు, ఇతర వ్యాసంగాలలో నిమగ్నుడై ఉన్నప్పుడు బాలాజీయే రాజ్య వ్యవహారాలు చూస్తూ ఉండేవాడు. సాహూకు తగిన సలహాలుఇచ్చి రాజ్యంలో మొగలుల ప్రాబల్యం అంతరింప చేసేందుకు పాటుపడ్డాడు. చివరికి సాహూ అతనిని ముఖ్యమంత్రిగా చేసుకొని అతనికి ''పీష్వా'' అనే బిరుదు ఇచ్చాడు. సాహూ మరణించిన తర్వాత పరిపాలనాధికారం ''పీష్వా'' హస్తగతమైంది. బాలాజీ విశ్వనాథ్ రాజధానిని పూనేకు బదలాయించాడు. అతని తదనంతరం అతని కుమారుడు మహారాష్ట్రాన్ని పాలించాడు. ఈవిధంగా ఆరంభమైన పీష్వాల పరిపాలన దక్కనులోను, ఉత్తరదేశంలోని మరికొన్ని ప్రాంతాలలోను దాదాపు నూరేళ్లు కొనసాగింది. పీష్వాలు దక్షతతో రాజ్యం చేస్తూ క్రమంగా తమ ప్రాబల్యాన్ని

పెంచుకున్నారు. పీష్వాల కాలంలో మరాఠా సేనాధిపతులు మరికొన్ని ప్రాంతాలను కూడా జయించి స్వంత సంస్థానాలను ఏర్పాటు చేసుకున్నారు. బరోడా, గ్వాలియర్, ఇండోర్ సంస్థానాలు ఈవిధంగా అవతరించనవే. మరాఠా సంస్థానాలు దేశంలో క్రమంగా ఇలా బహు ప్రాంతాలకు వ్యాపించాయి.

పీష్వా చివరికి తన సైన్యాన్ని ఉత్తరాన ఢిల్లీకి కూడా పంపి ఢిల్లీని ముట్టడించాడు. ఢిల్లీ అవలీలగా అతని చేజిక్కింది. ఆ రోజులలో ఢిల్లీ సింహాసనం అధిష్టించి ఉన్న చక్రవర్తికి సైన్యంగాని అధికారంగాని ఏమి ఉండేవికావు. ఆఫ్ఘనిస్థాన్ నుంచి ఆ కాలంలోనే అహమ్మద్‌షా అబ్దాలీ పంజాబుపైకి దండెత్తి వచ్చాడు. ఢిల్లీని ఆక్రమించుకున్న ఉత్సాహంలో మహారాష్ట్ర సైన్యాలు ఉత్తరవైపుగా మరికొంత దూరం సాగి పానిపట్టువద్ద అబ్దాలీ సైన్యాలను ఢీకొన్నాయి. ఇక్కడ జరిగిన భీషణ సమరంలో మహారాష్ట్రులు 2,00,000 మంది సైనికులను కోల్పోయి ఘోరంగా దెబ్బతిన్నారు. ఈ ఓటమినుంచి తరువాత ఎప్పటికి వారు కోలుకోలేదు.

పానిపట్టు యుద్ధం తరువాత మహారాష్ట్ర సంస్థానాధిపతులు తమలో తాము కలహించుకోనారంభించారు. వీరిలో ఒకడు పీష్వా అధికారాన్ని గుర్తించనని ప్రకటించాడు. వెంటనే పీష్వా బ్రిటిష్‌వారి సహాయాన్ని అర్థించాడు. దీనితో బ్రిటిష్‌వారికి వెదుకబోయిన తీగె కాలికి తగిలినట్లయింది. అది మొదలు బ్రిటిషువారు సంస్థానాధీశుల వ్యవహారాలలో చీటికీమాటికీ కల్పించుకుంటూ ఒకరి మీద ఒకరిని రెచ్చగొట్టడం సాగించారు. మండలాల అధిపతులను లొంగదీయడంలో పీష్వాకు సహాయపడడానికి బ్రిటిష్‌వారు అంగీకరించిన వెంటనే మహారాష్ట్రలో కలతలు, స్పర్థలు మరింత పెచ్చుమీరాయి. మరాఠా రాజ్యాలన్నింటిలోనూ తిరుగుబాట్లు రేగి అశాంతి ప్రజ్వలించింది. తమ చిరవాంఛితం తీర్చుకోవడానికి ఇంతకంటె చక్కని అదను మరొకటి లభించదని బ్రిటిష్‌వారు గ్రహించారు. అచిరకాలంలోనే బ్రిటిషువారు మరాఠా మండలాధిపతులందరిని తమ చెప్పుచేతులలోకి తెచ్చుకున్నారు.

# శిక్కులు

బాబరు భారత్‌కు వచ్చినప్పుడు పంజాబులో నానక్ అనే భక్తుడు ఉండేవాడు. భక్తి ఉద్యమంలో గురునానక్ ప్రముఖ పాత్ర వహించిన విషయం మీరిదివరకే చదివారు. వర్ణవ్యవస్థలో నీతి లేదని, మానవులందరూ, బ్రాహ్మణులుగాని, శూద్రులుగాని, హిందువులేమి, ముస్లింలేమి అందరూ ఈశ్వరుని దృష్టిలో సమానులనీ ఆయన విశ్వాసం. అనేకమంది నానక్ వద్ద చేరి ఆయనను గురువుగా కొలువసాగారు. ఈ అనుయాయులనే క్రమంగా ''శిక్కు''లని (అనగా శిష్యులు) వ్యవహరించడం జరిగింది. దేశంలో శిక్కు మతస్థుల పుట్టుక ఆ విధంగా ప్రారంభమైంది.

## పదిమంది గురువులు

గురునానక్ మరణం అనన్నమైనప్పుడు, తన కుమారులిద్దరిలోను ఏ ఒక్కరినీ గురుపీఠానికి వారసునిగా ఆయన నియమించలేదు. నమ్మకస్థుడైన మరొక శిష్యునికి బాధ్యత అప్పగించాడు. ఈ విధంగా శిక్కులకు పదిమంది గురువులు ఉండేవారు. మొట్టమొదట ఈశ్వరారాధనలోనే నిమగ్నులై ఉంటూ శిక్కులు మరొకరి జోలికిపోకుండా ప్రశాంతంగా కాలక్షేపం చేసేవారు. అన్ని మతాలనూ సమానంగా ఆదరించిన అక్బరు చక్రవర్తి, శిక్కులకు దేవాలయ నిర్మాణానికిగాను కొంత భూమి కూడా ఇచ్చాడు. ఆయన ఇచ్చిన స్థలంలోనే ఒక పెద్ద కోనేరు కూడా ఉన్నది. అప్పుడు ఆ విధంగా కట్టించిన దేవాలయాన్ని దరిమిలాను పాలరాతితో పునర్నిర్మించి, గోపురాలకు బంగారుపూత పూయించారు. క్రమేణా పంజాబులోని ఈ దేవాలయం చుట్టూ ఒక పట్టణం వెలసి పెద్ద వాణిజ్య కేంద్రంగా రూపొందింది. దీనికే అమృత్‌సర్ అని పేరు. సిక్కులకు నేటికీ అమృత్‌సర్ పుణ్యతమమైన యాత్రా స్థలం.

## అర్జున్‌దేవ్

అయిదవ గురువైన అర్జునదేవ్ సిక్కుల మతగ్రంథమైన ''ఆదిగ్రంథ్''ను కూర్చి ప్రచురించి అమరమైన ఖ్యాతి పొందాడు. ఈ ఆదిగ్రంథ్‌లో ఆయా శిక్కు గురువుల రచనలేగాక కబీర్, ఫరీద్, నామ్‌దేవ్ వంటి పెక్కుమంది హిందు, ముస్లిం భక్తుల ప్రవచనాలు కూడా సంకలనం

చేయబడ్డాయి.

శిక్కులవంటి ఇంతటి సాధుస్వభావులు క్రమేపీ ఉద్రేకులైన యోధులుగా ఎలా మారారో తెలుసుకోవడం అవసరం. అందుకు ముఖ్యకారణం, మొగలులు క్రూరంగా హింసలు పెట్టి, వారిపట్ల అమానుషంగా ప్రవర్తించడమే. జహాంగీర్ మీద తిరగబడిన ఆయన కుమారులలో ఒకనికి గురు అర్జున్ సహాయపడ్డాడు. దీనితో చక్రవర్తి కోపావిష్టుడై గురు అర్జున్‌ను ఖైదులో పెట్టి మరణదండన విధించాడు.

తమ గురువును చంపినందుకు శిక్కులు జహాంగీరుమీద క్రోధంతో అట్టుడికిపోయారు. గురు అర్జున్‌దేవ్ తరువాత అతని కుమారుడే సిక్కులకు గురువైనాడు. తనమీద భక్తితో ప్రజలు అర్పించే కంఠహారాలను ధరించడానికి ఆయన నిరాకరించేవాడు. కత్తితగిలించుకునే పటకాయే తనకు ఉచితమైన కంఠహారమని, ఇతరమైన హారాలేవీ తనకు అవసరం లేదని అనేవాడు. త్వరలోనే శిష్యపరంపరతో ఆయన ఒక చిన్న సైన్యాన్ని నిర్మించాడు. కాని మొగలులు ఆ శిక్కు గురువును వెంటనే పట్టుకొని ఖైదులో పెట్టారు.

పరమతాలను సహించని ఔరంగజేబు కాలంలో తేగ్ బహదూర్ శిక్కులకు గురువుగా ఉండేవాడు. తేగ్ బహదూర్‌ను పట్టుకొని మతం మార్చుకోవలసిందంటూ ఔరంగజేబు నిర్బంధించాడు. కాని తేగ్ బహదూర్ అందుకు ఒప్పుకోక పోయేసరికి ఔరంగజేబు అతని తల తీసివేయించాడు.

## గురుగోవింద్

తేగ్ బహదూర్ కుమారుడు గోవింద్ సిక్కు గురుపరంపరలో చివరివాడు. ఆయన నాయకత్వంలో సిక్కులు సంఘీభావంతో బలసంపన్నులై సుసంఘటితమైన సైన్యంగా తయారయ్యారు. గురుగోవింద్ వీరికి ''ఖాల్సా''లని అనగా స్వచ్ఛమైన వారని పేరుపెట్టాడు. ఖాల్సాలు కాగోరే సిక్కులు ఒక చిన్న క్రతువులో పాల్గొనవలసి ఉండేది. బాకుమొనతో కలియబెట్టిన ''అమృతాన్ని'' వారు సేవించాలి. ఈ కర్మకాండ అయిన తరువాత వారికి తిరిగి కొత్తగా నామకరణం జరిగేది. ఆ పేర్ల చివర ''సింగ్'' (అంటే సింహం) అనే పదం జోడించేవారు. తమ మతాన్ని, తమ మతస్థులను సర్వదా కాపాడటానికి సంసిద్ధులమై ఉంటామని వారు ఆ సందర్భంలో ప్రతిజ్ఞ పూనాలి. కృపాణాలను విడవకుండా ధరించాలి.

మరోవంక పూర్వకాలంనాటి ఋషులవలె జుట్టు, గడ్డము పెంచాలి. అంటే అటు సైనికుల లక్షణాలను ఇటు భక్తుల ప్రవృత్తిని కూడా అలవరచుకోవాలి, గురుగోవింద్ సింగ్ దివంగతుడయే ముందు తన తదనంతరం సిక్కులకు గురువు ఉండడని, ''ఆదిగ్రంథ్''నే గురువుగా పూజించుకోవాలని చెప్పివెళ్లిపోయాడు. అందుకనే ఈ పుస్తకానికి ''గురుగ్రంథ్ సాహెబ్'' అని పేరు వచ్చింది.

సిక్కులకు, మొగల్సులకు మధ్య నూరేళ్లకు పైగా యుద్ధం కొనసాగింది. ఎడతెగని ఈ పోరాటంలో రక్తం ఏరులై పారింది. మతం మార్చుకోవడానికి అంగీకరించని వీరులైన సిక్కులు ఎందరో తమ ప్రాణాలను బలిపెట్టవలసివచ్చింది.

## బందా

గురుగోవింద్ చనిపోయిన తరువాత సిక్కులకు బందా అనే ప్రజ్ఞాశాలి అయిన నాయకుడు లభించాడు. గురుగోవింద్ హత్య జరగడానికి కొద్ది రోజులకు ముందు అజ్ఞాతంలో ఉన్న బందా అనే ఈ సాధువును ఆయన కలుసుకోవడం జరిగింది. మొగలుల అత్యాచారాలకు తగిన ప్రతీకారం చేస్తానని బందా శపథం చేశాడు. ఆయన కూడదీసిన సైన్యంలో శిక్కులు వేలకొలదిగా చేరారు. మొగలు సైన్యాలను నిర్జించి సిర్హింద్ జిల్లాను సిక్కు సైనికులు కొల్లగొట్టారు. అంతలో ఢిల్లీ నుంచి చక్రవర్తి తాలూకు అదనపు బలాలు హుటాహుటిగా సిర్హింద్ చేరుకొన్నాయి. తన సైనికులను తీసుకొని బందా గురుదాస్‌పూర్‌కు తరలిపోయాడు. కాని శత్రుసైన్యం వారిని వెంబడించి చుట్టుముట్టింది. అనేక నెలలు ఘోరమైన కష్టనష్టాలు అనుభవించి చివరకు విధిలేక సిక్కులు లొంగిపోయారు. బందాను, అతని భార్యను, పిల్లవాణ్ణి, వీరుగాక సైన్యంలో 1000 మందిని బందీలుగా పట్టుకొని ఢిల్లీకి తీసుకువెళ్లారు. వారిని అక్కడ చెప్పనలవికాని యాతనలు పెట్టి వారిలో అనేకమందిని క్రూరంగా చంపివేశారు.

ఆఫ్ఘన్ యోధుడు అహమ్మద్‌షా అబ్దాలీ కూడా సిక్కులను రూపుమాపడానికి శాయశక్తులా ప్రయత్నించాడు. అమృత్‌సర్‌లో సిక్కుల దేవాలయాన్ని ధ్వంసం చేశాడు. కాని సిక్కులు వెంటనే బలాలను కూర్చుకొని మరలిపోతున్న శత్రుసైనికుల మీద వెనుక నుంచి అదాటుగా పడి కొల్లగొట్టుకొనిపోతున్న సంపదనంతా తిరిగి చేజిక్కించుకున్నారు.

## రంజిత్ సింగ్

సిక్కులు క్రమంగా 12 వర్గాల కింద విభాగమయ్యారు. ఈ వర్గాలలో ఒకదానికి

రంజిత్‌సింగ్ అనే యువవీరుడు నాయకత్వం వహించాడు. సిక్కులను కూడగట్టి వారిని బలాఢ్యులుగా ఆయన తీర్చిదిద్దాడు. పొట్టిగా, బక్కగా ఉండి, ఒంటికంటి వాడైనప్పటికీ రంజిత్‌సింగ్ పుట్టుకతోనే గొప్పయోధుడు. రౌతుగా ఆయనకు సాటి రాగలవారు లేరు.

రంజిత్‌సింగ్ తన 18వ ఏటనే పంజాబ్ ముఖ్యనగరమైన లాహోరుకు అధిపతి అయ్యాడు. తరువాత క్రమంగా అమృత్‌సర్, ముల్తాన్, పెషావర్ మొదలైన పట్టణాలను ఆక్రమించుకున్నాడు. అమృత్‌సర్‌లోని దేవాలయాన్ని పాలరాతితో తిరిగి కట్టించి గోపురాలకు బంగారు పూత పూయించాడు.

ఒక్క పంజాబు తప్ప దేశంలో తక్కిన ప్రాంతాలన్నీ బ్రిటిషువారు అప్పటికే ఆక్రమించుకున్నారు. సిక్కు రాజ్యానికి బ్రిటిష్ వారు పక్కలో బల్లెమై కూర్చున్నారని గ్రహించికూడా, చతురుడైన రంజిత్‌సింగ్ తగిన బలాన్ని కూర్చుకునేవరకు బ్రిటిష్‌వారితో కయ్యానికి కాలు దువ్వకూడదని నిశ్చయించుకున్నాడు. వారితో సఖ్యంగా ఉంటున్నట్లు నటించాడు. బ్రిటిష్ రాజ్యానికి, తన రాజ్యానికి మధ్య సట్లెజ్ నదిని సరిహద్దుగా నిర్ణయించాడు. రంజిత్‌సింగ్ 40 ఏళ్లు రాజ్యంచేసి సిక్కుల ప్రాబల్యాన్ని పెంచడానికి ఎంతో పాటుపడ్డాడు.

రంజిత్‌సింగ్ నిర్మించిన ఖాల్సా సైన్యంలో 50,000 మంది సైనికులుండేవారు. వీరికి యూరోపియన్ సైనికోద్యోగులచేత శిక్షణ ఇప్పించాడు. రంజిత్‌సింగ్ చనిపోయిన తరువాత సిక్కు రాజ్యంలో ఒక దశాబ్దంపాటు కల్లోలాలు చెలరేగాయి. సిక్కురాజులు ఒకరి తరువాత ఒకరుగా పలువురు తమ బంధుమిత్రుల చేతులలోనే బలవన్మరణానికి గురయ్యారు. ఈ అదను చూసుకొని బ్రిటిష్‌వారు తమ సైన్యాలను సట్లెజ్ నదీతీరానికి నడిపించి, నదిమీద వంతెనలు కట్టడం ప్రారంభించారు. బ్రిటిష్‌వారి ఎత్తుగడను ముందుగానే పసికట్టిన సిక్కులు లోతు తక్కువగా ఉన్న ఒకచోట నదినిదాటి ఆవలిగట్టుకు చేరుకున్నారు. ఉభయపక్షాల సైన్యాలకు నాలుగుసార్లు భీషణంగా యుద్ధం జరిగింది. చివరికి ఖాల్సా సైన్యంలోని కొందరు విద్రోహుల కుట్రవల్ల, సిక్కులు తమ ఆయుధాలతోసహా బ్రిటిష్‌వారికి లొంగిపోవలసివచ్చింది. ఈవిధంగా సిక్కు రాజ్యం కూడా బ్రిటిష్‌వారి హస్తగతమైపోయింది. సిక్కు రాజ్యానికి ఏలిక కావలసిన బాలుడు దలీప్‌సింగ్‌ను బ్రిటిష్‌వారు పట్టుకొని ఇంగ్లండుకు తీసుకుపోయారు. నాదిర్‌షా వారసులవద్ద నుంచి సిక్కులు లాగివేసుకున్న కోహినూర్ వజ్రాన్ని కూడా ఇంగ్లీషువారు చేజిక్కించుకుని బ్రిటిష్ రాజకిరీటంలో ఆభరణంగా దానిని చెక్కించుకున్నారు. ఇదంతా జరిగి సుమారు 150 ఏళ్లకుపైగా అయింది.

# మధ్య యుగాలలో ప్రజల జీవితం

చరిత్ర ఆరంభం నుంచే విదేశాల నుంచి అనేక జాతుల ప్రజలు మన దేశంవచ్చి స్థిరపడడము, వారితోపాటు వారి వేషభాషలు, మతము, ఆచారవ్యవహారాలు ఇక్కడికి దిగుమతి కావడము జరుగుతూ వచ్చింది. కాలక్రమేణా ఆ పరదేశీయులు మన ప్రజలలో కలిసిపోయారు. విదేశాలనుంచి ఈవిధంగా ఇక్కడ అడుగుపెట్టిన రాజులు, సైనికులు, మొదట వారు ఆఫ్ఘనులే అయినా, తురుష్కలో లేక మంగోలులో అయినా అనతికాలానికే నికారసైన భారతీయులుగా మారిపోతూవచ్చారు. ఇలా స్వదేశీయులుగా మారిన విదేశీయుల ప్రభావం దేశంలో వ్యాపించి స్వదేశీయులను కూడా కొంత మార్చితీర్చుతూ వచ్చింది. ఢిల్లీ సింహాసనాన్ని అధిష్టించిన చక్రవర్తులు, సుల్తానులేమి, మరికొన్ని ఇతర ప్రాంతాలలో రాజ్యం చేసిన రాజులేమి ముస్లింలేనన్న సంగతి తెలుసుకున్నాం. అంతేకాక వారి సిపాయిలు, వారి దర్బారులలోని పండితులు ముస్లింలే. వీరితో సన్నిహిత పరిచయం ఏర్పడి దేశంలో అనేకమంది ఇస్లాంమతం పుచ్చుకున్నారు. పర్షియన్, అరబ్బీవంటి పరాయి భాషలను నేర్చుకున్నారు. వారి వేష భూషలను ఆచార వ్యవహారాలను అవలంబించారు. స్వయంగా తాము ముస్లింలు కాకపోయినా, ప్రజలలో అనేకమంది ముస్లిం సాధువులను, మత గురువులను గౌరవించేవారు. హిందూ మతం, ఇస్లాం పరస్పరం విరుద్ధమైనవి కావని బోధించిన కబీర్, నానక్, అక్బరువంటి మహనీయులను గురించి లోగడ కొంత తెలుసుకున్నాము. ఈ కొత్తగావచ్చిన ఆగంతుకులు తెచ్చిన భాష. స్థానికంగా వాడుకలో ఉన్న భాష కలిసి ఉరుదూగా రూపొందాయి.

ఒక్క ఉరుదూయే కాకుండా ఈనాడు దేశంలో వాడుకలో ఉన్న భాషలలో అనేకం ఈ కాలంలోనే వృద్ధి చెందనారంభించాయి. మన ప్రాచీనులు సంస్కృత, పాకృత, పాలీ భాషలను, తమిళ భాషను మాట్లాడేవారు. కాలక్రమేణా దేశంలోని ఆయా ప్రాంతాలలో వేరువేరు భాషలు అవతరించాయి. గంగా-సింధు మైదానంలో ఆయా హిందీ మాండలికాలు, తూర్పున బెంగాలీ, ఒరియా, అస్సామీ భాషలు పడమట మరాఠీ, గుజరాతీ భాషలు ఆవిర్భవించాయి. ఇలాగే దక్షిణాన తమిళానికి తోడుగా తెలుగు, కన్నడ, మళయాళ భాషలు

అవతరించాయి. ఆయా భాషలలో కావ్యరచనకు కవులు రకరకాల ఇతివృత్తాలను వస్తువుగా స్వీకరించినప్పటికి, రామాయణ, మహాభారతాది పురాణగాథలే వారి గ్రంథాలలో ప్రధాన వస్తువు అయింది. తులసీదాసు ఈ ఇతివృత్తంతోనే ''రామచరిత మానస్'' వ్రాసిన విషయం తెలుసుకున్నాం. ఆయన వలెనే అనేక ఇతర కవులు కూడా మహాభక్తులు. వారి కీర్తనలు, గేయాలు దేశంలో భక్తిరసాన్ని వెల్లువగా పారించాయి. చదువు, పాండిత్యం లేకపోయినా, భగవంతుని మీద భక్తినిలిపి ధర్మపథాన నడచుకుంటే, ఈశ్వరుని అనుగ్రహానికి సాధారణ జనులుకూడా పాత్రులు కావచ్చునని భక్తులు ప్రచారం చేశారు.

కాని అప్పటికింకా బ్రాహ్మణులు, తదితరులు మత గ్రంథాలను చాలావరకు సంస్కృతంలోనే చదువుకొనేవారు. వెనుకటి గురుకుల వ్యవస్థ అంతర్ధానమైపోయింది. ప్రాచీన విద్యాపీఠాలు అంతరించాయి. కాని దేవాలయాలకు ఉనికిపట్టుగా ఉన్న కొన్ని పట్టణాలలో సంస్కృత పండితులు ప్రాచీన శాస్త్రాలను బోధించేవారు. అలాగే పెద్దపెద్ద మసీదుల చుట్టూ కూడా పాఠశాలలు వెలిశాయి. అనేకమంది హిందూ పండితులు అరబ్బీ, పర్షియన్ భాషలను అభ్యసించడము ఇటు ముస్లింలు సంస్కృత పండితులు కావడము జరిగింది. ఇలా సంస్కృత భాషలో నిష్ణాతులైన ముస్లింలలో ఔరంగజేబు సోదరుడు దారా షికో ఒకడు. ఇతను ఉపనిషత్తులను పర్షియన్ భాషలోకి అనువదించాడు.

ఈ రెండు విభిన్న సంస్కృతీ స్రవంతులు సంగీతంలో చక్కగా మేళవింపు పొందాయి. అల్లాఉద్దీన్ ఖిల్జీ దర్బారులో ఉంటూ సితార్ అనే సంగీతవాద్యాన్ని నిర్మించిన అమీర్ ఖుస్రో సంగతి లోగడ చదివాము. ఖుస్రో కాలానికే అనేక పర్షియన్ మట్లు, బాణీలు మన సంగీతంలో భాగమైపోయాయి. హిందువులేమి, ముస్లింలేమి ఒకే విధంగా సంగీత సాధన చేసేవారు.

ఆ కాలంలో నిర్మించిన కట్టడాలనేకం నేటికీ చెక్కుచెదరకుండా నిలచి ఉన్నాయి. నాటి సుల్తానులు, మొగలులు లెక్కకు మిక్కిలిగా మసీదులు, మీనార్‌లు, ప్రాసాదాలు, దుర్గాలను నిర్మించారు. ఢిల్లీ సమీపంలో ఉన్న కుతుబ్‌మీనార్, ఆగ్రాలో ఉన్న తాజ్‌మహాల్, బీజాపూర్‌లో గోల్‌గుంబాజ్, ఢిల్లీ, ఆగ్రాలలోని ఎర్రకోటలు వీటిలో ఎక్కువ పేరుపొందాయి. ఈ కాలంలోనే పెక్కు హిందూ దేవాలయాలు కూడా నిర్మించబడ్డాయి. సుప్రసిద్ధమైన మథుర, విజయనగర దేవాలయాలు ఆ కాలంలో నిర్మించినవే. ఖజురాహో, కోణార్క,

బేలూర్, అబూలలోని రమ్యమైన కట్టడాలు అంతకు కొద్ది కాలం క్రితం కట్టినవి.

మధ్య యుగపు రాజులు, వారి ఉన్నతోద్యోగులు వైభవవిలాసాలతో కాలంగడిపేవారు. విశాలమైన భవనాలలో నివసిస్తూ విలువైన వలువలు ధరించి, రుచికరమైన ఖాద్యపానీయాలు సేవిస్తూ, గృహాంతరాలలో సంగీతనృత్యాలు, చదరంగం వంటి వినోదాలతో, ఆరుబయట పోలోవంటి క్రీడలతో, రోజూ ఒక పండుగగా గడుపుతూ ఉండేవారు. వారిలో అనేకమంది స్త్రీ, పురుషులను బానిసలుగా కొనితెచ్చి వారిచేత అహోరాత్రాలు ఊడిగం చేయించుకొనేవారు. కోరినప్పుడు వారిని అమ్మివేసేవారు. ఒక్కొక్కప్పుడు విదేశాల నుండి కూడా బానిసలను తెప్పించుకొనేవారు. అయితే ఈ రాజులకు, సామంతులకు ఇంత సంపద తరగనిపాతరగా ఎక్కడినుండి వచ్చేది? చెమటోడ్చి పనిచేసే పాటక జనమే రకరకాల పన్నుల రూపంలో వీరికి కావలసిన సొమ్మంతా ముడుపుకడుతూ ఉండేవారు. ఇక యుద్ధాలు వచ్చాయంటే, ఆ కాలంలో యుద్ధాలకేమి కొదువ గనుక, సాధారణ ప్రజలకు స్వగృహాలలో సైతం రక్షణ లభించేది కాదు.

గ్రామాలలో వివాదాలు వచ్చినప్పుడు అప్పటికింకా పంచాయితీలే విచారించి తీర్పుచెబుతూ ఉండేవి. పంచాయితీలే పన్నులు వసూలు చేసేవి. షెర్షా, అక్బరులను గురించి వారు ఏర్పాటు చేసిన కొత్త రెవిన్యూ విధానాన్ని గురించి మీరు చదివారు. క్రమంగా మొగలులు ప్రారంభించిన రెవిన్యూ పద్ధతే దేశమంతటా వ్యాపించింది. జమాబందీ, జాగీర్, ఖరీఫ్, తక్కావీ వంటి మొగలుల రెవెన్యూ పరిభాష దేశంలో వివిధ ప్రాంతాలలో నేటికీ వాడుకలో ఉంది.

నాటి రాజులకు పెద్ద పెద్ద సైన్యాలుండేవి. తుపాకి మందు వాడుకలోకి వచ్చింది. వేల సంఖ్యలో విదేశాలనుంచి మేలుజాతి గుఱ్ఱాలను దిగుమతి చేసేవారు. సైన్యాలు ఎప్పుడూ ఎక్కడో అక్కడ దండయాత్రలు చేస్తూనే ఉన్నా, ఆ కాలంలో రోడ్లు కచ్చాగా ఉండి ఇరుకుగా గతుకులతో ఉండేవి. అయినప్పటికీ దేశంలో మారుమూల ప్రాంతాలనుంచి కూడా రాజులకు ఎప్పటికప్పుడు వర్తమానాలు అందేవి. ఎలాగంటే రాజుగారికి ఆఘమేఘాలమీద వార్తలు అందించడానికి దూరప్రయాణం చేసే గుఱ్ఱపు రౌతులు ఉండేవారు. తమ కోశాగారాలలో ధనరాసులు మూలుగుతూ ఉన్నప్పటికీ, నాటి రాజులకు బయటి ప్రపంచాన్ని గురించి తెలుసుకుందామన్న ఆసక్తి అణుమాత్రమూ ఉండేదికాదు. ఒక విదేశ యాత్రీకుడు జహంగీర్ చక్రవర్తి దర్శనం చేసుకొని ప్రపంచ పటాన్ని సమర్పించగా, చక్రవర్తి దానిని

తెరిచికూడా చూడలేదట. పోర్చుగీసువారు తమతో కొన్ని ముద్రణాలయాలను కూడా ఈ దేశానికి తెచ్చారు. అయినా వారిరాక తర్వాత ఎంతో కాలానికిగానీ మనవారు పుస్తకాలను ముద్రించడం నేర్చుకోలేదు. ప్రాచీన సంస్కృత విద్వాంసులకు కాగితం అందుబాటులో ఉన్నా, వారు అలవాటు ప్రకారం భూర్జ పత్రాలు, తాళపత్రాలమీదనే పుస్తకాలు వ్రాసుకుంటూ ఉండేవారు.

క్రమంగా దేశంలో పట్టణాల రూపురేఖలు మారిపోసాగాయి. అనేక కొత్త పట్టణాలు, వాణిజ్య కేంద్రాలు అవతరించాయి. అహమ్మదాబాద్, సూరత్, కాంబే, కాలికట్, ఢాకా, చిటగాంగ్, హుగ్లీ, బీజపూర్, గోల్కొండ ఇందుకు ఉదాహరణలు. మొగలుల ప్రాభవంవల్ల ఢిల్లీ, లాహోర్, ఆగ్రా నగరాలు పెరిగి భాగ్యవంతమైనాయి. అక్బరు కాలంలో భారత్‌ను చూడవచ్చిన ఇంగ్లీషు యాత్రికుడొకడు ఆగ్రా, ఫతేపుర్ సిక్రీలను సందర్శించి నాటి లండన్ కంటె ఆ నగరాలు ఎంతో పెద్దవని ఉగ్గడించాడు.

అంతకు పూర్వకాలంలోవలెనే మన వర్తకులు చైనా, పర్షియా, అరేబియావంటి దేశాలతో విస్తారంగా వ్యాపారంచేస్తూ ఉండేవారు. అరబ్ వ్యాపారస్తులు మనదేశంలో సరుకులు కొని ఐరోపా దేశాలలో వాటిని విక్రయించేవారు. మన దేశంలో తయారైన వస్త్రాలకు పండించిన మసాలా దినుసులకు విదేశాలలో చాలా గిరాకీ ఉండేది. అనేక రకాల వస్త్రాలకు మనదేశంలోని పట్టణాల పేర్లు వచ్చాయి. ప్రపంచమంతటా వాటి పేరు మారుమోగిపోయింది. ఉదాహరణకు కాలికోగుడ్డ అనే పేరు కాలికట్ ఊరి పేరు నుంచి వచ్చిందంటే నేటి వారికి ఆశ్చర్యం కలుగవచ్చు.

ఆ కాలంలో భారతదేశం ధనధాన్య సమృద్ధితో విలసిల్లుతూ ఉన్నందువల్ల, వివిధ దేశాలనుంచి అనేకమంది యాత్రికులు మన దేశం చూడవచ్చేవారు. కొందరు వ్యాపారం చేద్దామని వస్తే ఇంకెందరో ఇక్కడి చోద్యాలు చూద్దామని వచ్చేవారు. ఈ యాత్రీకులలో పలువురు ఆనాటి భారతదేశ స్థితిగతులను గురించి చక్కని ఇతిహాసాలు వ్రాసి ఉన్నారు. ఇట్టి యాత్రాచరిత్రలు వ్రాసిన ప్రముఖులలో మహమ్మదు తుగ్లక్ హయాంలో భారత్‌కు వచ్చిన ఇబిన్ బటూటా ఒకడు. అట్టివారిలో మరొకరు ఇటలీ నుంచి వచ్చిన మార్కో పోలో. ఇతడు చాలా సంవత్సరాలు చైనాలో ఉండి తరువాత భారత్‌కు నౌకా ప్రయాణం చేసి వచ్చాడు. భారతదేశంలో ఆ కాలపు ప్రజల ఆచార వ్యవహారాలు, నాటి భోగభాగ్యాలు, వృత్తిపనివారి కళాకౌశలాన్ని వర్ణిస్తూ, మార్కోపోలో అద్భుతమైన ఇతిహాసం ఒకటి రచించాడు.

# భారత్‌కు యూరప్ నుండి నౌకాయానం

ఎంతో పూర్వ కాలంక్రిందటనే భారతదేశంనుంచి నౌకలు పడమట ఈజిప్టుకు, తూర్పువైపున చైనాకు వెడుతూ ఉండేవని, భారత్‌కు అనేక విదేశాలకు మధ్య బహుళంగా వర్తక వ్యాపారాలు సాగుతూ ఉండేవని మీరు చదివారు. విదేశాలకు చెందిన ఓడలు, ముఖ్యంగా అరబ్బీ నౌకలు, భారతదేశ పశ్చిమ తీరం వెంట రాకపోకలు సాగిస్తూ ఉండేవి.

ఈ దేశాన్ని చూసిపోయిన ప్రయాణీకులు ఇక్కడి సిరిసంపదలను గురించి తమ తమ దేశాలలో కట్టుకథగా చెబుతూండేవారు. ఇలాగే ఒక ఇటలీ దేశస్తుడు స్వదేశానికి తిరిగివెళ్లి భారతదేశంలో నేస్తున్న రవసెల్లాలు మురిపెంగా సాలెగూళ్ల కన్నా నాజూకుగా ఉంటాయని, ఇక్కడ పండే సుగంధద్రవ్యాలు రాజులకు కూడా మళ్లీ మళ్లీ చవిచూడాలనేటంత పసందుగా ఉంటాయని గొప్పగా ప్రచారం చేశాడు. ఇలాంటి కథలు విని అనేక దేశాలలోని వర్తకులు భారత్‌కు ఎలాగైనా వచ్చి వాలాలని ఉవ్విళ్లూరేవారు. కాని భూమార్గాన భారత్‌కు ప్రయాణం దూరాభారమైంది. ఎంతో వ్యవప్రయాసలతో కూడింది. అందుకని వర్తకులందరికీ ''ఏదో విధంగా భారత్‌కు నౌకలలో ప్రయాణంచేసి వెళ్ళగలిగితే ఎంత బాగుండును?'' అని ఒకటే ఆలోచన కలిగింది. ఇలా ఉండగా క్రిస్టఫరు కొలంబస్ అనే సాహసయాత్రీకుడు మూడు తెరచాప ఓడలను తయారుచేసుకుని భారత్‌ను అన్వేషిస్తూ సముద్రమార్గాన బయలుదేరాడు. అయితే చాలా దూరం ప్రయాణం చేసిచేసి చివరికతను మొదట ఉద్దేశించినట్లు భారత్‌నుకాక అమెరికాను కనుగొన్నాడు.

## పోర్చుగీసువారు

అయితే కొంతకాలానికి వాస్కోడాగామా అనే నావికుడొకడు భారత్‌కు సముద్రమార్గం కనుక్కోగలిగాడు. ఈ వాస్కోడాగామా యూరపు ఖండంలోని పోర్చుగల్ అనే ఒక చిన్న దేశానికి చెందినవాడు. ఆఫ్రికాఖండాన్ని ప్రదక్షిణం చేసి ఇతను ఎలాగో భారత్‌కు వచ్చి చేరుకున్నాడు. ఇక్కడ ఆరు నెలలు మకాము వేసి రకరకాల సుగంధ ద్రవ్యాలను అరుదైన అనేక అందమైన వస్తువులను ఎన్నికచేసి పడవలను సరుకులతో నింపుకొని స్వదేశానికి

తిరిగివెళ్లాడు. అటు తరువాత మరికొన్ని పోర్చుగీసు నౌకలు భారత్‌కు వచ్చాయి. పిమ్మట పోర్చుగీసు సైనికులు, నావికులు పడమట కోస్తాలో ఉన్న గోవాను వశపరచుకున్నారు. ఇది జరిగి దాదాపు నాలుగు శతాబ్దాలైంది. బుడత కీచుల తరువాత భారతదేశానికి వచ్చిన బ్రిటిషువారు, ఫ్రెంచివారు భారతీయులకు ప్రశాంతంగా అధికారం వప్పచెప్పి ఇప్పటికి యాభై ఏళ్ళ క్రిందటనే భారత్ నుంచి తప్పుకొనిపోగా, గోవాలో మొండితనంగా బైఠాయించిన పోర్చుగీసువారిని స్వాతంత్ర్యం అనంతరం మనం పట్టిబలవంతాన తరమివేసి గోవా ప్రాంతాన్ని విముక్తం చేసుకున్నాము.

పోర్చుగీసువారు మలబారులో మిరియాలు, అల్లము కొని వాటిని మళ్లీ ఐరోపాలో అమ్మి లాభాలు చేసుకుంటూ ఉండేవారు. విజయనగర సామ్రాజ్యంతో కూడా విరివిగా వ్యాపారం చేసేవారు. ఐరోపాలోని ఇతరదేశాల వారికి వీరి ఆర్జన చూసి కళ్ళుకుట్టి తాము కూడా వారిలాగే డబ్బు చేసుకోవాలని ఉబలాటపడేవారు.

## డచ్‌వారు

భారత్‌కు పోర్చుగీసువారిని వెన్నంటివచ్చిన హాలెండ్ (డచ్) వర్తకులు తమతో వ్యాపారంలో పోటీపడటం పోర్చుగీసు వారికేమాత్రమూ ఇష్టం లేదు. అందువల్ల ఈ రెండు వర్గాలమధ్య తరచూ పోరాటాలు జరిగేవి. చివరికి బలసంపన్నులైన డచ్‌వారు పోర్చుగీసు వారిని చాలా స్థావరాల నుంచి తరమివేశారు.

డచ్ వర్తకుల ననుసరించి డేనులు వచ్చారు. వారి వెనకాలే ఇంగ్లీషువారు, ఫ్రెంచివారు వచ్చారు. వీరందరికీ కావలసింది ఒక్కటే - భారత్‌తో వాణిజ్యం. అందువల్ల వీరిలో ప్రతిఒక్కరూ తక్కిన వారిని బయటకి నెట్టివేయాలని చూశారు.

అయితే అందరిలో ఇంగ్లీషువారే బలవంతులని చివరకు తేలింది. ఇంగ్లీషువారు తక్కిన ఐరోపావారి నందరినీ భారత్ నుంచి క్రమంగా గెంటివేసి తమదే పైచేయి అనిపించుకున్నారు. మొదట వర్తకులుగా వచ్చిన బ్రిటిషువారు కొంతకాలానికి మనదేశానికి ప్రభువులై కూర్చున్నారు.

# బ్రిటిషువారి రాక

బ్రిటిషువారు మొదటినుంచి పేరుపడ్డ నావికులు. ప్రస్తుత కథా కాలానికి ఐరోపాలో ఏ దేశానికీ లేనంత పెద్ద నౌకాబలం బ్రిటిషువారికి ఉండేది. కాగా పోర్చుగీసు, డచ్ వర్తకులే భారత్‌తో నౌకా వ్యాపారం చేసి పెద్ద పెద్ద లాభాలు తీస్తూ ఉంటే, మనం మాత్రం ఆవిధంగా ఎందుకు చేయకూడదని వారికి ఆశపుట్టింది.

దాంతో బ్రిటిషు వర్తకులు కొందరు ఈస్టిండియా కంపెనీ అనే సంస్థను స్థాపించి, తూర్పు దేశాలతో వర్తకవాణిజ్యాలను నిర్వహించడానికి ఒకటవ ఎలిజబెత్ రాణి అనుమతి సంపాదించారు.

ఈస్టిండియా కంపెనీ ఓడలు మొదట సూరత్ రేవులో లంగరు వేశాయి. ఆ కాలంలో ఈ రేవు పట్టణం చాలా భాగ్యవంతమైనది. భారత్‌నుంచి తాము ఖరీదు చేసే సుగంధ ద్రవ్యాలు, నీలిమందు, నూలు, పట్టు వస్త్రాలను ఇంగ్లండునుంచి తాము తెచ్చిన ఉన్ని వస్త్రాలు, తగరము, ఇనుమును భారత్‌లో తగినంతకాలం నిల్వచేసుకొనే నిమిత్తం బ్రిటిషు వర్తకులు గిడ్డంగులను నిర్మించుకోడానికి జహంగీరు చక్రవర్తి అనుమతి ఇచ్చాడు.

సూరత్‌లో వ్యాపార కేంద్రాన్ని ఏర్పాటుచేసుకున్న తరువాత బ్రిటిషు వర్తకులు మద్రాసు, కలకత్తా, బొంబాయిలలో కూడా వాణిజ్య కేంద్రాలను నెలకొల్పుకున్నారు. నేటి మహానగరాలైన ఈ మూడు స్థలాలూ నాడు చిన్న చిన్న గ్రామాలుగా ఉండేవి. ఈ స్థలాలపై హక్కు భుక్తాలను అనుభవించినందుకు ప్రతిఫలంగా బ్రిటిషువారు మద్రాసును ఒక రాజావద్ద కొన్నారు. దక్షిణదేశంలో గట్టిగా కాలూనిన తరువాత బెంగాలులో హుగ్లీ నది ఒడ్డున కార్ఖానాలను నెలకొల్పారు. ఈవిధంగా కలకత్తా నగరానికి శంకుస్థాపన జరిగింది. బ్రిటిషువారికి బొంబాయి ఎలా దఖలు పడిందో ఆ ఉదంతం కొంత చోద్యమైనది. నాటి బ్రిటిషు రాజు పోర్చుగీసు రాకుమారిని వివాహమాడిన సందర్భంలో, బొంబాయిని ఆయనకు వరకట్నంగా చదివించారు. ఆ కాలంలో అది బెస్తవాళ్లు నివసించే ఒక చిన్న గ్రామం. బహుశా అప్పటికి దాని పేరు కూడా ఎవరికీ తెలియదు. పోతే ఇక బ్రిటిషు రాజు ఆ గ్రామాన్ని ఈస్టిండియా

కంపెనీకి సాలీనా 130 రూపాయల అద్దెకు కౌలుకిచ్చారు.

మొగలు సామ్రాజ్యం బాగా బలహీనమైపోయి అవసానదశకు వచ్చినందువల్ల దేశం ఆ రోజులలో అల్లకల్లోలంగా ఉండేది. సాధారణ ప్రజలు ''చక్రవర్తి ఎవరో, నేనెవరో, చక్రవర్తి ఎవరైతే నాకెందుకు?'' అని రాజకీయాలు ఏమీ పట్టించుకునే వారుకాదు. మరాఠాలు తమలోతాము తీవ్రంగా కలహించుకుంటూ ఉండేవారు. దేశం ఈవిధంగా సంక్షుభితమై ఉండటం చూసి ఇంగ్లీషువారికి ఇక్కడ తిష్ఠవేద్దామని బుద్ధి పుట్టింది. వర్తకులు పాలకులుగామారి భారత్‌లోని సిరిసంపదలను స్వదేశానికి తరలించుకుపోవడం మొదలుపెట్టారు. క్రమక్రమంగా దేశం పూర్తిగా స్వాతంత్ర్యాన్ని కోల్పోయింది.

తమ స్థావరాలచుట్టూ గట్టికోటలు కట్టుకొని బ్రిటిషువారు వాటిలో శతఘ్నులు అమర్చి సిపాయిలను పెట్టి, తమ ఆస్తిపాస్తుల కావలాకు గట్టి బందోబస్తు చేసుకున్నారు. అనతికాలానికే బ్రిటిషువారు తమ దుర్గాలను దుర్భేద్యంగా బలపరచుకున్నారు. దేశంలోని సంస్థానాధిపతులు అందరి సైన్యాలకు మించిన సైనికబలాన్ని కూడా వారు సమకూర్చుకున్నారు.

బ్రిటిష వ్యాపారస్తులు క్రమంగా పోర్చుగీస్, డచ్ వర్తకులను వ్యాపారంలో తమకు పోటీలేకుండా భారత్ నుంచి తొలగించివేసి, ఈ దేశ వాణిజ్యమంతా ఇంచుమించుగా గుత్తకు తీసుకున్నారు. ఇక అప్పుడు మిగిలింది ఒక్క ఫ్రెంచివారు మాత్రమే. ఫ్రెంచివారు కూడా వ్యాపార కేంద్రాలను ఏర్పాటు చేసుకుని పుదుచ్చేరి మొదలైన కొన్ని తావులలో కోటలు కట్టుకున్నారు. భారత్‌లో ఫ్రెంచివారికి డూప్లే అనే బహుసమర్థుడైన నాయకుడుండేవాడు. భారతదేశంలో ఫ్రెంచి సామ్రాజ్యాన్ని స్థాపించాలని అతను కలలు కంటూ ఉండేవాడు. ఇంగ్లీషువారి నాయకుడైన రాబర్టు క్లైవ్ అతనికంటె కూడా ఘనుడు. ఫ్రెంచివారి కళ్లలో దుమ్ముకొట్టి భారత్‌ను ఎలాగైనా బ్రిటిషువారికే కట్టబెట్టాలని క్లైవ్ ఎత్తుగడ. క్లైవ్ భారత్‌కు వచ్చినప్పుడు ఈస్టిండియా కంపెనీలో కేవలం ఒక గుమస్తా. కాని అనతికాలానికే ఇక్కడ ఇంగ్లీషువారికి నాయకుడయ్యాడు. ఇంగ్లీషువారు ఫ్రెంచివారు కూడా సంస్థానాధిపతుల కలహాలలో కల్పించుకొని తమ సైన్యాలను వారికి కిరాయికిస్తూ, అధికారం చేజిక్కించు-కోవడానికి ఎత్తుకు పై ఎత్తులు వేసుకుంటూ వచ్చారు. ఈ కుట్రలవల్ల క్రమక్రమంగా సంస్థానాధిపతుల ప్రాబల్యం సన్నగిలిపోయింది. చివరికి బ్రిటిషువారి పాచికలు అమోఘంగా పారి ఫ్రెంచివారి కంటే వారిదే పైచేయి అయింది.

# బ్రిటిషు సామ్రాజ్య అవతరణ

## రాబర్టు క్లైవ్

రాబర్టు క్లైవ్ బాల్యంలోనే సాహసవంతుడని పేరుపడ్డాడు. తండ్రిని ధిక్కరించి ఈస్టిండియా కంపెనీలో గుమస్తాగా పనిచేయడానికి ఈ దేశం వచ్చాడు. రద్దీగా గిజాటుగా ఉండే ఒక చిన్న ఆఫీసులో కూర్చొని ఫైళ్లూ అవీ చూస్తూ ఉండేవాడు. కాని క్లైవ్ మనసు వాటిమీద నిలిచేది కాదు. కలం బదులు కత్తి చేతపట్టాలని కలలు కంటూ ఉండేవాడు.

సంస్థానాధిపతులు తమలో తాము ఎలా కలహించుకుంటూన్నదీ శ్రద్ధగా గమనిస్తున్న క్లైవ్‌కు మంచి అదను దొరికిందనిపించింది. రొట్టెముక్క కోసం రెండు పిల్లులు తగవులాడుకొని తమలోతాము తగవు తీర్చుకోలేక మధ్యవర్తిత్వం చేయమంటూ కోతిదగ్గరకు వెళ్లగా, కోతి బావ రెండు పిల్లులకూ సమానంగా తుంచి ఇవ్వాలనే నెపంతో రొట్టెను పూర్తిగా తానే గుటకాయస్వాహా చేసిన కథ మీకు తెలిసే ఉంటుంది. క్లైవ్ కూడా సరిగ్గా ఈ కథలో కోతిలాగేనే సంస్థానాధిపతుల కలహాలలో చీటికి మాటికి కలుగజేసుకుంటూ ప్రతిసారీ తన స్వదేశానికి ఏదో లాభంకలిగేట్టుగా తంత్రాంగం నడిపిస్తూవచ్చాడు.

## ఆర్కాటు ఉదంతం

క్లైవ్ ఈవిధంగా మొదటిసారి చందా సాహెబ్, మహమ్మదాలీలకు వచ్చిన ఒక తగవులో తలదూర్చాడు. దక్షిణ దేశంలో ఆర్కాటు సింహాసనం అధిష్ఠించడానికి ఈ ఇరువురూ కొంతకాలంగా పోటాపోటీలు పడుతున్నారు, చందా సాహెబ్ ఫ్రెంచివారి సహాయాన్ని అర్థించగా, మహమ్మదాలీ బ్రిటిషువారి పంచనజేరి ప్రాపుకోరాడు. అటు ఫ్రెంచివారు, బ్రిటిషువారు కూడా ఒకరిమీద ఒకరికి అదివరకే కక్షలు పెరిగి ఉండడంవల్ల అందుకు వెంటనే అంగీకరించారు. ఆ రోజులలో బ్రిటిషువారికి ఫ్రెంచి వారికి మధ్య భారత్‌లోనే కాక ఐరోపాలో కూడా స్పర్థలు చెలరేగుతూ ఉండేవి.

చందా సాహెబ్, ఫ్రెంచివారు కలిసి మహమ్మదాలీ కోటను చుట్టు ముట్టారు. ముట్టడిలో ఉన్న మహమ్మదాలీని ఆదుకోవడానికి శత్రు సైన్యాలను చీల్చుకొని లోపలికి వెళ్ళడం తన

పరిమితమైన బలంతో కష్టసాధ్యమని క్లైవ్ గ్రహించాడు.

వెంటనే 300 మంది సిపాయిలు, 200 మంది సోల్జర్లను తీసుకుని క్లైవ్ ఆర్కాటువైపు సాగిపోయాడు. చందా సాహెబ్ ఈ దుర్గానికి కావలాపెట్టకుండానే మహమ్మదాలీ కోటను ముట్టడించడానికి ఆదరాబాదరా వెళ్లిపోయాడు. క్లైవ్ పన్నిన ఈ పన్నాగం తెలియగానే చందా సాహెబ్‌కు వంటిమీద తేళ్లు పాకినట్లయింది. వెంటనే మహమ్మదాలీ కోటను ముట్టడించడం మానుకొని ఆర్కాట్ వైపునకు పరిగెత్తాడు. కాని అదివరకే ఆ కోటను ఆక్రమించుకొన్న క్లైవ్ సైనికులను అక్కడినుంచి కదిలించడం అతనివల్ల కాకపోయింది. దరిమిలా బ్రిటిషువారు మహమ్మదాలీని ఆర్కాటుకు తీసుకువచ్చి నవాబుగా పట్టం కట్టారు. పేరుకు మాత్రమే నవాబుగా ఉంటూ బ్రిటిష్‌వారి చేతిలో అతడు కీలుబొమ్మ అయిపోయాడు. పూర్తిగా వారి ఆజ్ఞప్రకారం నడుచుకుంటూ ఉండేవాడు.

మొదట మనదేశంలోని బ్రిటిష్ వ్యాపారులను వారి ఆస్తిపాస్తులను కాపాడడానికని వచ్చిన బ్రిటిష్ సైనికులు ఇప్పుడు సంస్థానాధిపతుల కలహాలలో కల్పించుకొని, పార్టీలు పెట్టి వారితో యుద్ధాలు చేయడం ప్రారంభించారు. అనతికాలానికే దక్షిణ దేశంలో బ్రిటిష్‌వారి ప్రాబల్యం అప్రతిమానంగా విజృంభించింది.

## ప్లాసీ యుద్ధం

ఆ రోజుల్లో రైలు మార్గాలు, రైళ్లు ఉండేవి కావు. బెంగాల్ ఒక మూల దూరంగా విసరివేసినట్లు ఉండేది. ఆ కాలంలో బెంగాలుకు నవాబుగా ఉంటున్న సిరాజుద్దౌలాకు దక్షిణ దేశంలో బ్రిటిషువారు సాగిస్తున్న కూటనీతి ఏమాత్రమూ రుచించలేదు. కలకత్తాలో తమ కోటమీద అమర్చిన ఫిరంగులను దించివేయవలసిందని బ్రిటిషువారిని నవాబు ఆజ్ఞాపించాడు. కాని కంపెనీ తాలూకు బ్రిటిషు అధికారులు ససేమిరా అన్నారు. వెంటనే నవాబు కోటమీద దాడిచేసి కోట ఆక్రమించుకున్నాడు.

మద్రాసుకు ఈవార్త చేరగానే క్లైవ్ కలకత్తా బయలుదేరిపోవడానికి నిశ్చయించుకున్నాడు. పడవలలో హుగ్లీ నదిగుండా ప్రయాణంచేసి, ప్లాసీలో నవాబు సైన్యాలను ఎదుర్కొన్నాడు. స్వామి ద్రోహంచేసి మాలో కలిసిపోయినట్లయితే, నిన్ను నవాబును చేస్తామంటూ బ్రిటిషువారు నవాబు సేనాధిపతికి రహస్యంగా వర్తమానం పంపారు. ఆ ఎరతో మోసపోయి నవాబు సేనాపతి బ్రిటిషువారి పక్షాన చేరిపోవడంతో బ్రిటిషు సేనలకు ప్లాసీలో సులువుగా విజయం లభించింది.

ప్లాసీ యుద్ధం భారతదేశ చరిత్రలో అతి ముఖ్యమైన ఘట్టం. ఎందుకంటే ఈ యుద్ధం జరిగిన తరువాత యావత్ భారతదేశంలో బ్రిటిషువారికి ఎదురుచెప్పగలనాధుడే లేకపోయారు. ఈ యుద్ధం తర్వాత వారి ప్రాబల్యం అపారంగా పెరిగిపోయింది.

ప్లాసీ యుద్ధంలో నవాబు హతుడయ్యాడు. తదుపరి బ్రిటిషువారు స్వామిద్రోహి అయిన నవాబు సేనానికి ఇచ్చిన మాటప్రకారం పట్టం కట్టారు. కాని నగదు రూపంలోను, చరస్థిరాస్తుల రూపంలోను బ్రిటిషువారికి ఎడతెగకుండా ఆతను నజరానాలు గుమ్మరించవలసి వచ్చేది. ఎంతెంత డబ్బు దోచిపెట్టినా కంపెనీ ఉద్యోగుల ఆశకు అంతంటూ ఉండేది కాదు. ఇక సేనాధిపతి చేతిలో ఎర్రని ఏగానీ కూడా మిగలకుండా ధనసంపద అంతా ఊడ్చివేసుకున్న తరువాత బ్రిటిషువారు అతణ్ణి గద్దె దించేసి మరో సంస్థానాధిపతిని అతని స్థానంలో కూర్చోబెట్టారు. ఈ కొత్తగా వచ్చిన రాకుమారుడికి బ్రిటిషువారితో ఎంతమాత్రమూ పొసగలేదు. ఢిల్లీని ఏలుతున్న మొగలు రాజును, ఔధ్ నవాబును తనకు సాయం రావలసిందని అర్థించాడు. కాని అందరి బలాలు కలిసి పోరాడినా బ్రిటిషువారి చేతిలో వారికి ఓటమి తప్పిందికాదు.

ఈ యుద్ధంలో విజయం సాధించిన తరువాత నవాబుతో కలిసి బెంగాలును తాము కూడా ఏలుతామని బ్రిటిషువారు పట్టుబట్టి అందుకు చక్రవర్తిపై వత్తిడి తెచ్చారు. బలహీనుడైన మొగలు చక్రవర్తి తల వంచకతప్పలేదు. ఆ విధంగా బ్రిటిషువారికి బెంగాల్ దివాన్ గిరీని ఆయన కట్టబెట్టాడు. వర్తకానికి వచ్చిన ఇంగ్లీషువారు చివరికి ఈవిధంగా భారతీయుల నెత్తిమీద అధిపతులై కూర్చున్నారు. బెంగాలులో ఈ సమష్టి పరిపాలనవల్ల ప్రజలకు ఒరిగిందేమీ లేకపోగా పైపెచ్చు అటు నవాబు ఇటు ఇంగ్లీషువారు ఉభయులూ కలిసి ప్రజలను బాధించి అందినంత వరకూ డబ్బు దండుకోవడం ప్రారంభించారు. ప్రజల కడగండ్లకు మేరలేకపోయింది. పరిస్థితులు నానాటికీ విషమించి దేశంలో క్షామం తాండవించింది.

స్వదేశానికి క్లైవ్ చేసిన మహోపకారానికి సంతుష్టాంతరంగుడై బ్రిటిషురాజు అతనికి "లార్డ్" అనే బిరుదు ప్రసాదించి, బెంగాలుకు క్లైవ్‌ను మొదటి గవర్నరు చేశాడు.

గవర్నరు పదవి విరమించిన తరువాత క్లైవ్ స్వదేశానికి తిరిగి వెళ్లాడు. వృద్ధాప్యంవల్ల అశక్తుడయ్యాడు. భారతదేశంలో బ్రిటిష సామ్రాజ్యాన్ని నిర్మించడానికి సర్వశక్తులా పాటుపడినప్పటికీ, ఇంగ్లండులో కొందరు క్లైవ్ నడవడికను ఏవగించుకొని తీవ్రంగా గర్హించసాగారు. క్లైవ్ భారత్‌లో క్రూరంగాను, అక్రమంగాను వ్యవహరించాడని తెగనాడారు. దానితో క్లైవ్ క్రుంగిపోయి జీవితం మీద విరక్తితో ఆత్మహత్య చేసుకున్నాడు.

# మొదటి గవర్నరు జనరలు

బెంగాలులో రాబర్ట్ క్లైవ్, నవాబు కలిసి సమష్టి పరిపాలన సాగించిన రోజులలో ప్రజలు ఎలా కష్టాలకు గురయిందీ ఇంతకు ముందే మీరు చదివారు. ఇంగ్లీషు వర్తకులకు ఎంతసేపూ ఉన్న ఫళంగా కోటికి పడగెత్తుదామన్న ఆలోచనే తప్ప వేరొక ధ్యాస లేకపోయింది. నవాబు పేరుకుమాత్రమే నవాబు అయినందువల్ల ప్రజలకు చిటికెనవ్రేలెడు సహాయం కూడా చేయలేకపోయాడు. ఉద్యోగులలో ఇంచుమించు అందరూ అవినీతిపరులై, పేదరైతుల పొట్టకొట్టి లంచాలతో జేబులు నింపుకునేవారు. ఈ పద్ధతి ఇలాగే మరికొంత కాలం సాగనిస్తే తమ సంస్థ ఉనికికే ముప్పుకలుగవచ్చునని ఈస్టిండియా కంపెనీ అధికారులకు తోచింది.

## వారన్ హేస్టింగ్స్

క్లైవ్ వలెనే ఈస్టిండియా కంపెనీలో గుమాస్తాగా పనిచేసిన వ్యక్తి మరొకడుండేవాడు. అతని పేరు వారన్ హేస్టింగ్స్. అతనికి భారతదేశంలో స్థితిగతులన్నీ క్షుణ్ణంగా తెలుసు. వారన్ హేస్టింగ్సు నిర్భయుడని, న్యాయబుద్ధికలవాడని ఇంగ్లాండులోని కంపెనీ అధికారుల అభిప్రాయం. అందువల్ల భారత్‌లో పరిస్థితులను చక్కదిద్దడానికి వారన్ హేస్టింగ్స్‌ను బెంగాలుకు గవర్నరుగా పంపారు.

వారన్ హేస్టింగ్స్ నియమాలను నిబంధనలను తూ.చా. తప్పకుండా అమలు జరిపేవాడు. ఆయన లంచగొండి ఉద్యోగులను చూసీచూడనట్లు ఊరుకునే మనిషి కాదని బెంగాలుకు వచ్చిన కొద్ది రోజులకే అందరూ గ్రహించారు. ప్రతి జిల్లాలోనూ న్యాయస్థానాలను ఏర్పాటు చేసి ప్రజలకు న్యాయం చేకూర్చడానికి పకడ్బందీగా ఏర్పాట్లు చేశాడు. వారన్ హేస్టింగ్స్ చేసిన నిజంగా మంచిపనులలో ఒకటి ఏదంటే మన పురాణ సంస్కృత గ్రంథాలను, న్యాయశాస్త్ర గ్రంథాలను పరిశోధించడానికి దేశీయులైన గొప్ప విద్వాంసులను కొందరిని నియమించడం.

భారత్‌లో వ్యవహారాలను చక్కపెట్టడానికి వారన్ హేస్టింగ్స్ గట్టిగా ప్రయత్నించాడంటే, అందులో అసలు ఉద్దేశం ఏమిటి? ప్రజల కష్టసుఖాలు అర్థం చేసుకుని వారి విశ్వాసాన్ని

చూరగొన్నప్పుడే తమ అధికారం పదికాలాల పాటు నిలిచి ఉంటుందని గ్రహించడంవల్లనే ఈ పనికి ఆయన పూనుకున్నాడు. కాని మరోవంక కంపెనీకి ఎక్కువ ఆదాయం వచ్చే మార్గాలు కూడా చూడవలసివచ్చింది. ఇందుకోసం ఆయన సంస్థానాధిపతులకు తన సైన్యాలను అరువిచ్చి పెద్దపెద్ద మొత్తాలను ప్రతిఫలంగా వారివద్ద నుంచి రాబట్టుతూ ఉండేవాడు. ఈవిధంగా ఒకసారి ఔధ్ నవాబుకు సైన్యాన్ని అరువిచ్చి ఒక ప్రాంతాన్ని వశపరచుకోవడంలో సహాయపడినందుకుగాను, ఆ నవాబు వద్దవారన్ హేస్టింగ్స్ 40 లక్షల రూపాయలు వసూలు చేశాడు.

భారత్‌లో ఈస్టిండియా కంపెనీ ఏం చేస్తోందీ, ఎలా చేస్తోందీ అనేది బ్రిటనులో అంతవరకూ ఎవరూ పట్టించుకొనేవారు కాదు. కాని సంస్థానాధీశుల వ్యవహారాలలో చీటికిమాటికి కల్పించుకుంటూ పెద్ద పెద్ద భూభాగాలను కంపెనీ స్వాధీనం చేసుకున్నదని తెలియగానే బ్రిటిషు పార్లమెంటు ఈస్టిండియా కంపెనీని తన అజమాయిషీ కిందికి తెచ్చుకొని కంపెనీ వ్యవహారాలు తనిఖీ చేయడం ప్రారంభించింది. ఈ కొత్త ఏర్పాటు కింద వారన్ హేస్టింగ్స్ భారత్‌లో గవర్నరు జనరలుగా నియమితుడైనాడు. భారత్‌లో గవర్నరు జనరలుగా తాను చేసే ప్రతిపనికీ బ్రిటిషు పార్లమెంటుకు ఆయన సంజాయిషీ చెప్పుకోవలసిన అవసరం కలిగింది.

బెంగాలు నవాబు, మొగలు చక్రవర్తి ఈ ఇద్దరి తాలూకు జమీలను లాగివేసుకున్నందుకు పరిహారంగా కంపెనీ వారికి కొంత సొమ్ము చెల్లిస్తూండేది. వారన్ హేస్టింగ్స్ ఈ పరిహారాన్ని బాగా తగ్గించివేశాడు. సంస్థానాధీశులను బలవంతపెట్టి వారివద్ద ఎప్పుడూ ఏదో పేరున సొమ్ము వసూలు చేస్తూండేవాడు. ఔధ్ సంస్థానపు బేగంలను కూడా ఆయన ఇలాగే వత్తిడి చేయగా, అడిగిన సొమ్మును జతపరచలేక ఒంటిమీద నగకట్టునుకూడా వారు తెగనమ్మవలసి వచ్చింది. వారన్ హేస్టింగ్స్ ఔధ్ బేగంపట్ల అమానుషంగా ప్రవర్తించినందుకు ఇంగ్లండులోనే కొంతమందికి ఆగ్రహం కలిగింది. భారత్‌లో సాగించిన దుశ్చర్యలకు ఆయన మీద చివరకు విచారణ జరిగి హేస్టింగ్స్ బోనెక్కవలసివచ్చింది. బర్క్ అనే గొప్పవక్త వారన్ హేస్టింగ్స్ దురాగతాలను వల్లెవేసి విమర్శిస్తూ, న్యాయంగా పాలించబడే హక్కు అందరితోపాటు భారతీయులకు కూడా ఉన్నదని వక్కాణిస్తూ, పార్లమెంటులో గంభీరంగా దీర్ఘోపన్యాసం చేశాడు.

భారత్‌లో బ్రిటిషువారు ఏకచ్ఛత్రాధిపతులయేముందు అనేక ప్రత్యర్థులను ఎదుర్కొనవలసి వచ్చింది. ఫ్రెంచివారిని, మరాఠాలను, శిక్కులను వారు ఏవిధంగా బలహీనపరచిందీ లోగడ తెలుసుకున్నాం. హైదరాలీతో వారన్ హేస్టింగ్ ఎన్నోసార్లు యుద్ధాలు చేయవలసివచ్చింది.

# ధీరుడైన జనకుడు, దీప్తైన తనయుడు

## హైదరాలీ

హైదరాలీ గొప్ప ధీరుడు. అతనికి చదువను, వ్రాయను రాకపోయినా, తెలివి తేటలలో, ధైర్యపరాక్రమాలలో సరిలేనివాడు. మైసూరుకు రాజైన తరువాత దక్షిణ దేశంలోని ఇతర ప్రభుత్వాలను కూలదోసి ఏకచ్ఛత్రాధిపతి కావాలని నిశ్చయించుకున్నాడు. ఈ ఆశయంతో త్వరలోనే పెద్ద సైన్యాన్ని సమకూర్చుకున్నాడు. నానాటికీ పెరుగుతున్న మైసూరు బలసంపదలను చూచి నైజాంకు, మరాఠాలకు, బ్రిటిషువారికి కన్నెర్ర అయింది.

80,000 సైనికులను వెంటతీసుకుని 100 ఫిరంగులతో హైదరాలీ మద్రాసు ప్రాంతపు మాగాణాలలోకి తుఫానువలె వచ్చిపడ్డాడు. బ్రిటిషువారితో జరిగిన మొదటి యుద్ధంలో హైదరాలీకే విజయం లభించింది. అంతట వారన్ హేస్టింగ్స్ బెంగాలునుంచి కూడా కొంత సైన్యాన్ని పంపాడు. దీనితో హైదరాలీకి పరిస్థితులు ఎదురు తిరిగాయి. కష్టకాలంలో అనుచరులందరూ ఒంటరిగా విడిచిపోయినప్పటికి పట్టుసడలకుండా హైదరాలీ బ్రిటిషువారితో చివరిదాకా పోరుసాగించాడు. వారిచేతిలో ప్రస్తుతానికి తాను ఓడిపోయినప్పటికి, వారిని ఎప్పటికైనా మళ్లీ ఓడించకపోలేనన్న ఆశ చివరిదాకా ఆయనను విడిచిపెట్టలేదు. కాని చెదిరిపోయిన తన బలగాన్ని తిరిగి కూడదీనుకునే లోగా హైదరాలీ జబ్బుపడి, తన కలలు సఫలం కాకముందే మరణించాడు.



టిప్పు సుల్తాన్ ధైర్యవంతుడు, తెలివైనవాడు

## టిప్పుసుల్తాను

ధైర్య పరాక్రమాలలో తండ్రికితగ్గ కొడుకు టిప్పుసుల్తాను. విరామం లేకుండా ఇంగ్లీషువారితో ఎన్నో సంవత్సరాలు పోరు సాగించాడు. టిప్పుసుల్తాను ధైర్యశాలి, చతురుడు అయినప్పటికి ఇంగ్లీషువారిదే చివరికి పైచేయి అయింది. తన రాజ్యంలో బ్రిటిషువారికి సగపాలు ఇచ్చివేసి, ఇద్దరు కుమారులను వారికి బందీలుగా ఆయన అప్పచెప్పవలసి వచ్చింది. అంతేగాక అపరాధం కింద ఆయనవద్ద బ్రిటిషువారు ఎంతో సొమ్ము ఊడకొట్టి పుచ్చుకున్నారు. అయినా టిప్పుసుల్తానుకు మనసులో ఒక మూల ఆశలు మెదులుతూనే ఉన్నాయి. మళ్లీ పెద్ద సైన్యాన్ని నిర్మించాడు. ఫ్రెంచివారిని తనకు వత్తాసిమ్మని కోరాడు. దీనితో మందు గిడ్డంగిలో నిప్పుపుల్ల వెలిగించి విసిరినట్లయింది. టిప్పుకు, బ్రిటిషువారికి మధ్య అనేక యుద్ధాలు చెలరేగి ఘోరంగా రక్తపాతం జరిగింది. చివరికి శ్రీరంగపట్టణంలో కోటను కాపాడుకోవడానికి బ్రిటిషువారితో తీవ్రంగా పోరాడుతూ టిప్పుసుల్తాన్ యుద్ధంలో ప్రాణాలను ఆహుతి ఇచ్చాడు. జనకుడి పక్కనే తనయుణ్ణి కూడా సైనిక మర్యాదలతో ఖననంచేశారు. మన దేశంలో జన్మించిన ఒక మహాయోధుని జీవితం ఈవిధంగా అంతమైపోయింది. టిప్పుసుల్తాన్ మరణించిన అనంతరం మైసూరు పూర్తిగా బ్రిటిషువారి ఆధీనంలోకి వెళ్లిపోయింది. ఆ రోజులలో లార్డు వెలస్లీ భారత్‌కు గవర్నరు జనరలుగా ఉండేవాడు.

జనకుడు హైదరాలీ, తనయుడు టిప్పు ఇద్దరూ కూడా ప్రజలను దక్షతతో, దయగా పాలించిన రాజులే. మత వివక్ష లేకుండా అందరినీ సమంగా చూస్తూ న్యాయంగా రాజ్యం చేసిన రాజులు వీరు.

# బ్రిటిష్‌వారి అధికార విస్తరణ

వారన్ హేస్టింగ్స్ తరువాత భారత్‌కు 20 మందికిపైగా గవర్నరు జనరల్‌లు రావడం, క్రమక్రమంగా దేశంలో మరికొన్ని ప్రాంతాలు బ్రిటిషువారి అధీనమై, వారి అధికారం నానాటికీ విస్తరించడం జరిగింది.

## కారన్ వాలీస్

కారన్ వాలీస్ ప్రభువు గవర్నర్ జనరలుగా ఉన్న కాలంలో బెంగాలులో భూమి నిర్వహణకు సంబంధించి ముఖ్యమైన మార్పులు కొన్ని జరిగాయి. ఆ రోజులలో బీహారు ఒరిస్సాలు కూడా బెంగాలులోనే చేరిఉండేవి. రైతులనుండి పన్నులు వసూలు చేయడానికి ఆయన ప్రత్యేకంగా కొంతమందికి శాశ్వతమైన హక్కులు ఇచ్చివేశాడు. వీరే జమీందారులు. ఈ జమీందారులు రైతులవద్ద పన్నులకింద సాలీనా వసూలు చేసే సొమ్ములో బ్రిటిషువారికి కొంత జమకట్టి, తక్కినది తాము అనుభవించేవారు. బ్రిటిషువారు జమీందారులనే భూమికి నిజయమైన యజమానులుగా పరిగణించేవారు. ఈ పద్ధతికి ''పెర్మనెంట్ సెటిల్‌మెంట్'' అని పేరు. బ్రిటిషువారికి కట్టవలసిన దానికంటె అనేకరెట్లు ఎక్కువగా రైతుల వద్ద డబ్బు గుంజి జమీందారులు దండిగా లాభాలు తీస్తూ అనతికాలంలోనే గొప్ప శ్రీమంతులయ్యారు. బ్రిటిషువారి చలువవల్ల పైకివచ్చిన జమీందారులు వారికి పూర్తిగా అనువర్తనులై నడచుకున్నారంటే ఆశ్చర్యం ఏముంది!

క్రమంగా ఇంకా అనేక కొత్త ప్రాంతాలు బ్రిటిషువారి అధీనంలోకి రావడంతో, జమీందారీ వ్యవస్థ ఇతర ప్రాంతాలకు కూడా వ్యాపిస్తూ వచ్చింది. ముఖ్యంగా ఈ వ్యవస్థ బీహారు, ఉత్తరప్రదేశ్‌లలో బాగా బలపడింది. దీని ధర్మమా అని దేశంలో పేదరైతులు మరింత కుంగిపోయి పూర్తిగా నిరుపేదలయ్యారు. ఎప్పటికప్పుడు చేతిలో ఉన్న సొమ్మంతా జమీందారుకు వారు కట్టబెట్టవలసి వచ్చేది. ఇక కరువు కాటకాలు వచ్చాయంటే వారి కష్టాలకు హద్దులేదు.

దేశం స్వతంత్రమైన తరువాత జమీందారీ వ్యవస్థను రద్దుచేసి, దున్నేవాడికే భూమి

చెందేటట్లు శాసనాలు చేయబడ్డాయి.

## వెలస్లీ

లార్డ్ వెలస్లీ సమర్థుడైన గవర్నరు జనరల్. సర్కారు ఖజానా నింపడానికి ఆయన గొప్ప పథకం ఒకటి ఆలోచించాడు. శత్రువులనుండి తమకు రక్షణ కల్పించవలసిదంటూ కొందరు సంస్థానాధిపతులు తనను అడిగేట్టుగా చేసుకొని, వారికి ఆ విధంగా రక్షణ కల్పించినందుకుగాను ఏటా వారు బ్రిటిషువారికి కొంత ముడుపు చెల్లించే పద్ధతి ఒకటి ఆయన రూపొందించాడు. డబ్బూ పోయే, శనీ పట్టెనన్నట్లు సంస్థానీధీశులకు అటు లక్షలకు లక్షలు డబ్బు దండుగ అవడమే కాకుండా వారి స్వాతంత్ర్యం కూడా నశించిపోయింది. అయినా అనేకమంది సంస్థానాధీశులు వెలస్లీ పథకాన్ని ఆమోదించారు. వ్యవహారం చేయిదాటిపోయిన తరువాతగానీ బ్రిటిషువారికి పూర్తిగా దాసులమైపోయామన్న సంగతి వారు గుర్తించలేకపోయారు. వెలస్లీ ప్రతిపాదనను మొహమాటం లేకుండా తిరస్కరించిన సంస్థానాధీశులలో టిప్పు సుల్తాన్ ఒకడు. అయితే అందుకు ఫలితంగా బ్రిటిషువారితో ఆయన దీర్ఘకాలం పోరాటం జరుపవలసివచ్చింది. ఈ యుద్ధంలో టిప్పుసుల్తాన్ ఓడిపోయి, కర్ణాటక ప్రాంతమంతా బ్రిటిషువారి చేతులలోకి ఎలా పోయిందీ లోగడ తెలుసుకున్నాం.

## హేస్టింగ్స్

హేస్టింగ్స్ ప్రభువనే మరొక గవర్నరు జనరలు (వారన్ హేస్టింగ్స్ కాదు) పరాక్రమవంతులైన గూర్ఖాలపై (నేపాలు దేశీయులతో) పోరాటం సాగించి వారిని ఓడించాడు.

దేశంలో విచ్చలవిడిగా తిరుగుతూ దొంగతనాలు చేసే పిండారీ మూకలతో కూడా పోరుసాగించాడు. ఒకప్పుడు సైన్యంలో పనిచేసిన పఠాన్లు, జాట్లు, మరాఠాలు ఈ పిండారీల గుంపులలో ఉండేవారు. వీరికి మాల్వా పట్టణం ఆటపట్టుగా ఉండేది. ఆ ఊరికి చుట్టుపట్ల అనేక మైళ్ళ ప్రాంతంలో ఉంటున్న ప్రజలు పిండారీల పేరు చెబుతేనే గజగజ వణికిపోయేవారు. పిండారీలు హఠాత్తుగా పరిసర గ్రామాలలోకి దాడులు చేస్తూ దోపిడీలు, హత్యలు, గృహదహనాలు సాగించేవారు. వీరికి కరీం, చిట్టూ అనే ఇద్దరు నాయకులు. హేస్టింగ్స్ ప్రభువు పిండారీలను మట్టుపెట్టాలని తీర్మానించుకున్నాడు. అందుకు జాగ్రత్తగా పథకం తయారుచేసి, పిండారీలు ఉండే ప్రాంతాన్ని చుటుముట్టవలసిందని బ్రిటిషు సైనికులను

ఆదేశించాడు. ఆ ప్రకారం సైనికులు ముట్టడిచేశారు. క్రమపద్ధతిలో యుద్ధం చేయడం పిండారీలకు చేతకాదు. వారి నాయకులలో ఒకడు బ్రిటిషువారికి లొంగిపోయి వ్యవసాయ వృత్తిలో ప్రవేశించాడు. రెండవవాడు గుఱ్ఱమెక్కి అడవులలోకి పరారీ అయ్యాడు. తరువాత కొన్ని రోజులకు అతడు పులివాతబడి చనిపోయినట్లు అడవిలో దొరికిన ఆనవాళ్ళ వల్ల తెలిసింది.

పెక్కు ప్రాంతాలను పాలిస్తున్న మరాఠాలను కూడా హేస్టింగ్స్ ప్రభువు నిర్జించాడు. చాలా కాలంనుంచి బ్రిటిషువారి గుండెపై కుంపటిగా ఉంటున్న మరాఠాలు ఓడిపోవడంతో బ్రిటిషువారి మార్గం పూర్తిగా నిష్కంటకమైంది.

## బెంటింక్

భారతీయులకు మేలు చేసిన గవర్నరు జనరల్‌లలో విలియం బెంటింక్ ముఖ్యుడు. పాతకాలపు దురాచారాలను రూపుమాపడానికి ఆయన చాలా పాటుపడ్డాడు. కొన్ని హిందూ కుటుంబాలలో భర్త చనిపోయినప్పుడు భార్య కూడా చితియెక్కడం ఆచారంగా ఉండేది. ఈ ఘోరమైన దురాచారాన్ని అరికట్టడానికి అక్బరు చక్రవర్తి గట్టి ప్రయత్నమైతే చేశాడు కాని సఫలుడు కాలేకపోయాడు. దేశంలోని అనేక మంది నాయకుల వత్తాసుతో బెంటింక్ ప్రభువు ఈ ఆచారాన్ని తొలగించడానికి కృషి చేశాడు. సతీసహగమనాన్ని ప్రోత్సహించే వారికీ, అందులో పాల్గొన్నవారికీ తీవ్రమైన శిక్షలు విధించాలని ఆయన ఆదేశించారు.

బెంటింక్ భారత్‌కు రావడానికి పూర్వం ప్రజలు ప్రాణభీతిలేకుండా దూరప్రయాణాలు చేయగలిగేవారు కాదు. థగ్గులనే దొంగలు తాము కూడా బాటసారులవలె మారువేషాలు వేసుకుని అదాటుగా ప్రయాణికులపైబడి గొంతులు నులిమి వారి మూటలూ జేబులు ఖాళీచేసేవారు. రహదారులలో దొంగల బెడద లేకుండా, థగ్గులను నిర్మూలించి వేయడానికి బెంటింక్ తీవ్రంగా కృషి చేశాడు.

## డల్హౌసీ

బ్రిటిషువారు భారత్‌లో అనేక ప్రాంతాలను ఒకటొకటిగా ఎలా ఆక్రమించుకుంటూ వచ్చిందీ తెలుసుకున్నాము. ఈ విధంగా వారు హస్తగతం చేసుకొన్న ముఖ్యప్రాంతాలలో పంజాబు చివరిది. డల్హౌసీ ఈ ప్రాంతాన్ని జయించాడు.

అయితే బ్రిటిషువారితో రక్షణ సంధి కుదుర్చుకున్న సంస్థానాధీశుల ప్రాంతాలు కొన్ని ఇంకా విడిగానే ఉండిపోయాయి. మగసంతులేకుండా మరణించిన అధిపతుల సంస్థానాలు బ్రిటిషువారికే చెందుతాయంటూ డల్హౌసీ ప్రభువు ఒక కొత్త విధానాన్ని ప్రవేశపెట్టాడు. ఔథ్, సతారా, నాగపూర్, ఝాన్సీ మొదలైన సంస్థానాలు అనేకం బ్రిటిషువారికి ఈవిధంగా సంక్రమించాయి. ఝాన్సీరాణి ఈవిధానాన్ని ప్రతిఘటించింది. ఆమెను గురించి తరువాతి అధ్యాయంలో మరికొంత తెలుసుకుందాం.

## రెండు భారత్‌లు

ఆ కాలంలో భారతదేశంలో ఇంగ్లీషువారి పరిపాలనకింద ఉన్న బ్రిటిష ఇండియా ఒకటి, సంస్థానాధీశుల చేతిలో ఉన్న స్వదేశ సంస్థానాలు కొన్ని - ఇలా రెండు వేర్వేరు రకాల రాజ్యాలు ఉండేవి. మీరు ఈపాటికి గ్రహించి ఉంటారు - భారతదేశంలో విప్లవం జరిగిన కాలంలో బ్రిటిష ఇండియాలో బెంగాలు, బొంబాయి, మద్రాసు, వాయవ్యరాష్ట్రం అని నాలుగు పెద్దరాష్ట్రాలుండేవి. కాగా అప్పుడు సంస్థానాలలో పెద్దవి హైదరాబాదు, మైసూరు, బరోడా, తిరువాన్కూరు. ఈ రెండు భారత్‌లకు మధ్య పెద్ద వ్యత్యాసం ఉండేది. బ్రిటిష ఇండియాలోని ప్రజలకు ఏ ప్రాంతంలో నివసిస్తున్న వారైనప్పటికీ, ఒకే రకమైన శాసనాలు, నిబంధనలు వర్తించేవి. ఉదాహరణకు బొంబాయి నగరానికి కలకత్తా 1000 మైళ్ళ పైచిలుకు దూరంలో ఉన్నా కూడా, అక్కడా, ఇక్కడా దొంగతనాలు చేసిన వారికి ఒకే విధమైన శిక్షలుపడేవి. న్యాయస్థానాలలో ఒకే విధంగా విచారణ జరిగేది. కానీ సంస్థానాలలో రాజుల ఆజ్ఞప్రకారమే వ్యవహారాలు జరుగుతూ ఉండేవి. కొన్ని చిన్న సంస్థానాలలో రాజుగారి అభిమతమే శాసనంగా చెల్లుబడి అవుతూ, ప్రత్యేకంగా చట్టాలంటూ ఉండేవికావు. అయితే సంస్థానాలలో రెసిడెంట్లు అనే రాజకీయ ప్రతినిధులనుపెట్టి బ్రిటిషువారు సంస్థానాధిపతుల చర్యలను జాగ్రత్తగా గమనిస్తూ ఉండేవారు.

# మహా విప్లవం

మీరు ఢిల్లీ వెళ్లి ఉంటే, పాత ఢిల్లీ చుట్టూ ఉన్న రాతిగోడ అక్కడక్కడ దెబ్బతిని ఉండటం గమనించి ఉంటారు. కొన్నికొన్ని చోట్ల ఈ రాతిగోడ పూర్తిగా విరిగిపోయింది. లక్నోలోకూడా అనేక కట్టడాలకు ఇదే గతిపట్టింది. నూటనలభైఏడేళ్ల క్రిందట బ్రిటిషువారిపై మనదేశంలో గొప్ప తిరుగుబాటు జరిగిన రోజులలో కొన్ని ప్రాకారాలకు, కట్టడాలకు ఈరకమైన నష్టం సంభవించింది. తిరుగుబాటు మొదట బ్రిటిషు సైన్యానికి చెందిన భారత సిపాయీలతోనే ప్రారంభమైనప్పటికీ, త్వరలోనే సంస్థానాధీశులు, భూస్వాములుకూడా అనేకులు విప్లవంలో చేరారు. విప్లవనాయకులు అనేకమంది ఓటమి తప్పదని గ్రహించి కూడా చివరివరకూ ధైర్యంగా పోరాడి స్వాతంత్ర్య సమరంలో ప్రాణాలను ఆహుతి ఇచ్చి జాతీయవీరులుగా వినుతికెక్కారు. అయితే మనగడ్డలోంచి విదేశీయులను తరిమివేయడానికి ప్రారంభమైన ఈ మహోద్యమంలో పాల్గొనకుండా వైదొలగి ఉన్న వారు కూడా అనేకమంది దేశంలో లేకపోలేదు.

విప్లవం జరగడానికి కారణమైన పరిస్థితులు చాలా ఉన్నాయి. ఈస్టిండియా కంపెనీ ఉద్యోగుల ధనలోభము, అవినీతి చూసి భారతీయులకు అంతకంతకూ అసంతృప్తి పెరిగిపోయింది. మన దేశీయులకు ఏవో చిన్నచిన్న ఉద్యోగాలు పారేసి హోదాగల పదవులన్నీ బ్రిటిషువారికే కట్టబెట్టేవారు. సహజంగా భారతీయులకిది ఎంతమాత్రమూ నచ్చలేదు. ఉన్నత పదవులను అధిష్టించడానికి, తమ దేశ వ్యవహారాలను తామై నిర్వహించుకోడానికి ఆస్కారం లేకపోవడం భారతీయుల ఆత్మగౌరవానికి పెద్ద ఆఘాతం అయింది. బ్రిటిషు పరిపాలన కొనసాగితే సిరిసంపదలు వట్టిపోయి, దేశం అంతకంతకూ పేదపడిపోతుందని కూడా ప్రజలు గుర్తించారు.

దేశంలోని రాజకుటుంబాల చేతులలోంచి అధికారం పూర్తిగా బ్రిటిషువారికి ధఖలు పడిపోయింది. అంతకు ముందు ఏనాడూ ఇతరులవల్ల ఏవిధమై అవజ్ఞ వారికి జరుగలేదు. కాని ఇప్పుడు కొత్తగా తెల్లవారి ఎదుట తలవంచవలసి రావడంతో వారికి పుండుమీద

కారం చల్లినట్లయింది. సంస్థానాధీశులు అనేకమంది ఇంగ్లీషు వారికి ఎదురు తిరిగారు. డల్హౌసీ ప్రభువు కుతంత్రాలు పన్ని దేశంలో అనేక రాజ్యాలను అన్యాయంగా స్వాధీనం చేసుకున్నాడని కూడా వారు ఆగ్రహంతో ఉన్నారు. ఇక ప్రజా బాహుళ్యానికి జీవనోపాధి సైతం దొరకకపోవడంతో, నవనాడులూ కుంగి అలమటించి పోతున్నారు. మనదేశంలో చరఖా పనివారికీ, నేతపనివారికీ నోట మన్నుపడింది. ఇంగ్లండులో తయారైన చౌకబారు మిల్లుగుడ్డ బేళ్లకొద్దీ దిగుమతియై చేనేత వస్త్రానికి గిరాకీ లేకుండా పోయింది. ఇదే విధంగా ఇంగ్లండునుంచి అనేక రకాల మర తయారీ సరకులు ప్రవాహంగా వచ్చిపడసాగాయి. ప్రజలకు విదేశీ సరకులను కొనడంవినా గత్యంతరం లేకపోయింది.

ఇక జమీందారీ వ్యవస్థవల్ల రైతాంగం ఎంతగా ఇడుములు పడవలసి వచ్చిందీ ఇదివరకే చదువుకున్నాం.

## కొవ్వుతూటాలు

ఈ విపత్తులన్నీ చాలవన్నట్లు భారతీయుల ఆచార సంప్రదాయాలను సైతం చులకనచేయడం బ్రిటిషువారికి పరిపాటి అయింది. ఇలా వారు చేసిన అనాలోచితమైన పొరపాటులలో సైన్యానికి ఒక కొత్త రకం తూటాను సరఫరా చేయడం ముఖ్యమైనది. ఈ తూటాను తుపాకిలో దట్టించేముందు అందులో కొంత ముక్కను మునిపంట కొరకవలసి ఉండేది. ఈ తూటాలకు ఆవుకొవ్వు, పందికొవ్వుతో పూతపూయబడిందని సైనికులకు అనుమానం కలిగింది. దానితో సైన్యంలో హిందువులు, ముస్లింలు కూడా ఆగ్రహోవిష్టులయ్యారు.

విప్లవం మొదట మీరట్‌లో సిపాయిలలో ప్రారంభమైంది. ఒకనాడు క్రోధపరవశులైన సిపాయీలు కొందరు బ్రిటిషు ఆఫీసర్ల ఆజ్ఞలను ధిక్కరించి వారిమీదనే తుపాకులు కాల్చారు. అప్పటికే ఇంగ్లీషువారిపై ద్వేషంతో అట్టుడికిపోతున్న సైన్యంలో తక్షణమే విప్లవం కార్చిచ్చులాగా వ్యాపించింది.

ఢిల్లీలో ఉన్న మొగలు చక్రవర్తి బహదూర్‌షా వృద్ధుడు, అధికారలేశము లేని బలహీనుడే అయినప్పటికీ, కత్తిమీదకంటె కవితమీదనే అతనికి మమత ఎక్కువైనప్పటికీ, బహదూర్‌షాను విప్లవ నాయకుడుగా ప్రకటించారు. పోరాటం ముఖ్యంగా ఢిల్లీ, ఉత్తరప్రదేశ్, బీహార్, మధ్యప్రదేశ్‌లలో జరిగింది. దేశంలో ఇతర ప్రాంతాల ప్రజలు విప్లవంలో ఎక్కువగా



బ్రిటిష్ పాలనలోని
భారతదేశం
ఆఫ్ఘనిస్థాన్
జమ్మూ కాశ్మీర్
పంజాబు
బలూచిస్థాన్
ఢిల్లీ
రాజపుటానా
సింధ్
యునైటెడ్ ప్రావిన్సెస్
టిబెట్
నేపాల్
సిక్కిమ్
భూటాన్
అస్సాం
బీహార్
బెంగాల్
కలకత్తా
బర్మా
సెంట్రల్
ప్రావిన్సెస్
బొంబాయి
హైదరాబాద్
అరేబియా సముద్రం
బంగాళా ఖాతం
గోవా
మద్రాసు
మైసూరు
మద్రాసు
లక్షదీవులు
కొచ్చిన్
కన్యాకుమారి

కలుగజేసుకోలేదు. విజాతీయుడైన శత్రువుమీద భారతీయులందరూ కట్టుగా కత్తి దూయగల జాతీయత, సంఘీభావం అప్పటికింకా ఏర్పడకపోవడమే ఇందుకు కారణం.

## ఝాన్సీ రాణి

విప్లవంలో అనేకమంది మహాశూరులు, వీరవనితలు పాల్గొన్నారు. వీరిలో ఝాన్సీ లక్ష్మీభాయి సుప్రసిద్ధురాలు. పురుషవేషం ధరించి ఝాన్సీరాణి బ్రిటిషువారిపై సైన్యాలను స్వయంగా నడిపించింది. యుద్ధరంగంలో ఆమె చూపిన ధైర్యసాహసాలకు శత్రువులు సైతం అచ్చెరువొంది, ఝాన్సీరాణి ధీరోదాత్తతలను ఘనంగా శ్లాఘించారు. లక్ష్మీబాయి తాను చేసిన చివరి యుద్ధంలో నిరుపమానమైన ధైర్య పరాక్రమాలను ప్రదర్శించింది. బెబ్బులి వలె చివరిదాక భీకరంగా పోరాడి, బొందిలో ప్రాణం ఉన్నంతవరకూ శత్రువుకు లొంగడానికి ఆమె నిరాకరించింది. ఓటమి తప్పదని గ్రహించి కూడా సుశిక్షితుడైన సైనికుడు చేయవలసినట్లుగా ఝాన్సీరాణి వీరస్వర్గం అలంకరించింది.

## తాంతియా తోపే

ఈ తిరుగుబాటుకు నాయకులైన వారిలో మరొకడు తాంతియా తోపే. వ్యూహారచనలో ఆయనకు ఆయనేసాటి. బ్రిటిషు సైన్యాలకు ఎదురుపడి పోరాడకుండా, అదాటుగా తడవ



*పురుష దుస్తులు ధరించి ఝాన్సీరాణి బ్రిటిషు వారికి వ్యతిరేకంగా తన సేనలను నడిపించింది*

కొకచోట దాడిచేసేవాడు. రాణీ లక్ష్మీబాయిని ఆదుకోవడానికి హుటాహుటిగా బయలుదేరి కూడా ఆయన సకాలంలో సహాయం అందజేయలేకపోయాడు. ఝాన్సీరాణికి పరాయజయం, మృత్యువు ఏకకాలంలో సిద్ధించాయి. కాగా చివరికి తాంతియా తోపేని కూడా బ్రిటిషువారు పట్టుకొని మరణశిక్ష విధించారు. ఈ పరాక్రమశాలి మృత్యువును చిరునవ్వుతో స్వీకరించాడు. అడుగు తడబడకుండా కదం తొక్కుతున్నట్లే ఉరికంబం వద్దకు నడిచివెళ్లి ఉరి త్రాటిని తన చేతితో తానే మెడకు తగిలించుకున్నాడు.

## నానాసాహెబ్

తాంతియా తోపే స్నేహితుడైన నానాసాహెబ్ కాన్పూర్‌లో జరిగిన తిరుగుబాటుకు నాయకత్వం వహించాడు. అక్కడ తమ కుటుంబాలతో సహా 400 పైచిలుకు ఇంగ్లీషువారు తలదాచుకున్నారు. కోపంతో పరవళ్లు పెడుతున్న నానాసాహెబ్ సైన్యాలనుండి ఆత్మరక్షణ చేసుకోడానికి వారు ఎన్నోవిధాల ప్రయత్నించి లాభంలేక లొంగిపోయారు.

## ఢిల్లీ ఉదంతం

మీరటులో తిరుగుబాటు ప్రారంభమైన మరునాడే విప్లవకారులు గుర్రాలమీద ఢిల్లీకి తరటు తీసుకుంటూ వెళ్లి బ్రిటిషు వారినుంచి నగరాన్ని స్వాధీనపరచుకున్నారు. రాజప్రాసాదాన్ని ఆక్రమించుకుని, వృద్ధుడైన బహదూర్ షాను హిందూస్థాన్‌కు మళ్లీ చక్రవర్తి అయినట్లు ప్రకటించారు.

ఢిల్లీ చిరకాలంగా రాజధాని అయినందువల్ల, తిరుగుబాటుదారులు ఢిల్లీని ప్రధాన స్థావరంగా చేసుకున్నందువల్ల ఇంగ్లీషువారు వెంటనే ఆ నగరాన్ని మళ్లీ వశపరచుకోవాలని నిశ్చయించారు. ఢిల్లీ పడిపోయిన ఒక నెల్లాళ్లకు బ్రిటిషు సైనికులు యుద్ధసన్నద్ధమై రాజధాని పరిసరాలలో ఒక గుట్టమీద స్థావరం ఏర్పాటు చేసుకున్నారు. అక్కడినుంచి కొంత ముందుకు వెళ్లి కాశ్మీర్ గేటును మందుగుండుతో ధ్వంసం చేశారు. ఆరురోజులు భీకరంగా యుద్ధం చేసి రాజధానిని, రాజభవనాన్ని వారు మళ్లీ ఆక్రమించుకోగలిగారు. ఈ దాడిలో బ్రిటిషు సైన్యానికి నాయకత్వం వహించిన నికల్సన్‌కు పెద్ద గాయం తగిలి ప్రాణాలు కోల్పోయాడు. బ్రిటిషు సైనికులు నగరాన్ని కొల్లగొట్టి అనేక వందలమంది జనాన్ని సన్నీలతో పొడిచి చంపేశారు.

## బహదూర్ షా దుర్గతి

దాపునే ఉన్న హుమాయూన్ గోరీకి పారిపోయి అక్కడ తలదాచుకున్న బహదూర్ షాను బ్రిటిషువారు అరెస్టు చేశారు. యుద్ధ ఖైదీలుగా పట్టుబడిన బహదూర్‌షా కుమారులిద్దరినీ దరిమిలా అకారణంగా కాల్చి చంపేశారు. అంతేకాక బహదూర్ షాను బర్మాకు వెళ్ళగొట్టారు. అవసాన దశలో అనేక కడగండ్లకులోనయి, కొన్ని సంవత్సరాల తర్వాత బహదూర్ షా మరణించాడు. బర్మాలో ఉంటూండగా జఫర్ అనే మారుపేరుతో బహదూర్ షా కరుణరస ప్రధానంగా ఉర్దూలో రచించిన పద్యాలు ప్రపంచ ప్రసిద్ధికెక్కాయి. విషాదంతో కుంగిపోయి బహదూర్ షా 87వ ఏట రంగూన్‌లో కడకు కన్నుమూశాడు.

విప్లవం లక్నోకు వ్యాపించినప్పుడు ఆ పట్టణంలో ఉన్న ఇంగ్లీషు ఆఫీసర్లు, యూరోపియన్లు, క్రైస్తవులు సుమారు 700 మంది సోల్జర్లతో కలిసి రెసిడెన్సీలో దాక్కున్నారు. తిరుగుబాటుదారులు రెసిడెన్సీని దిగ్బంధం చేసి బయటనుండి పూచికపుల్ల కూడా లోపలకు వెళ్ళే ఆస్కారం లేకుండా రోడ్లన్నీ మూసివేశారు. ఇలా సుమారు నెలా 15 రోజులు ముట్టడి సాగిన తరువాత, ఒక బ్రిటిషు పటాలం ఎలాగో తోవచేసుకుని. ఆయుధ సామగ్రితో, ఆహార పదార్థాలతో రెసిడెన్సీలోకి ప్రవేశించింది, కాని లోపల ఉన్న జనానికి పూర్తి రక్షణ లభించడానికి తరువాత మరో రెండు నెలలు పట్టింది.

## బేగం హజరత్ మహల్

ఔధ్‌కు రాణియైన బేగం హజరత్ మహల్ యువతి. సాహసికురాలు. పెరిగి పెద్దవాడై ఔధ్ సింహాసనం ఎక్కవలసి ఉన్న తన చిట్టిపాపడి తరఫున హజరత్ మహల్ తానే రాజ్యమేలుతోంది. బ్రిటిషువారి నుంచి లక్నోను కాపాడటానికి హజరత్ మహల్ నిరుపమానమైన ధైర్యసాహసాలతో పోరాడింది. రాణివాసంలో ఎండకన్నెరుగకుండా పర్దాలో ఉండి, చిన్నతనంనుంచి సుఖాలకు అలవాటుపడి ఉన్న హజరత్ మహల్ రణరంగంలోకి ఉరికి యుద్ధానికి సైనికులను పురికొల్పుతూ వారికి ప్రోత్సాహమిచ్చింది. సర్వశక్తులూ ఒడ్డి బ్రిటిషువారిని కడకంటా ప్రతిఘటించింది. కాని చివరకు ఆమెను బ్రిటిషువారు నేపాలుకు తరిమివేశారు. నేపాల్‌లోనే ఆమె శరణార్థిగా రోజులు గడపవలసివచ్చింది.

## మరో ఇద్దరు శూరులు

కల్లోలితమైన ఆ రోజులలో అలహాబాదులో లియాకత్ అలీ అనే ప్రజానాయకుడు

ఉండేవాడు. పుట్టుకవల్ల సాలెవాడే అయినా, లియాకత్ ఆలీ చదువుకొని అధ్యాపకుడయ్యాడు. ఆయనకు నగరంలో మంచిపేరు ప్రతిష్టలుండేవి. లియాకత్ ఆలీ బ్రిటిషువారి మీద తిరగబడగానే, ప్రజలంతా ఆయన సరసన అండగా నిలిచారు. అతడెంత పరాక్రమవంతుడో అంత దయాశాలి. సంకుల సమరం జరుగుతున్న సమయంలో కూడా నగరంలో శాంతిభద్రతలకు భంగం కలగకుండా కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేశాడు. అలహాబాదు మౌల్వీగా ఆయన దేశంలో ప్రసిద్ధుడయ్యాడు.

బ్రిటిషువారితో ధైర్యంగా పోరాడిన వీరులలో ఫైజాబాద్ మౌల్వీ అయిన అహమ్మదుల్లా షా మరొకరు. ప్రజలు అనేకమంది భక్తిప్రపత్తులతో ఆయనను అనుసరించారు. షాజహాన్‌పూర్‌లో జరిగిన భీకర యుద్ధంలో అహమ్మదుల్లా షా పరాజితుడయ్యాడు. చివరికి ఔధ్ సరిహద్దున ఉన్న ఒక కోటలో తలదాచుకుందామని వెళ్ళగా, అక్కడి రాజాగారు కోటలో అతనిని అడుగుపెట్టనివ్వకుండా ద్వారాలు మూసివేయించాడు. అప్పుడు మౌల్వీ ఏనుగెక్కి కోటమీద దాడిచేశాడు. రాజా అనుయాయులు ఏనుగుమీద ఉన్న అతనిని సులువుగా గురిచూసి కాల్చివేయగలిగారు. మౌల్వీని చంపినందుకు బ్రిటిషువారినుంచి ఆ రాజుకు 50 వేల రూపాయలు బహుమానం కూడా ముట్టింది.

## కున్వార్ సింగ్

మరొక విప్లవవీరుడు కున్వార్ సింగ్ అనే వృద్ధ సంస్థానాధిపతి. కున్వార్ సింగ్ రాజపుత్ర వంశీయుడు. బీహారులోని ఒక చిన్న సంస్థానాన్ని పాలిస్తూండేవాడు. నాటి గవర్నరు జనరల్ ఆయన సంస్థానాన్ని బ్రిటిషు రాజ్యంలో కలిపివేసుకోడానికి ప్రయత్నించాడు.

కున్వార్ సింగ్ ధీరోదారతలను గురించి ప్రజలు నేటికీ కథలు చెప్పుకుంటూ ఉంటారు. ఒకసారి ఆయన గంగానదిని దాటుతూ ఉండగా బ్రిటిషు సైనికులు కాల్చిన తుపాకీ గుండు మణికట్టు లోపలికి దూసుకువెళ్లి చేతికి పెద్ద గాయమైంది. చీముపట్టి వళ్లంతా విషం వ్యాపించవచ్చునని అనుచరులు భయపడ్డారు. కున్వార్ సింగ్ వరలోంచి కత్తిదూసి గాయపడ్డ చేతిని ఒక్క వేటుతో నరికివేశాడు. నేలమీద తెగిపడిన చేతిని రెండవ చేతితో పట్టుకుని దాపున ఉన్న గంగానదిలోకి విసిరివేశాడు. పిమ్మట చిన్నగా నవ్వుతూ ''నా మాతృభూమికి ఇదే నా కడపటి కానుక'' అని నిట్టూర్పు విడిచాడట! ఇది జరిగిన నాటికి కున్వార్ సింగ్ వయస్సు 80 ఏళ్లు.

## కంపెనీ పరిపాలనకు స్వస్తి

ఈవిధంగా చెదురుమదురుగా బ్రిటిషువారితో ఏడాదికిపైగా యుద్ధం సాగింది. భారతీయుల పక్షాన న్యాయం ఉంది కనుక మనది పూర్తిగా ధర్మయుద్ధమే! కాని దేశ ప్రజలందరూ కలిసి ఈ యుద్ధంలో పాల్గొనలేదు. పాల్గొన్నవారు కూడా అంతా ఒక్కటై కట్టుగాకాక వేరువేరు చోట్ల వేరువేరు సమయాలలో యుద్ధం చేశారు. ఇందువల్ల బ్రిటిషువారికి తుదకు లొంగిపోక తప్పలేదు.

దేశంలో మళ్లీ బ్రిటిషువారి అధికారం పాతుకుంది. మొదటి స్వాతంత్ర్య సమరంలో భారతీయులు ఈవిధంగా ఓటమి పాలయ్యారు. నికల్సన్, హావ్‌లాక్‌వంటి కొందరు బ్రిటిష సేనానులు తమ మాతృదేశంలో వీరులుగా వినుతికెక్కారు. అయితే బ్రిటిషువారు ఈ యుద్ధంనుంచి ఒక గుణపాఠం నేర్చుకున్నారు. అది ఏమంటే - భారత్‌లో తామిక ధనార్జన మాత్రమే పనిగా పెట్టుకోకుండా దూరదృష్టితో పరిపాలన సాగించాలని, లేకపోతే భారత్‌లో తమ అధికారం పునాదులకంటా కూలిపోవడం తప్పదని.

ఆ కాలంలో విక్టోరియా రాణి ఇంగ్లండును పాలిస్తూండేది. భారతదేశంలో తిరుగుబాటు జరిగిన తరువాత ఈస్టిండియా కంపెనీ స్థానే, బ్రిటిషు ప్రభుత్వమే స్వయంగా పరిపాలన సాగించాలని నిర్ణయించారు. అక్కడినుంచి గవర్నరు జనరలుకు బదులుగా బ్రిటిషు రాజు లేదా రాణి తరఫున ప్రతినిధిగా దేశపరిపాలన నిర్వహించడానికి వైస్రాయిలను నియమిస్తూ వచ్చారు. అలహాబాదులో జరిగిన దర్బారులో విక్టోరియా రాణిపేరిట ఒక ఫర్మానా జారీచేయబడింది. ప్రజలకు అనేక సౌకర్యాలు కల్పించనున్నట్లు ఆ ప్రకటనలో వాగ్దానం చేశారు. ప్రజలందరూ ఎవరు కోరిన మతాన్ని వారు స్వేచ్ఛగా అవలంబించి అనుసరించవచ్చునని ఆ సందర్భంలోనే హామీ ఇవ్వడం జరిగింది.

# పశ్చిమ దిశ నుంచి నూతన భావాలు

ఈస్టిండియా కంపెనీ పరిపాలనా విధానంపట్ల ప్రజలకు కలిగిన ద్వేషభావమే పైచెప్పిన తిరుగుబాటుకు దారితీసింది. ఈ తిరుగుబాటువల్ల పరిపాలనా పద్ధతిలో చాలా మార్పులు వచ్చాయి.

## పారిశ్రామిక విప్లవం

ఈలోగా మనదేశంలోనేకాక ప్రపంచం అంతటా మరొక గొప్ప మార్పులేదా విప్లవం వచ్చింది. ప్రపంచంలో అప్పటికి ఎరిగి ఉన్నంతలో ఇలాటి మార్పు ఎప్పుడూ రాలేదు. అదివరకు తమ స్వహస్తాలతో మనుషులు చేస్తూవచ్చిన అనేక రకాల పనులను అంతకంటే అతి త్వరగా చేస్తూ ఇబ్బడి ముబ్బడిగా వస్తువులను ఉత్పత్తి చేయగల యంత్రాలను అనేక దేశాలలో కనుగొనడం జరిగింది. ప్రపంచంలో ఈ యంత్రాల మూలంగా వచ్చిన మార్పునే ''పారిశ్రామిక విప్లవం'' అంటారు. యంత్రాలను కనిపెట్టింది పాశ్చాత్యులే అయినా, పశ్చిమ దేశాలనుంచి క్రమంగా అవి భారత్‌కు కూడా దిగుమతి కావడం మొదలైంది. ఈ విధంగా మనదేశానికి రవాణా అయిన అద్భుత యంత్రాలలో రైలు ఇంజను ఒకటి. దేశంలో తిరుగుబాటు జరగడానికి పూర్వమే బొంబాయి వద్ద మొదటి రైలు మార్గం నిర్మించబడింది. ఆ రోజులలో రైలు మార్గాలు వేయడమంటే ప్రాణాపాయంతో కూడిన సాహసకృత్యం. రైలు పట్టాలు వేస్తున్న కూలీలను అడవిలోంచి క్రూరమృగాలు వచ్చి నోటకరచుకుపోయేవి. రైలు పట్టాల మధ్య నిరారుగా నిలబడి ఏనుగులు రైళ్ళను అటకాయిస్తూండేవి.

వెనుకటికాలంలో టపా చేరడానికి రన్నర్లు ఉండేవాళ్ళు. తపాలా సంచిని మూపునకు తగిలించుకుని టపా బంట్రోతులు అంచెల మీద ఒక ఊరు నుంచి మరో ఊరికి పరుగులు తీసేవారు. రన్నర్లు మధ్య మధ్య విశ్రాంతి తీసుకుని టపాను మరో రన్నరుకు అందించడానికి దోవలో అక్కడక్కడ మజిలీలు ఏర్పాటు చేసేవారు. వీటికి డాక్ బంగళాలని పేరు. డల్హౌసీ హయంలోనే భారతదేశంలో మొదటిసారి టెలిగ్రాఫ్ తీగెలు పడ్డాయి. తపాలా రవాణా పద్ధతిని కూడా అప్పుడే మెరుగుపరచారు.

మనదేశంలో అప్పుడప్పుడే ఆధునిక యుగంలో అడుగుపెట్టిందనడానికి ఈ రైల్వే తంతి తపాలాలే ముఖ్య నిదర్శనాలు. అదివరకు ఎవ్వరూ చూసి ఎరుగని వింతవస్తువులనేకం యంత్రాల ద్వారా ఉత్పత్తయి, కొత్తగా మార్కెట్లలోకి వచ్చినప్పుడు ప్రపంచంలో కలవరంతోపాటు కలతకూడా పుట్టింది. వీటివల్ల తమ మతానికే ముప్పు కలుగుతుందేమోనని భారతదేశంలో ప్రజలు భయపడ్డారు. దేశంలో విప్లవానికి దారితీసిన పరిస్థితులలో ఇది కూడా ఒకటి.

కాని ప్రపంచంలో అన్ని దేశాలలోవలె భారత్‌లో కూడా యంత్రాలు శాశ్వతంగా తిష్ఠవేశాయి. దేశంలో రైలు మార్గాలుపడడంతో ఇంగ్లీషువారికి పరిపాలన నిర్వహించడం సుకరమైంది. భారతదేశం ఎంతో పెద్దది కావడంవల్ల, అన్ని ప్రాంతాలనూ ఏకకాలంలో అదుపులో ఉంచడం బ్రిటిషువారికి అదివరకు కష్టసాధ్యంగా ఉండేది. ఒక ప్రాంతాన్ని అదుపులోకి తెచ్చామని సంతోషిస్తున్న సమయంలోనే అక్కడికి 1000 మైళ్ళ దూరాన ఉన్న మరో ప్రాంతంలో హఠాత్తుగా తిరుగుబాటు జరుగవచ్చు. పర్వతాలు, అడవులగుండా నాలుగుమూలలకూ రైళ్లు పడడంతో రాజధానినుంచే యావత్తు దేశాన్ని ఒక కంట కనిపెడుతూ ఉండడానికి వీలైంది.

## ఇంగ్లీషు చదువులు

ఈ కాలంలోనే క్రైస్తవ మిషనరీలు కొందరు భారత్‌కువచ్చి ఇంగ్లీషు చదువు చెప్పే పాఠశాలలు ప్రారంభించారు. ఇంగ్లీషు చదువునేర్పితే ముందుముందు పనికివస్తుందని అనేకమంది తల్లిదండ్రులు తమ పిల్లలను ఇంగ్లీషు బళ్ళలో చేర్పించేవారు. పాలకుల భాషను అభ్యసించడం ప్రజలకు తప్పనిసరిగదా. మొగలు చక్రవర్తులు పాలిస్తున్న కాలంలో పారసీకమే రాజభాషగా ఉండేది.

పాలకుల భాషను నేర్చుకుంటే ఉద్యోగాలు లభిస్తాయి. జీవికకు కటకటపడవలసిన అవసరం ఉండదు. ఇక్కడి ప్రతి చిన్న ఉద్యోగానికి ఎక్కడో ఉన్న ఇంగ్లండునుంచి స్వదేశీయులను రప్పించడం వృధావ్యయ ప్రయాస అని బ్రిటిషువారికి కూడా తోచింది. తాము కోరిన విధంగా పనులు చేయడమెలాగో భారతీయులకు నేర్పి వారినే చిన్న చిన్న ఉద్యోగాలకు నియమించడం తెలివైన పని అని బ్రిటిషువారు గ్రహించారు. మనదేశంలో ఇంగ్లీషు చదువులు ప్రవేశపెట్టి, తద్వారా అభిరుచులలో, ఆలోచనలలో అచ్చుగా ఇంగ్లీషు

వారిని పోలి ఉండి, చూపులకు మాత్రమే భారతీయులుగా కనుపించే ఆంగ్లమానసపుత్రుల తరగతి నొకటి సృష్టించాలని బ్రిటిషువారు ఉద్దేశించారు. యూరపులో ప్రజలు ఎలా జీవించేదీ, ఏ రకమైన దుస్తులు వేసుకునేదీ, అక్కడి వారికి ఏవిధమైన భావాలు, అభిప్రాయాలు ఉండేది మన ప్రజలు క్రమంగా ఆకళించుకున్నారు. ఇంగ్లీషు బళ్ళలో, కళాశాలల్లో చదువుకొని పెరిగి పెద్దవారైన భారతీయ యువకులకు బ్రిటిషు ఆఫీసర్ల కింద చిల్లర ఉద్యోగాలు కొన్ని దొరుకుతూ ఉండేవి.

క్రమంగా కలకత్తా, మద్రాసు, బొంబాయి ఈ మూడు ముఖ్య నగారాలలో విశ్వవిద్యాలయాలు నెలకొల్పారు. సరిగ్గా తిరుగుబాటు జరిగిన సంవత్సరంలోనే ఈ విశ్వవిద్యాలయాలు ప్రారంభించబడ్డాయన్నది గమనార్హం.

## ఫ్రెంచ్, అమెరికన్ విప్లవాలు

సైన్సుతో బ్రిటిషువారు కనిపెడుతున్న కొత్త వింతలు తెలుసుకోవాలంటే ఇంగ్లీషు నేర్చుకోవడం అవసరమని దేశంలో గట్టి అభిప్రాయం బయలుదేరింది. ప్రపంచంలో అప్పటికే రెండు ప్రసిద్ధ విప్లవాలు - ఫ్రెంచి విప్లవం, అమెరికన్ విప్లవం - జరిగాయి. ప్రజలు స్వేచ్ఛగా జీవిస్తూ, స్వయం పరిపాలన చేసుకోవడానికి అవకాశం కల్పించేందుకే ఈ విప్లవాలు కొనసాగాయి. ప్రజలందిరికీ సమానమైన హక్కులుండాలని, అందరూ స్వేచ్ఛగా జీవించగలగాలని యూరప్, అమెరికాలలోని మేధావులు కొందరు అభిప్రాయపడి, తమ భావాలను ప్రచారం చేయసాగారు. ఈవిధంగా స్వాతంత్ర్యాన్ని గురించి ఉపన్యాసాలు, రచనలు చేసిన ప్రముఖులలో రూసో అనే ఫ్రెంచి దేశీయుడు, బర్క్ అనే ఐరిష్ దేశీయుడు అగ్రగణ్యులు. రూసో, బర్క్ మొదలైన మహనీయుల రచనలు చదివి భారతీయులు ఉత్తేజం పొందారు. స్వాతంత్ర్య సముపార్జన గురించి ఆలోచించుకుంటూ, తర్జన భర్జనలు చేయసాగారు. విదేశ పరిపాలననుంచేకాక ఛాందస ఆచారాలనుంచి కూడా ప్రజలకు విముక్తి కలిగించాలని దేశంలో తహతహ బయలుదేరింది.

మనదేశంలో ఆ రోజులలో స్త్రీలను చాలా నికృష్టంగా చూసేవారు. సతీ సహగమనాన్ని నిలుపుచేయడానికి కొందరు మహనీయులు ఎలా పాటుపడిందీ తెలుసుకొన్నాం. ఇదేకాక ఇంకా అనేక రకాల ఇడుములకు స్త్రీలు లోనవుతూ ఉండేవారు. కన్ను తెరవని లేత వయస్సులోనే బాలికలకు పెళ్ళిళ్ల జరిగేవి. పెనిమిటి పోతే ఆజన్మాంతమూ వితంతవులై దుర్భరమైన యాతనలు

పడవలసివచ్చేది. ఆడపిల్లలకు చదువు చెప్పడం క్షమించరాని నేరంగా భావించేవారు. పాశ్చాత్యభావాల ప్రభావంవల్ల ఈ పరిస్థితులు క్రమంగా మార్పుచెందాయి. బాలికలకోసం పాఠశాలలు ప్రారంభించబడ్డాయి.

విద్యావంతులైన భారతీయులు కొందరు మన మతాన్ని గురించి కూలంకషంగా ఆలోచించి దానికి సంబంధించిన అనుష్ఠానం వీలయినంత సులువుగా, సుబోధకంగా ఉండేట్టు మార్చాలని అభిప్రాయపడ్డారు. అర్థంలేని ఆచారాలు, ఆడంబరమైన కర్మకాండలు తొలగించి వేయడం అవసరమని భావించారు. ఈవిధంగా ఆలోచించి అనుష్ఠానాదికాలలో సంస్కరణలు తేవడానికి ప్రయత్నించిన మహనీయులలో రాజా రామమోహనరాయ్ ఒకరు. ఈ ఆశయంతోనే రాజా రామమోహనరాయ్ బ్రహ్మసమాజాన్ని స్థాపించారు. ఆయనను గురించి మరికొంత ఉత్తరోత్తరా తెలుసుకుందాము.

మనదేశంలో ఈ కాలంలోనే వాడుకలోకి వచ్చిన అమూల్యమైన యంత్రాలలో ముద్రణాయంత్రం ఒకటి. ఈ యంత్రాలతో వార్తాపత్రికలను, పుస్తకాలను ప్రచురించడం ఆరంభించారు. పుస్తకాలు, పత్రికలు అచ్చుకావడంవల్ల వివిధ ప్రాంతాల ప్రజలు ఒకరి అభిప్రాయాలను ఒకరు సులువుగా తెలుసుకోవడానికి వీలుకలిగింది.

కొత్తగా అనేక జౌళి మిల్లులు, ఇతర కర్మాగారాలు దేశంలో వెలిశాయి. రైళ్లు పడినందువల్ల ఈ కర్మాగారాలకు కావలసిన ముడి సరుకును చేరవేసి, వాటిలో ఉత్పత్తి అయే వస్తువులను వివిధ ప్రాంతాలకు త్వరత్వరగా రవాణా చేయడానికి వీలుకలిగింది. ఈ ఫ్యాక్టరీల చుట్టూ వసతివాడలు, బస్తీలు వ్యాపించాయి. బొంబాయి, కలకత్తా, మద్రాసు నగరాలు ఈవిధంగా పెరిగినవే.

బ్రిటిషు ఇండియా అంతటా ఒకే విధమైన పరిపాలనా విధానాన్ని బ్రిటిషువారు ప్రవేశపెట్టారు. సైనిక పటాలాలు, పోలీసు దళాలు శాంతి భద్రతలను కాపాడేవి. పాతకాలపు పారసీక పద్ధతి న్యాయస్థానాలకు బదులు కొత్త తరహా కోర్టులు ఏర్పాటయ్యాయి. కొత్తకొత్త శాసనాలను రూపొందించి అన్ని ప్రాంతాలకు సమానంగా వర్తింపజేసారు. ఈ విధంగా భారతీయ శిక్షాస్మృతి అనే పేరుతో నూతన శాసన విధానాన్ని రూపొందించిన వ్యక్తి లార్డ్ మెకాలే. మన పాఠశాలల్లో ఇంగ్లీషు చదువును ప్రవేశపెట్టడానికి ముఖ్యకారకుడు కూడా ఈయనే.

బ్రిటిషువారు మనదేశంలో చాలాచోట్ల కొత్తగా రోడ్లు వేయించారు. కలకత్తా నుంచి పెషావరుకు వెళ్లే పాతకాలపు రహదారిని బాగుచేసి దానికి గ్రాండ్‌ట్రంక్ రోడ్డు అని పేరు పెట్టారు. ఇది మనదేశంలో ఉన్న రహదారులలోకెల్లా ముఖ్యమైనది. పంజాబు, ఉత్తరప్రదేశ్, బీహారు, బెంగాలులలోని సారవంతమైన భూములగుండా వెళ్లే ఈ పొడవైన రహదారి ఉత్తర భారతదేశంలోని ముఖ్య నగరాలన్నింటినీ కలుపుతోంది.

పాశ్చాత్యులు మనదేశంలోకి తెచ్చిన కొత్త రకాల ఆహార పదార్థాలు ఏవో మీకు తెలుసా? యూరుపునుంచి భారత్‌కు ఓడలు రావడానికి ముందు మనకు బంగాళాదుంప అంటే ఏమిటో తెలియదు. అలాగే జామ, టొమాటో, బొప్పాయి, వేరుశనగ కూడా మనకు కొత్తవే. మిరప, మొక్కజొన్న, పొగాకు సైతం మనకు విజాతీయమైనవే. ఇవన్నీ మధ్య అమెరికాలో పండించబడి, యూరపుగుండా భారత్‌కు దిగుమతి అయ్యాయి. మనకు పొగతాగటం, తేనీరు సేవించటం యూరోపియన్లు మప్పిన అలవాట్లే. తేయాకు, కాఫీవంటి పంటలను కూడా మన దేశంలో క్రమంగా విస్తారంగా పండించడం మొదలు పెట్టారు. యూరోపియన్లవలెనే మనవారుకూడా హాట్లు, సూట్లు ధరించడం ప్రారంభించారు. ఇంగ్లీషువారి ఫక్కీలో తయారుచేసిన మేజాలు, కుర్చీలు వాడుకలోకి వచ్చాయి.

అన్ని రాష్ట్రాలలో ప్రజలు ఇంగ్లీషు నేర్చుకోవడం మొదలుపెట్టారు. దేశం అంతటా ఒకే రకమైన శాసనాలు అమలులో ఉండటంవల్లనేమి, రైళ్లు, రోడ్లు పడడటం, పుస్తకాలు, పత్రికలు రావడంవల్లనేమి, వివిధ రాష్ట్రాల మధ్య అనుబంధాలు పెరిగి ఒకరిని గురించి ఒకరు సన్నిహితంగా తెలుసుకోవడానికి వీలుకలిగింది. ఇందువల్ల దేశంలోని ప్రజలు తామంతా ఒకటేనని, ఒకే మాతృదేశపు సంతతివారమని గుర్తించసాగారు. ఈ జాతీయతా భావం ప్రజలలో రానురాను గాఢంగా పాతుకోవడంతో, భారతదేశం పుంజుకుని అంతకంతకూ బలపడసాగింది.

# నవ భారత్ అవతరణ

తిరుగుబాటును అణచివేసిన తరువాత బ్రిటిషువారు మరింతగా బలపడ్డారు. వారి మాటకు దేశంలో ఎక్కడా ఎదురులేకపోయింది. పరిపాలనా నిర్వహణలో ప్రజలను సంప్రదించవలసిన అవసరం ఇంగ్లీషువారికి కనిపించలేదు. ఇంగ్లీషువారు చేస్తున్న అనేక పనులు దేశానికి హానికరమైనవని తమకు గట్టిగా తెలిసికూడా ప్రజలు నిస్సహాయులై మిన్నకుండవలసి వచ్చింది. జాతికి స్వాతంత్ర్యం పోవడంవల్ల దేశానికి కలిగే అరిష్టాలేమిటో ప్రజలకు మెల్లమెల్లగా అర్థంకావడం మొదలుపెట్టింది.

మనలో అనేక లోపాలు ఉన్నందువల్లనే స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకుని బానిస జాతి అయినామని కూడా అనేకమంది గ్రహించగలిగారు. మన సమాజంలో దుష్టమైన వర్ణ వ్యవస్థ ఒకటి అమలులో ఉంది. ఈ వ్యవస్థలో కొందరు పుట్టుకతోనే ఉన్నతులు, మరికొందరు హీనులు అయిపోతారు. సమాజంలో హీనకులాల వారిని బాగుచేసే సాధనమేలేదు. వేలాది ప్రజలను అస్పృశ్యులుగా పరిగణిస్తూ, వారు ముట్టుకుంటేనే మైలపడిపోతామన్నట్లు పంచములను వెలివేసేవారు. మన స్త్రీల స్థితికూడా ఒకవిధంగా ఇంత హేయంగానూ ఉండేది. ఆడ పిల్లలకు పసిబిడ్డలుగా ఉండగానే మూడుముళ్లూ పడేవి. అప్పటిలో దేశంలో చదువు సంధ్యలు నేర్చిన వారు చాలా తక్కువ. ఇంగ్లీషు చదువులు ప్రారంభమైనప్పటికీ, దారిద్ర్యంవల్ల, కుల కట్టుబాట్లవల్ల కొట్లాది ప్రజలు చదువుకోవడానికే నోచుకోలేకపోయారు.

ముందుగా సమాజంలో పేరుకుపోయిన ఈ కుళ్లును కడిగివేస్తేనే తప్ప భారతజాతి మళ్లీ బలిష్టమై నిలవదొక్కుకొనే అవకాశం ఉండదు. అందువల్ల ఆ యుగంలో జీవించిన మహాపురుషులు సాంఘిక దురాచారాల నిర్మూలన కోసం జీవితాలను అంకితంచేసి సర్వశక్తులా అందుకు పాటుపడ్డారు.

ఈ రకమైన ఆలోచనలతో ఉద్యమించి ప్రజల మనస్సులో గొప్ప మార్పు తెచ్చిన మొదటి వ్యక్తి రాజా రామమోహనరాయ్. సమాజానికి ఆయనచేసిన సేవనుబట్టి దేశమంతటా ఆయనపేరు ప్రఖ్యాతలు వ్యాపించాయి. పాశ్చాత్యులలో ఉన్న మంచిని భారతీయులు



రామమోహనరాయ్ భావాలు బ్రిటిష్‌వారు భారతీయులను భిన్న దృక్కోణం నుంచి చూసేలా చేసాయి

నిస్సంకోచంగా స్వీకరించాలని రామ మోహన రాయ్ ఉద్బోధించారు.

## రాజా రామా మోహన రాయ్

రామ మోహన రాయ్ వంగదేశంలో ఒక ఛాందస బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. ముక్కు పచ్చలారని ఈడులోనే ఆయనకు వివాహం జరిగింది. తనచేత చేయించిన నాటి తంతుకు అర్థం ఏమిటో ఆ బాలుడికి అంతుపట్టలేదు. తండ్రిని అడిగే ధైర్యం కూడా అతనికి లేకపోయింది. ఏమైనా తమ కులంలో పిల్లలకు చిన్నప్పుడే పెళ్ళిచేయడం ఆచారంగదా మరి!

చదువులో చిన్నప్పటినుంచి రామ మోహన రాయ్‌దే అగ్రతాంబూలం. పారసీకం, సంస్కృతం, అరబ్బీ భాషలను ఆయన పుక్కిటపట్టాడు. 20 ఏళ్లు వచ్చిన తరువాత ఇంగ్లీషు నేర్చుకోవడం మొదలుపెట్టాడు. ఇటు వేదాలను, ఉపనిషత్తులను, అటు బైబిలును, కురాన్‌ను గట్టిగా మథించాడు. అన్ని మతాలూ ఒకే సత్యాన్ని బోధిస్తాయని గ్రహించాడు. సమాజం పాటించే దురాచారాలను దుష్ట సంప్రదాయాలను మనసారా ఏవగించుకొన్నాడు. ముఖ్యంగా సతీ సహగమనాన్ని ఆయన తీవ్రంగా ద్వేషించేవాడు. ఇందుకొక ప్రత్యేకమైన కారణం కూడా ఉంది. విధివశాన పెనిమిటి మరణించి తన ప్రియ సోదరి వితంతువైంది. ఆనవాయితి ప్రకారం భర్త శవంతోబాటు ఆమెను కూడా చితి ఎక్కించి సజీవంగా దహనం చేశారు. ఈ ఘోరం రామ మోహన రాయ్ కళ్ళ ముందే జరిగింది. దానితో ఆయన జీవితంలో గొప్ప మార్పు వచ్చింది. బ్రిటిషువారికింద తాను చేస్తున్న పెద్ద ఉద్యోగాన్ని కాలదన్ని, సంఘ సంస్కరణకు తన జీవితాన్ని అర్పించాలని తక్షణమే నిర్ణయించుకున్నాడు. నాటినుంచి అవిశ్రాంతంగా ఆయన సాగించిన ఉద్యమం ఫలించి, సహగమనం చట్టవిరుద్ధమని చివరికి ప్రభుత్వమే శాసనం చేసింది. ఘోరమైన ఈ దురాచారాన్ని ఖండిస్తూ రచనలు చేయడంలో, ఉపన్యాసాలు ఇవ్వడంలో రామ మోహన రాయ్ నిద్రాహారాలు కూడా మరచి దీక్షతో కృషిచేశాడు. ఇదేగాక ఇంకా అనేక ఇతరమైన దురాచారాలు కూడా ఆయన తీవ్ర విమర్శకు గురిఅయ్యాయి. తన సంస్కరణల ఉద్యమంవల్ల రామ మోహన

రాయ్ సమాజంలో అప్రతిష్ఠపాలు కావలసివచ్చింది. ఎందువల్లనంటే ఆ కాలంలో ప్రజాసామాన్యానికి మార్పు అనగానే ఏదో చెప్పరాని భయము, జంకు కలిగేవి. ఇంగ్లీషు చదువు చదివినవారంటే ప్రజలకు చెప్పరానంత అపనమ్మకం ఉండేది. అండగా నిలిచిన మిత్రులందరూ ఒక్కరొక్కరే పరిత్యజించి ఒంటరిగా చేసిపోయినా ఏమాత్రమూ లెక్కచేయకుండా రామ మోహన రాయ్ తన ఒక్క చేతిమీదుగానే సంఘసంస్కరణ ఉద్యమం సాగిస్తూ వచ్చారు.

విగ్రహారాధన, కర్మకాండలు లేకుండా భగవదారాధన చేసే పద్ధతి ప్రచారంలోకి తేవాలని రామ మోహన రాయ్ ఆశయం. ఇందుకోసం బ్రహ్మసమాజం అనే పేరుతో హిందూమతంలో ఆయన ఒక కొత్త శాఖను ప్రారంభించారు. ఏ కులానికి చెందిన వారైనా బ్రహ్మసమాజంలో చేరవచ్చు. కలకత్తాలో కాళికాలయంలో చేస్తున్నట్లు జంతువులను బలియివ్వడంగానీ, విగ్రహాలను, చిత్రపటాలను ఆరాధించడంగానీ బ్రహ్మసమాజంలో నిషిద్ధం.

ఇంగ్లండుకు వెళ్ళిన తొలి భారతీయులలో రామ మోహన రాయ్ ఒకరు. ఢిల్లీ చక్రవర్తి రామ మోహన రాయ్‌కి రాజా అనే బిరుదాన్ని ప్రసాదించాడు. ఆయనే రామ మోహన రాయ్‌ని ఇంగ్లండుకు ప్రయాణం చేయించి పంపాడు. సముద్రం దాటి విదేశాలకు వెళ్లినా, విజాతీయులతో కలిసి భోజనం చేసినా కులభ్రష్టులవుతారని పూర్వాచార పరాయణుల అభిప్రాయం. కాని అలాంటి వారి అభిప్రాయాలను రామ మోహన రాయ్ లక్ష్యపెట్టలేదు. తన తోటి దేశీయులకు కొన్ని హక్కులివ్వవలసిందని ఇంగ్లీషువారిని ఒత్తిడి చేయడానికి తానీ ప్రయాణం తలపెట్టినప్పుడు ఇలాంటి బెదిరింపులను లెక్క చేయకూడదని ఆయన నిశ్చయించుకున్నాడు. భారతీయులకు తమ స్వదేశంలోనే ఉన్నతపదవులు లభించడంలేదు. ఈ విషయమై ఇంగ్లండులోని అధికారులతో అమీ తుమీ తేల్చుకోవాలని ఆయన పట్టుదల. వారితో కండబలంతో కత్తియుద్ధంకాక ప్రతిభతో వాగ్యుద్ధం చేశాడు. ఆయన మాటలు విన్న తరువాత బ్రిటిషువారికి భారతీయులంటే కొంత మనసు మారింది.

అయితే రామ మోహన రాయ్ స్వదేశానికి తిరిగిరాలేదు. పనిపూర్తిచేసుకుని భారత్‌కు బయలుదేరుదామనుకుంటున్న సమయంలో జబ్బుపడి ఇంగ్లండులోనే కాలధర్మం చెందారు.

## దయానంద సరస్వతి

రామ మోహన రాయ్ తరువాత ప్రజ్ఞావంతులు, సమర్థులు అయిన మహాపురుషులు

మరికొందరు ఉదయించారు. అట్టివారిలో ఒకరైన దయానంద సరస్వతి కథియవాడ్‌లో జన్మించారు. రామ మోహన్ రాయ్ వలెనే దయానంద సరస్వతికి కూడా విగ్రహారాధన రుచించలేదు. చిట్టెలుకలను కూడా విచ్చలవిడిగా మీద తిరుగనిచ్చే ఒక రాతివిగ్రహంలో దేవుడుంటాడా అని ఆయన పరిహసించేవారు. దయానంద సరస్వతి కూడా మతాన్ని పూజా విధానాన్ని సుకరం చేయడానికి ప్రయత్నించాడు. ఇందు నిమిత్తం ఆయన ఆర్యసమాజాన్ని నెలకొల్పారు. అనేకమంది ఆ సమాజంలో సభ్యులుగా చేరారు.

## రామకృష్ణ పరమహంస

మరో మహనీయుడు రామకృష్ణ పరమహంస. వీరు జన్మించింది బెంగాలులో. పండితుడు కాకపోయినా ఆయన గొప్పజ్ఞాని. చిన్నతనం నుంచే మహాభక్తుడు. కొంత వయస్సురాగానే, తాను ఏమిచేస్తున్నా ఎక్కడ ఉన్నా ఎప్పుడూ ఈశ్వరసాన్నిధ్యంలోనే ఉన్నట్లు అనుభూతి పొందుతూ, తన్మయం చెందేవారు. కలకత్తా సమీపంలో ఒక చిన్న దేవాలయంలో అర్చకుడుగా పనిచేసేవారు. అన్ని వర్ణాలవారిని, అన్ని మతాలవారిని సమానంగా గౌరవించేవారు. అనేక పర్యాయాలు పంచములతో సహపంక్తిన భుజించాడు. అన్ని మతాలూ ఒకే సత్యాన్ని ప్రబోధిస్తాయని పరమహంస విశ్వాసం. ప్రాచీన కాలంలో మహర్షులవలె పరమహంస కూడా, ''పండితులు వేర్వేరు పేర్లతో పిలిచినప్పటికీ, ఈశ్వరుడు ఒక్కడే''నని చాటి చెప్పారు. పుట్టుకవల్ల బ్రాహ్మణులే అయినా ఒకప్పుడు మహమ్మదీయుడుగాను, మరొకప్పుడు క్రైస్తవుడుగాను జీవించి, వివిధ మతాల సారాన్ని పుణికి పుచ్చుకొన్నారు. పవిత్రంగా జీవిస్తూ, సరళమైన భాషలో ఉదాత్తమైన సత్యాలను ప్రవచిస్తూ, కోటానుకోట్ల ప్రజలను మంత్రముగ్ధం చేశారు. త్వరలోనే పరమహంసను మహర్షిగా గుర్తించి ప్రజలు ఆయనకు బ్రహ్మరథం పట్టారు.

## వివేకానందుడు

రామకృష్ణ పరమహంసకు అనంతమైన శిష్యకోటి ఉండేది. వారిలో స్ఫురద్రూపి, విద్యావంతుడు అయిన యువకుడొకడు ఉండేవాడు. ఈ యువకుడే తరువాత వివేకానందస్వామిగా జగత్ప్రసిద్ధుడయ్యాడు.

తాను గురు ముఖతః విన్న బోధామృతాన్ని ప్రజలందరికి పంచిపెట్టాలని వివేకానందుని అభిలాష. భారతదేశంలోనే కాక అనేక విదేశాలలో కూడా పర్యటించి పరమహంస బోధలను

ఆయన ప్రచారం చేశారు. పరమహంస శిష్యులు అందరూ మానవ శ్రేయస్సు కోసం కలిసి కృషి చేసేందుకుగాను వివేకానందుడు రామకృష్ణమిషన్ అనే సంస్థను కూడా స్థాపించారు. వివేకానందుని ఉపన్యాసాలు విని, రచనలు చదివి తనగత చరిత్ర ఎంత ఉజ్వలమైనదో భారతీయులు గ్రహించి గర్వించసాగారు. పూర్వకాలంలో ఎంతో ఉన్నతి పొందిన భారతజాతి తుదకు అజ్ఞానంతో, దారిద్ర్యంలో అల్లాడిపోతున్నందుకు వివేకానందుని హృదయం తపించిపోయింది. భారతజాతి సుషుప్తి నుంచి మేల్కొని కార్యరంగంలో ఉరికి విజ్ఞానం అన్వేషించాలని ఆయన ఉద్బోధించారు. వివేకానందుడు ఎక్కువకాలం జీవించలేదు. 39 ఏళ్ళ వయస్సులోనే ఆయన అవతారం చాలించారు.



*పేదలకు సేవ చేయటమే అత్యుత్తమ మతమని వివేకానందుడు బోధించాడు*

సమాజాన్ని స్వాతంత్ర్యోన్ముఖంగా నడిపించిన ఆనాటి భారతీయ మహనీయులను గురించి పెద్ద వారయిన తరువాత ఇంకా విపులంగా తెలుసుకుందురుగాని. పైన చెప్పిన వారితోబాటు ఈశ్వరచంద్ర విద్యాసాగార్, బంకించంద్ర ఛటర్జీ, మహాదేవ గోవింద రెనడే, కేశవ్ చంద్రసేన్, సయ్యద్ అహమ్మద్‌ఖాన్ వంటి ప్రముఖుల పేర్లను కూడా ఇక్కడ స్మరించుకోవలసి ఉంది.

# దేశంలో స్వాతంత్ర్య పిపాస

ఇంతకుముందు చెప్పిన మహాపురుషుల బోధనలు ప్రజలలో క్రమంగా వ్యాపించి, స్వాతంత్ర్య పిపాసను రేకెత్తించాయి. పూర్వం సిరిసంపదలకు, విజ్ఞానానికి ప్రపంచమంతటా పేరెన్నికగన్న భారతదేశాన్ని దాస్య విముక్తం చేసి మళ్లీ బలీయమైనదిగా, జ్ఞానసంపన్నమైనదిగా తీర్చిదిద్దలేమా అన్న జిజ్ఞాస ప్రజలలో బయలుదేరింది.

భారతీయులకంటె అన్ని విధాలా తాము గొప్పవారమని అహంకరిస్తూ మన దేశప్రజలను చిన్న చూపు చూడటం బ్రిటిషువారికి పరిపాటి అయింది. జడ్జీలుగా ఉన్న భారతీయులకు తమ కేసులు విచారించే అధికారం లేదని బ్రిటిష్ జాతీయులైన నేరస్తులు ధిక్కారం చేసేవారు. అన్ని రైళ్ళలో బ్రిటిషువారి కోసం ప్రత్యేకంగా రైలు పెట్టెలుండేవి. తమతో సాటిగా భారతీయులను కలిసి మెలగనిచ్చేవారు కాదు. ప్రభుత్వంలో ఉన్నతోద్యోగాలు భారతీయులకు అందని మానిపండ్లుగా ఉండేవి. తమ ఆధిక్యతను ఇంకా ఎన్నెన్ని విధాలుగా చాటుకోవడానికి వీలుందో అన్ని విధాలా వారు చాటుకొనేవారు. ఇదంతా మన ప్రజల మనస్సుకు కష్టం కలిగించింది. కాని బలహీనతవల్ల, పిరికితనంవల్ల కిక్కురుమనలేకపోయారు. కొద్దిమంది మాత్రమే పెదవిమెదిపి అధిక్షేపణ తెలపడానికి సాహసించేవారు.

పైకి మాత్రం దేశంలో పరిస్థితులు పూర్తిగా ప్రశాంతంగా ఉన్నట్లు కనిపించేది. కాని అడుగున అశాంతి సుడులు తిరిగేది. ఇలా ఉండగా నాటి అగ్రనాయకులు ఒక ప్రజా సంస్థను ఏర్పాటుచేసి, ఆ సంస్థ ద్వారా భారతీయుల మనోభావాలను బ్రిటిష్‌వారికి వ్యక్తపరుస్తూ ఉండాలని నిశ్చయించుకున్నారు. ఈ ఉద్దేశ్యంతోనే భారత జాతీయ కాంగ్రెసు నెలకొల్పబడింది. కాంగ్రెసుకు మొదటి అధ్యక్షుడు ఉమేశ్ చంద్రబెనర్జీ. ఇక ఈ సంస్థకు మొదట కార్యదర్శిగా పనిచేసిన వ్యక్తి అలన్ ఆక్టేవియన్ హ్యూం అనే బ్రిటిష జాతీయుడని చెబితే ఆశ్చర్యం కలగవచ్చు. భారతదేశాన్ని నిజంగా ప్రేమించిన ఇంగ్లీషువారు ఆ కాలంలో కూడా కొందరు లేకపోలేదు. అట్టివారిలో ఆయన ఒకరు. మన దేశం యోగక్షేమాలకోసం ఆయన చాలా కృషి చేశారు. తమ దేశ వ్యవహారాలను సరిదిద్దుకోవడంలో భారతీయులకు తగిన పాత్ర

ఇవ్వాలని ఆయన ఉద్దేశపడ్డారు.

పోలీసుశాఖ ఖర్చులు తగ్గించివేసి స్కూళ్లు, ఆసుపత్రుల మీద ఎక్కువగా సొమ్ము ఖర్చుపెట్టాలని కాంగ్రెసు కోరింది. స్థానిక పరిపాలనా సంస్థలకు ప్రభుత్వమే సభ్యులను నియమించే పద్ధతికి స్వస్తిచెప్పి, ప్రజలు వారిని ఎన్నుకొనే ఏర్పాటు చేయాలని కూడా కాంగ్రెసు పట్టుబట్టింది. ప్రజల విశ్వాస పాత్రులైన ప్రతినిధులకు నిర్ణయాధికారం అప్పగిస్తేనే తప్ప లేకపోతే భారతదేశం కలకాలం పేదరికంతో బాధపడవలసి ఉంటుందని కాంగ్రెసుకు గట్టి నమ్మకం కలిగింది.



భారతీయులు దాదాభాయ్ నౌరోజీని ప్రేమించేవారు. ఆయనను ''మహోన్నత వృద్ధుడు'' అని పిలిచేవారు

## దాదాభాయ్ నౌరోజీ

ఆ రోజులలో కాంగ్రెసుకు ప్రముఖ నాయకుడు దాదాభాయ్ నౌరోజీ. ఆయన బొంబాయి వాస్తవ్యుడు. స్వవిషయాలను మరచి అహోరాత్రాలు దేశశ్రేయస్సుకోసమే ఆరాటపడుతూ పోరాడుతూ ఉన్నందువల్ల నౌరోజీ అంటే ప్రజలకు అపారమైన గౌరవాదరాలు ఉండేవి. భారతీయులు దుర్భరమైన దరిద్రాన్ని అనుభవిస్తూ ఎంతటి దీనస్థితికి దిగజారిందీ తన రచనల ద్వారా, ఉపన్యాసాలద్వారా కనులకు కట్టేట్టు చిత్రించేవారు. ఈ పేదరికానికంతకూ విదేశీపరిపాలనమే కారణమని కూడా ఆయన నిరూపించారు. నౌరోజీ కారుణ్యాము, ఋజుత్వము చూసి ఇంగ్లీషువారు కూడా ముగ్ధులై ఆయనను తమ మిత్రులుగా పరిగణించేవారు. చివరికి బ్రిటిషు పార్లమెంటుకు సభ్యుడుగా కూడా ఆయన ఎన్నుకోబడ్డారు. బ్రిటన్ భారతీయులకు వెంటనే మరికొన్ని అధికారాలివ్వాలని నౌరోజీ పార్లమెంటులో ఉద్ఘాటించారు. ఏడు దశాబ్దాలు అవిరళంగా ప్రజలకు నౌరోజీ సేవచేశారు. ప్రజలు మక్కువతో ఆయనను వృద్ధపితామహుడని పిలుచుకునేవారు. దాదాభాయి నౌరోజీ కాంగ్రెసు సంస్థకు మూడుసార్లు అధ్యక్షులుగా ఎన్నిక అయ్యారు. చనిపోయే నాటికి నౌరోజీ 92 ఎండ్ల పండు ముసలి. భారత్‌కు స్వరాజ్యమే ధ్యేయమని కాంగ్రెసు అధ్యక్షపీఠం నుంచి ఆయన ఎలుగెత్తి చాటారు.

## వైస్రాయిలు

భారతదేశ పరిపాలన ఈస్టిండియా కంపెనీ నుంచి బ్రిటిషు చక్రవర్తికి బదిలీ అయిన తరువాత, గవర్నరు జనరలే వైస్రాయి అయ్యారు. మామూలుగా వైస్రాయిలు అయిదేళ్లు పని చేసేవారు. మన దేశంలోని మొదటి వైస్రాయి లార్డ్ కానింగ్. ఆయన పదవీ స్వీకారం చేసిననాటికే దేశంలో అన్ని ప్రాంతాలూ బ్రిటిషువారి అధీనంలోకి వచ్చాయి. ఇక ఇంగ్లీషువారు మన దేశంలో కొత్తగా ఆక్రమించుకోగలిగిన ప్రాంతమంటూ ఏదీ లేదు.

బయట నుంచి దాడి జరుగకుండా సరిహద్దులవద్ద కాపలా పెట్టడం తప్పితే, దేశంలో మరి ఎవరితోనూ పోరు జరుపవలసిన అవసరం వారికి లేకపోయింది. అదివరకు భారత్ మీద జరిగిన దండయాత్రలన్నీ కైబరు కనుమగుండానే జరిగి ఉన్న విషయం ఎరిగినదే. అందువల్ల ఈ కనుమను తమ అధీనంలోకి తెచ్చుకోవాలని బ్రిటిషువారు అభిలాషపడ్డారు. కైబరు కనుమ అఫ్ఘనిస్థాన్‌లో ఉన్నది కనుక అఫ్ఘనిస్థాన్ అధిపతిని సైతం గుప్పిట పెట్టుకోవాలని బ్రిటిషువారు చూశారు. ఇందుకోసం వారు మూడుసార్లు యుద్ధాలు చేయవలసివచ్చింది. వీటికే ఆఫ్ఘన్ యుద్ధాలని పేరు.

ప్రభుత్వం అంతకంతకూ బలపడతూ వచ్చినప్పటికీ, దేశ పరిపాలన యావత్తూ భారతీయుల శ్రేయస్సు కోసం కాక బ్రిటిషువారి ఐశ్వర్య సౌభాగ్యాల అభివృద్ధి కోసమే ప్రధానంగా నిర్వహించబడేది. దేశంలో కరువుకాటకాలు తరచుగా రాసాగాయి. ఏటా వేలాది జనం ఆకలితో చనిపోయేవారు. ఇది చాలదన్నట్లు భారత్‌లో మొదటిసారిగా పెక్కు ప్రాంతాలలో ప్లేగు వ్యాపించి అనేక నిండు ప్రాణాలను పొట్టన పెట్టుకుంది.

## రిప్పన్

భారతదేశానికి మిత్రులుగా మన్నన పొందిన వైస్రాయిలు కొందరు ఉండేవారు. వారిలో లార్డ్ రిప్పన్ ఒకరు. స్థానిక పరిపాలనలో భారతీయులకు ఆయన కొన్ని బాధ్యతలు అప్పగించారు. భారత్‌లో ఇంగ్లీషువారి కేసులు విచారించడానికి బ్రిటిషు న్యాయమూర్తులతో ప్రత్యేక న్యాయస్థానాలు ఏర్పాటుచేయడం మంచిది కాదని ఆయన అభిప్రాయపడ్డారు. ఈ పద్ధతిని నిలిపివేయడానికి ఆయన ప్రయత్నించారు.

## కర్జన్

మరొక ప్రఖ్యాత వైస్రాయి లార్డ్ కర్జన్. మన పురాతన చరిత్ర అన్నా, శిథిలాలు, స్మారక చిహ్నాలన్నా ఆయనకు చాలా ఆసక్తి ఉండేది. కాని బెంగాలు రాష్ట్రాన్ని రెండుగా విడగొట్టినందుకు ఆయన అపఖ్యాతి పాలయ్యారు. ఈ విధంగా విడగొట్టిన ప్రాంతాలలో ఒకదానిలో ముస్లింలు ఎక్కువగా, రెండవదానిలో హిందువులు అధిక సంఖ్యాకులుగా ఉండేవారు. బెంగాలును ముక్కలు చేయడం బెంగాలీలకు ఏమాత్రము నచ్చలేదు. సమైక్య బహిష్కరణ ద్వారా తమ అధిక్షేపణ ముఖ్యంగా తెలియజేశారు. స్వదేశీ సరకులనే వాడవలసిందని ప్రజలకు బోధించారు. ఈ పోరాటానికి నాయకత్వం వహించిన ప్రముఖ నాయకుడు శ్రీ అరవిందఘోష్. తరువాత ఆయన సన్యసించి యోగి అయ్యారు.

బెంగాలును విభంజించడంలో లార్డ్ కర్జన్ తప్పు చేశాడని దరిమిలా బ్రిటిషువారు అంగీకరించి, ఆ రాష్ట్రాన్ని మళ్లీ ఒకటిగా కలిపివేశారు. ఆ కాలంలోనే రాజధానిని కలకత్తా నుంచి పురాతన భారతీయ చక్రవర్తులకు చిరకాల పీఠమైన ఢిల్లీకి తరలించడం జరిగింది.

## సంస్కరణలు

పరిపాలనా నిర్వహణలో ప్రజలకు మరింతగా అధికారాలు ఇవ్వాలని భారతీయులు సాగిస్తున్న ఆందోళనకు బ్రిటిషువారు చివరికి తలఒగ్గక తప్పలేదు. ఆయా రాష్ట్రాల శాసనసభలలో అదివరకన్న ఎక్కువమంది భారతీయులను పాల్గొననిచ్చారు. బ్రిటిషువారు కలుగజేసిన ఈ కొత్త రాయితీలకు మింటో-మార్లే సంస్కరణలని పేరు. నాటి వైస్రాయి లార్డ్ మింటో, అప్పుడు బ్రిటిష ప్రభుత్వంలో భారతదేశ వ్యవహారాలను పర్యవేక్షిస్తున్న లార్డ్ మార్లే కలిసి ఈ సంస్కరణలను రూపొందించడంవల్ల వీటికీపేరు వచ్చింది. అయితే కాంగ్రెసులో అనేకమంది ఈ సంస్కరణలు ఎంతమాత్రం చాలవని భావించారు. స్వయం పరిపాలన సాధించాలంటే విజ్ఞప్తులు, మహజర్లు సమర్పించుకుని లాభం లేదని, అందుకు గట్టి చర్యలేవైనా తీసుకోవాలని అభిప్రాయపడ్డారు. ఈ వర్గానికి చెందిన ప్రముఖులలో బాలగంగాధర్ తిలక్ అగ్రగణ్యులు.

# పూనేలో ఇద్దరు మహాపురుషులు

## తిలక్ - గోఖలే

చిన్నతనం నుంచే బాలగంగాధర్ తిలక్‌లో చురుకుపాలు ఎక్కువ. క్లాసులో మాస్టరు ఏదైనా లెక్కయిచ్చి కూర్చున్నారో లేదో జవాబిది అంటూ వెంటనే బైటికి చెప్పేసేవారు. ఈ చిచింద్రీ తొందరపాటుకు చికాకు కలిగినా, ఉపాధ్యాయులు ఆయన తెలివితేటలకు, సమయస్ఫూర్తికి ఎంతో మెచ్చుకునేవారు. తిలక్ చురుకైనవాడే కాక అబద్ధంఆడి ఎరుగనివాడు. స్నేహితుల విశ్వాసానికి పాత్రుడై, వారి మనస్సును చూరగొనేవాడు. ఒకవేళ ఇతరులు చేసిన తప్పులకు తానే చీవాట్లు తినవలసివచ్చినా కిమ్మనకుండా ఊరుకునేవాడేగాని తప్పుచేసింది మరొకడని బయిటికి పొక్కేవాడు కాదు.

తిలక్ దీక్షతో విద్యాభ్యాసం చేసి గొప్ప పండితుడయ్యాడు. ఆయన సంస్కృతంలో నిధి. గొప్ప గణితశాస్త్రవేత్త. అన్నిటినీ మించి దేశభక్తి పరాయణుడు. కాంగ్రెసులో సభ్యుడుగా చేరి భారత్‌కు స్వతంత్రం వచ్చేదాకా తాను విశ్రమించనని దీక్ష వహించారు.



''స్వాతంత్ర్యం నా జన్మహక్కు నేను దానిని సాధిస్తా'' నన్నారు బాలగంగాధర తిలక్

ఆ కాలంలోనే పాండిత్యంలోనేమి, దేశభక్తిలోనేమి తిలక్‌కు సాటివచ్చే మరోవ్యక్తి ఉండేవాడు. ఈయన పేరు గోపాల కృష్ణ గోఖలే. చిన్నప్పుడు గోఖలే ఒకసారి దాదాభాయి నౌరోజీ ప్రయాణం చేస్తున్న గుర్రపుబగ్గీ వెనుక తాను కూడా చాటుగా ఎక్కి వెళ్లి కాంగ్రెసు సభలకు హాజరయ్యాడు. తిలక్‌వలెనే గోఖలేకుకూడా దేశ శ్రేయస్సే

పరాయణంగా ఉండేది. ఇద్దరూ క్రమంగా ఆప్తమిత్రులయ్యారు. ఇద్దరూ పూనేలోనే ఉండేవారు. ఒకే కళాశాల సమీపంలో నదిఒడ్డున వ్యాహాళికి వెళ్లి ఇద్దరూ దేశవ్యవహారాలు చర్చించుకొనేవారు. ఇరువురు గాఢ స్నేహితులే అయినా స్వాతంత్ర్య సముపార్జనకు అనుసరించవలసిన మార్గం విషయమై వారికి ఏకీభావం కుదరలేదు. తిలక్ కార్యవాది. తలపెట్టింది తక్షణం సాధించాలని తహతహలాడేవారు. గోఖలే తొందరపాటు కూడదని సలహా ఇచ్చేవారు. బ్రిటిషువారికి నచ్చజెప్పి దేశానికి స్వాతంత్ర్యం ఇచ్చేటట్టు ఒప్పించవచ్చునని, వారితో ఎదిరించి పోరాడనవసరం లేదని గోఖలే మతం.

దేశంలో కొందరు తిలక్ పక్షమైతే, మరికొందరు గోఖలేను బలపరిచేవారు. దీనితో కాంగ్రెసు రెండు వర్గాలుగా చీలింది. ఇరు పక్షాలవారిదీ ధ్యేయం ఒకటే గాని, స్వాతంత్ర్య సాధనకు వేరువేరు విధానాలను వారు అవలంబించదలచారు. లాలా లజపతిరాయ్, బిపిన్ చంద్రపాల్, తిలక్ ఒక వర్గం. అందువల్ల వీరని లాల్-బాల్-పాల్ వర్గం అని పిలిచేవారు. పోతే దాదాభాయి నౌరోజీ, ఫిరోజ్‌షా మెహతా, సురేంద్రనాథ్ బెనర్జీ, గోఖలే రెండవ వర్గానికి చెందినవారు. ఈ మహాపురుషుల పేర్లు మీకు కరతలామలకం కావాలి. వారు అనుసరించిన మార్గాలు భిన్నమైనప్పటికీ వీరందరూ సాటిలేని దేశభక్తులు.

భారతదేశానికి స్వాతంత్ర్యం కావాలని మొదటగా స్వాతంత్ర్య సమర శంఖాన్ని పూరించిన మహాశయుడు తిలక్. ''స్వరాజ్యం నా జన్మ హక్కు. ఆ హక్కు సాధించి తీరుతా'' అని తిలక్ ఎలుగెత్తి చాటారు. అనర్గళంగా ఉపన్యసిస్తూ శ్రోతలను ఉర్రూతలూగించే వక్త ఆయన. తిలక్ ఉపన్యాసాలు వినడానికి ఇసుక వేస్తే రాలకుండా జనం వచ్చేవారు. ఆయన ఉపన్యాసాలను విన్న లక్షలాది ప్రజలు ''స్వరాజ్యం మా జన్మ హక్కు'' అని ఐక్యకంఠంతో ప్రతిధ్వానం చేసేవారు. బహిరంగంగా ఇట్టి ఉపన్యాసాలు చేస్తున్నందుకు అధికారులు ఆయనను అనేక పర్యాయాలు జైలులో పెట్టారు. కాని తిలక్‌కు ''నా'' అన్న చింత ఉండేదికాదు. ''కేసరి'' అనే పత్రిక నడుపుతూ తద్వారా దేశప్రజకు కర్తవ్య బోధచేసేవారు.

ఎంత మేధావంతులైనా కొద్దిమంది వ్యక్తులు కలిసి స్వాతంత్ర్యాన్ని సాధించలేరని తిలక్ అభిప్రాయం. అందువల్ల ప్రజా బాహుళ్యాన్ని కార్యోన్ముఖం చేయడానికి నడుము బిగించారు. తిలక్ తమ పట్టణంలో శివాజీ ఉత్సవాలంటూ ప్రారంభించారు. ఈ ఉత్సవాలలో ప్రజలు అసంఖ్యాకంగా పాల్గొని శివాజీ వీరకృత్యాలను సంస్మరించుకుంటూ తన్మయులు

అయ్యేవారు. సామూహికంగా గణపతి పూజలు జరిపే ఆచారాన్ని కూడా ఆయన ఏర్పరచారు. ఈ ఉత్సవాలు రోజుల తరబడి సాగేవి. తీర్థప్రజగా జనం వచ్చి, భారతజాతి పూర్వపు ఔన్నత్యం గురించి, స్వాతంత్ర్య సంపాదనకు దీక్ష వహించవలసిన అవసరం గురించి, ప్రముఖ రాజకీయ నాయకులు, విజ్ఞులు ఆ సందర్భంలో చేసే ఉపన్యాసాలను తన్మయులై వినేవారు.

బ్రిటిషువారు దేశం విడిచిపోవాలని ప్రచారం చేసినందుకు తిలక్‌కు ఒకసారి ఆరేళ్ళ శిక్ష పడింది. తిలక్‌ను దేశంలోనే నిర్బంధించి ఉంచితే తమకు ఏమి ముప్పు ముంచుకు వస్తుందోనని భయపడి అధికారులు ఆయనను బర్మాకు బదిలీచేశారు. కారాగారంలో ఒంటరిగా కష్టాలుపడుతూ దీర్ఘకాలం నివసించినందువల్ల తిలక్ ఆరోగ్యం దెబ్బతిన్నది. ముదిమితోబాటు అనారోగ్యం ఏర్పడటంతో శరీరం దుర్బలమైపోయింది. కాని ఆయన ఉత్సాహానికి మాత్రం ముదిమి రాలేదు, బర్మాలో తిలక్ ఆరేళ్ల జైలులో ఏకాంతవాసం చేయవలసివచ్చింది. స్నేహితులను కూడా జైలుకెళ్లి ఆయనను చూడనిచ్చేవారు కాదు. అయితే తమ ఆప్తమిత్రులైన పుస్తకాలతో నిత్యసహవాసం చేసేవారు. జైలులో ఉండగానే ఆయన భగవద్గీతా సారాన్ని వివరిస్తూ, ''గీతా రహస్యం'' అనే పేరుతో గొప్ప గ్రంథం రచించారు. తిలక్ వీరోచితంగా సాగించిన స్వాతంత్ర్య పోరాటానికి చిరస్మరణీయులైనట్లే, ''గీతా రహస్య'' రచనకు కూడా ప్రాతః స్మరణీయులైనారు.

తిలక్ కంటే ప్రవృత్తివల్ల గోఖలే భిన్నమైన వ్యక్తి. పైకి హడావుడి లేకుండా చాపకింద నీరులా పని చేసుకుపోవాలని ఆయన అభిమతం. ''సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీ'' అనే పేరుతో గోఖలే ఒక సంస్థను స్థాపించారు. తమ జీవితాలను సంఘసంస్కరణకు అంకితం చేయదలచిన వ్యక్తులను మాత్రమే ఈ సొసైటీలో సభ్యులుగా చేర్చుకునేవారు. దేశభక్తిలో గోఖలే ఏ మహనీయునికీ తీసిపోరు. స్వాతంత్ర్యం కోసం ఇతర నాయకులవలెనే ఆయన కూడా తీవ్రంగా ఆరాటపడేవారు. కాని స్వాతంత్ర్యం పొందడానికి ముందు దేశ ప్రజ అందుకు అర్హత సంపాదించాలని ఆయన భావించారు. ఇందుకోసం ప్రజాసామాన్యాన్ని ఉద్బుద్ధం చేసి సమాజ జీవితాన్ని మెరుగుపరచాలని ఆయన భావించారు.

తిలక్, గోఖలేలను గురించి గాంధీజీ ఒకసారి అర్థగర్భితమైన వాఖ్యచేశారు. గోఖలేను కలుసుకొన్నప్పుడు పవిత్ర గంగా నదిలో శిరః స్నానం చేసినట్లుంటుందనీ, తిలక్ అగాధమైన మహాసముద్రంవంటి వారని మహాత్ముని సూక్తి.

# ఆచార్యులు, నిర్మాతలు

## రవీంద్రనాథ్ టాగూర్

"జనగణమన అధినాయక జయహే'' అనే జాతీయ గీతం మీరంతా వినే ఉంటారు. ఇది ఎవరు వ్రాశారో మీకు తెలుసా? రవీంద్రనాథ్ టాగూర్ అనే మహాకవి ఈ గీతం రచించారు. రవీంద్రుడు కలకత్తాలో జన్మించారు. తండ్రి దేవేంద్రనాథ్ ఆగర్భ శ్రీమంతుడు ప్రజ్ఞాశాలి. ప్రజలు భక్తితో ఆయనను ''మహర్షి'' అని పిలిచేవారు. రవీంద్రుడు మహాకవి మాత్రమే కాక జ్ఞాన సౌశీల్య సంపన్నుడు. భారతజాతి యావత్తూ ఆయనను గౌరవించి, ప్రేమతో గురుదేవుడని పిలుచుకొనేది.

చిన్నతనంలోనే రవీంద్రుడు కవిత చెప్పడం ఆరంభించారు. ఆనాటి సుప్రసిద్ధ రచయితలు కూడా బాలుడైన రవీంద్రుడు వ్రాసిన అద్భుత కవిత్వానికి అచ్చెరువొందేవారు. ప్రసిద్ధ నవలాకారుడు బంకిం చంద్ర ఛటర్జీ ఒక సన్మాన సభలో తమకు వేయబోయిన పూలమాలను తీసి రవీంద్రునికి కానుకగా సమర్పించారట. ఆ పూలమాల తనకు వేయడంకంటె ఉదయ భానుడైన రవీంద్రుని కంఠం అలంకరించడమే సముచితమని ఆ సందర్భంలో బంకిం చంద్ర ఛటర్జీ ప్రశంసించారు. ఈ ఉదంతం జరిగేనాటికి రవీంద్రుడు బాగా చిన్నవాడు.

రవీంద్రుడు కావ్యాలతోబాటు బెంగాలీ, ఆంగ్లంలో అనేక నాటకాలు, నృత్యనాటికలు, గల్పికలు, నవలలు మొదలైన రచనలు చేశారు. లలితకళలంటే ఆయనకు ఎంతో మక్కువ. గేయాలు వ్రాయడమే కాకుండా స్వరకల్పన చేసి మధురమైన తన గాత్రంతో వాటిని ఆలపించేవారు కూడా. క్రమంగా ఆయన చిత్రకళ కూడా అభ్యసించి, రమ్యమైన చిత్తరువులనేకం వ్రాశారు.

ఆ మహాపురుషునిలో ఏవిధమైన ఆలోచనలు ఉండేవి? దేశానికి ఆయన బోధించినదేమిటి? ప్రజలు అలసత్వం వదలించుకొని తమ్ము తాము సంస్కరించుకొని దేశానికి ఔన్నత్యం తిరిగి కల్పించాలని వెనుకటి మేధావులు రచయితలు ఉద్బోధించినట్లు చదువుకొన్నాం.

టాగూర్ కూడా ఈ కోవకు చెందిన మహనీయుడే తన భావాలు చదువరుల మనస్సుకు హత్తుకొని పోయేటట్లు హృద్యమైన భాషలో రమ్యమైన రచనలు చేశారు. ఈ రచనలు చదివి భారతజాతి ఉర్రూతలూగిపోయింది. ఆయన వ్రాసిన పుస్తకాలు అన్ని భారతీయ భాషలలోకీ అనువదించబడ్డాయి. వివిధప్రాంతాల ప్రజలు వాటిని పారాయణ చేయసాగారు. వేలాది ప్రజలు రవీంద్ర కవీంద్రుని భక్తులయ్యారు.



సాటి దేశస్థులనే కాక సమస్త మానవాళిని ప్రజలు ప్రేమించాలని టాగూర్ కోరేవారు

రవీంద్రుని కీర్తి చంద్రికలు క్రమంగా ప్రపంచ మంతటా వ్యాపించాయి. వారి మధురకవిత చదివి విదేశాల ప్రజలు కూడా భారతజాతి ప్రతిభా సంపదను ఆకళించుకోగలిగారు. ప్రపంచంలో శ్రేష్ఠులైన రచయితలకు, విజ్ఞానవేత్తలకు బహూకరించే నోబెల్ పురస్కారాన్ని రవీంద్రునికిచ్చి సత్కరించారు.

భారతజాతి ఉన్నతి పొందాలని టాగూర్ గాఢంగా అభిలషించేవారు. ఏదేశమూ తనకుతానై అభివృద్ధి చెందలేదనీ, ఇతర దేశాలలోని మంచిని మనం గ్రహించాలని ఆయన అభిప్రాయపడేవారు. స్వదేశీయులనే కాక విశ్వమానవజాతిని స్వకుటుంబం వలె ప్రేమించాలని ఉద్బోధించారు. అందువల్ల టాగూర్ అంతర్జాతీయవాదిగా వినుతికెక్కారు.

టాగూర్ కేవలం రచనా వ్యాసంగంతోనే తృప్తిచెందలేదు. స్వయంగా శాంతినికేతనం అనే విశ్వవిద్యాలయం స్థాపించారు. జాతీయమైన పద్ధతిలో విద్యార్థులకు ఇక్కడ లలిత కళలు, ఇతర విద్యలు నేర్పుతూవచ్చారు. మన గ్రామసీమలు శుచి, శుభ్రతలతో, సుఖ సౌభాగ్యాలతో విలసిల్లాలని ఆయన ఆశయం. అందువల్ల గ్రామోద్ధరణకు శ్రీనికేతన్ అనే పేరుతో మరో సంస్థ ఏర్పాటు చేశారు.

రవీంద్రనాథ్ టాగూర్ 81 సంవత్సరాలు జీవించారు. రవీంద్రుడు విశుద్ధమైన జీవనం గడిపి మహర్షిగా ప్రఖ్యాతులయ్యారు. నిటారైన పొడుగాటి విగ్రహంతో, నెరిసిన నిడుపైన గడ్డంతో, శాంత గంభీరమైన ముఖవర్చస్సుతో అచ్చగా మన పూర్వమహర్షుల వలె

పొడకట్టేవారు. గాంధీజీకి రవీంద్రునిపై అపారమైన అనురాగం. వారు ఒకరినొకరు అన్నదమ్ములవలె చూసుకొనేవారు.

## మహమ్మద్ ఇక్బాల్

భారతజాతి ఔన్నత్యాన్ని గానం చేసిన మరొక మహాకవి మహమ్మద్ ఇక్బాల్. ఆయన ఉర్దూ, పారసీక భాషలలో రచనలు చేశారు. ''సారే జహాం సే అచ్ఛా, హిందూస్థాన్ హమారా'' అనే ఇక్బాల్ ప్రసిద్ధ ఉర్దూగేయం మీలో చాలామంది వినే ఉంటారు. ప్రపంచం అంతటిలో ఈ మన భారతదేశమే ఎక్కువ రమ్యమైనదని దీని అర్థం.

## సుబ్రహ్మణ్య భారతి

దేశభక్తిని గురించి, స్వాతంత్ర్యం గురించి అనేక గేయాలు, పద్యాలు వ్రాసి లక్షలాది ప్రజలను ఉర్రూతలూగించిన తమిళ యువకవి కూడా ఒకరు ఉండేవారు. సుబ్రహ్మణ్య భారతి అనే పేరుతో దేశం అంతటా ఈ కవి ప్రఖ్యాతుడైనాడు. భారతదేశం సుఖసౌభాగ్యాలతో తులతూగే శుభదినం కోసం ఆతురతతో నిరీక్షించిన మహనీయులలో ఈయన ఒకరు. ప్రజలు ఈయన దేశభక్తి గేయాలకు ముగ్ధులై 11ఏళ్ళ లేత వయస్సులోనే ''భారతి'' అనే బిరుదమిచ్చి గౌరవించారు.

దురదృష్టంవల్ల సుబ్రహ్మణ్య భారతికి విషాదకరమైన పరిస్థితులలో మరణం ప్రాప్తించింది. ఒకనాడు ఒక దేవాలయపు ఏనుగు ఆయనను తొండంతో పైకిఎత్తి అమాంతం నేలకువేసి విసిరి కొట్టింది. చుట్టు పక్కల ఉన్నవారు వెంటనే గుమిగూడి విడిపించారు కాని ఆ దెబ్బ నుంచి ఆయన మళ్లీ కోలుకోలేదు. 40 ఏళ్లు రాకముందే సుబ్రహ్మణ్య భారతి స్వర్గస్థులయ్యారు.

## మదన్‌మోహన్ మాలవ్యా

తిరుగుబాటు జరిగిన సంవత్సరంలోనే దేశంలో మూడు విశ్వవిద్యాలయాలు నెలకొల్పబడిన విషయం మీరు చదివారు. కాలక్రమేణా మరికొన్ని విశ్వవిద్యాలయాలు కూడా ఏర్పాటయ్యాయి. భారతజాతి తన కాళ్లమీద తాను నిలబడాలంటే, విద్యయే అందుకు సాధనమని నమ్మి విద్యావ్యాప్తికి గట్టిగా కృషిచేసిన విద్వాంసులొకరు ఉండేవారు. ఆ విద్వాంసులే మదనమోహన్ మాలవ్యా. దేశాటనం చేసి కోట్లకొద్దీ సొమ్ము విరాళాలుగా సేకరించి బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం స్థాపించారు. మదనమోహన్ మాలవ్యా

గొప్ప దేశభక్తుడు. ఒక పర్యాయం ఆయన కాంగ్రెసుకు అధ్యక్షులుగా ఎన్నికయ్యారు.

## అనిబిసెంట్

బెనారస్ హిందూ విశ్వవిద్యాలయాన్ని స్థాపించడంలో మదనమోహన్ మాలవ్యాకు కుడిభుజంగా ఉండి తోడ్పడిన వారిలో అనిబిసెంట్ ముఖ్యురాలు. బ్రిటన్‌లో పుట్టినా, భారతదేశాన్నే స్వగృహంగా భావించుకొని, అనిబిసెంట్ ఇక్కడ స్థిరనివాసం ఏర్పాటు చేసుకుంది. మన ఋషులు వ్రాసిన మత గ్రంథాలను మథించి, ప్రతి మతంలోను మంచి ఉన్నదని, అన్ని మతాలలోని మంచిని స్వీకరించాలని బోధించింది. అనిబిసెంట్ అవలంబించిన మతానికి థియోసఫీ అని పేరు. ఆ కాలంనాటి మన నాయకులనేకులు థియోసఫీ ప్రాబల్యానికి లోనైనారు.

బ్రిటిషువారు భారత్‌కు అన్యాయం చేస్తున్నారని ఆమె బాధపడేది. భారతదేశానికి స్వయంపరిపాలనాధికారం ఇవ్వాలని ఆమె వాదించేది. ఇలాంటి అభిప్రాయాలు ప్రచారం చేస్తున్నందుకు ప్రభుత్వం ఆమెను జైల్లో వేసింది. అనిబిసెంట్ ఒక పర్యాయం కాంగ్రెసు అధ్యక్షపీఠం అలంకరించింది. ఆమె తన 87వ ఏట భారత్‌లో పరమపదించారు.

## జగదీశ్ చంద్రబోస్

అనేకమంది నాయకులు, రచయితలు, విద్యావేత్తలను గురించి తెలుసుకున్నాం. కాని శాస్త్రవేత్తల సహాయం లేనిదే ఏ దేశమూ ఎక్కువగా అభివృద్ధి చెందలేదు. మన ప్రముఖ శాస్త్రవేత్తలలో జగదీశ్ చంద్రబోస్ ఒకరు. ఈయన రవీంద్రనాథ్ టాగూర్ కంటె మూడేళ్ళు పెద్ద. టాగూర్ వలెనే ఈయన కూడా సర్వజన సమ్మాన్యుడయ్యాడు. జగదీశ్ చంద్రబోస్ పదార్థ శాస్త్రవేత్త. వైర్‌లెస్‌లో ఎంతో కృషిచేశారు. అటు పిమ్మట అయనకు వృక్ష శాస్త్రంలో ఆసక్తి కలిగి, అందులో కూడా పరిశోధనలు మొదలు పెట్టారు. మనుషులవలెనే చెట్టు చేమకు కూడా గాలి, వెలుతురు, ఆహారము అవసరమని, అంతేకాక మనకువలెనే వాటికీ సుఖదుఃఖాల అనుభూతి ఉంటుందని ప్రయోగాల ద్వారా ఆయన నిరూపించారు.

## పి.సి.రాయ్

ఆధునిక యుగంలో మరొక సుప్రసిద్ధ శాస్త్రవేత్త పి.సి. రాయ్. ఆయన ప్రత్యేకంగా అభ్యసించిన విద్య రసాయన శాస్త్రం. ఈ శాస్త్రంలో ఆయన చేసిన పరిశోధనలకే కాక,

ప్రదర్శించిన అకుంఠిత దేశభక్తికి కూడా పి.సి.రాయ్ చిరస్మరణీయులయ్యారు. స్వదేశీ ఉద్యమం గురించి మీరు కొంత చదివారు. స్వదేశంలో తయారైన వస్తువులనే వాడుకచేయాలని పి.సి.రాయ్ ఉద్బోధించారు.

ప్రపంచ ప్రఖ్యాతి పొందిన మరో ఇద్దరు శాస్త్రజ్ఞులు రామానుజన్, సి.వి. రామన్.

## రామానుజన్

రామానుజన్ ఏ విశ్వవిద్యాలయంలోనూ పట్టా పుచ్చుకోలేదు. జీవిక కోసం గుమస్తాగా పనిచేసేవారు. అయినా ప్రతిభావంతుడైన గణితశాస్త్రవేత్తగా వినుతికెక్కారు. ప్రపంచంలో అగ్రగణ్యులైన గణితశాస్త్రవేత్తలు కూడా చేయలేకపోయిన జటిలమైన లెక్కలు అవలీలగా ఆయన చేయగలిగేవారు. క్రమంగా రామానుజన్ ప్రతిభను ప్రపంచం గుర్తించింది. ఒక బ్రిటిషు విశ్వవిద్యాలయం ఆయనను ఆహ్వానించింది. రామానుజన్ ఆరోగ్యం సరియైంది కాదు. ఇంగ్లండుకు చేరుకున్న కొద్ది రోజులకే యువకుడైన రామానుజన్ స్వర్గస్థులయ్యారు.

## సి.వి. రామన్

శాస్త్రవేత్త సి.వి. రామన్ పేరు వినని వారుండరు. సర్కారు కొలవులో మొదట అకౌంట్స్ ఆఫీసరుగా చేరారు. కొద్ది కాలానికే ఆ ఉద్యోగం విడిచిపెట్టి పదార్థ విజ్ఞానానికి జీవితాన్ని అంకితం చేశారు. రామన్ మొదట కలకత్తాలోను, తరువాత బెంగుళూరులోను అధ్యాపకులుగా పనిచేశారు. నోబెల్ బహుమానం సంపాదించిన ఇద్దరు భారతీయులలో రామన్ ఒకరు. అప్పట్లో ఆయన స్వంత పరిశోధనాశాల ఒకటి ఏర్పాటు చేసుకొన్నారు.

## జెంషెడ్జీ టాటా

ప్రజలు విజ్ఞానం సంపాదించి కష్టపడి పనిచేసినప్పుడే దేశం సౌభాగ్యవంతమవుతుంది. దేశంలో విరివిరిగా కళాశాలు ఏర్పాటు చేయడం ఎంత అవసరమో, ఫ్యాక్టరీలు నెలకొల్పడం కూడా అంతే అవసరమని చాలాకాలం క్రిందటే మన జాతీయ నాయకులు గుర్తించారు. మనకు కావలసిన సామగ్రులకోసం విదేశాల మీద ఆధారపడడం మంచిదికాదు. స్వదేశంలోనే అవి తయారుచేసుకుంటే, ప్రజలకు చాలా మందికి ఉద్యోగాలు లభించటమే కాకుండా మన సొమ్ము మరోచోటుకి పోకుండా స్వదేశంలోనే నిలుపుకోవడానికి వీలవుతుంది. ఈ ఉద్దేశ్యంతోనే జెంషెడ్జీ టాటా అనేక మిల్లులు, ఫ్యాక్టరీలు దేశంలో నెలకొల్పి గొప్ప పేరు

సంపాదించారు. ఉక్కును కూడా స్వదేశంలోనే ఉత్పత్తి చేయాలని సంకల్పించి జెంషెడ్‌పూర్‌లో ఉక్కు కర్మాగారం స్థాపించారు.

పైన చెప్పిన కవులు, విద్వాంసులు, శాస్త్రవేత్తలు, నిర్మాతలు చేసిన అవిరళకృషి ప్రజలకు గర్వకారణమైంది. వారి మనస్సులలో భవిష్యత్తును గురించి కొత్త కొత్త ఆశలు రేకెత్తాయి, ప్రజలు విద్యాధికులై గట్టిగా పరిశ్రమిస్తే ఒకనాడు ఔన్నత్యపు శిఖరాలను అందుకొన్న భారతజాతి తిరిగి మహోన్నతి సాధించగలుగుతుందని దేశంలో విశ్వాసం బయలుదేరింది. ఈ మహాపురుషులందరూ స్వతంత్ర భారత జాతిని నిర్మించడానికి అపారంగా తోడ్పడ్డారు.

# గాంధీ మహాత్ముడు

మీలో చాలామంది ఈ మహాపురుషుని స్వయంగా చూసి ఉండకపోవచ్చు. కాని ఆయనను గురించి విననివారు ఉండరు. ఆయన అతి నిరాడంబరుడు. పేదలలోకెల్లా పేద. పొలం పుట్రా డబ్బూ దస్కం ఆయనకేవీ లేవు. వంటినిండా దుస్తులు కూడా వేసుకునేవారు కాదు. ఒక కొల్లాయి గుడ్డ, అంగవస్త్రం ఇవే ఆయన వేషం. అయినా ప్రపంచంలో మహాచక్రవర్తులకు కూడా లేనంత అధికారము, శక్తిసామర్థ్యాలు ఆయనకుండేవి. మన దేవతలను, ఋషులను, మహావీరులను తలపింపజేసే ఈ మహాపురుషునికి ఆత్మవిశ్వాసము, సౌజన్యమే పెట్టనికోటలయ్యాయి. అవే ఆయనకు అపారమైన బలసంపదలను సమకూర్చాయి. ఇట్టి మహాపురుషుడు సాక్షాత్తు మన దేశంలో మన యుగంలోనే జీవించాడంటే అద్భుతం కదూ! ''సాధారణ మానవులు నడిచే ఈ నేలమీదనే అట్టి మహాత్ముడు పుట్టి మెట్టాడన్న విషయం ముందుతరాల వారికి బహుశా నమ్మశక్యం కాదేమో'' అని సుప్రసిద్ధ శాస్త్రవేత్త ఐన్‌స్టీన్ ఒక సందర్భంలో ఉగ్గడించారు.

అయితే గాంధీ మహాత్ముడు మనజాతికి ఏవిధమైన సేవచేశారు?

మనం ఈనాడు ఒక స్వతంత్ర జాతిగా తలఎత్తుకు నిలబడగలిగామంటే అది ఆ మహాత్ముని చలువవల్లనే. ఇతరకులాల పిల్లల మాదిరిగానే దళిత బాలబాలికలు కూడా పాఠశాలలకు వెళ్లి చదువుకుంటున్నారన్నా, అస్పృశ్యులుగా వైదొలగి ఉండవలసిన అవసరం వారికీనాడు తొలగిపోయిందన్నా, ఇది కూడా గాంధీ మహాత్ముడు పెట్టిన భిక్షే. గాంధీజీ మట్టిలోంచి మేరువులను సృష్టించాడని, పిరికివడిపోయిన భారతజాతికి ధైర్యసాహసాలు పోసి తల ఎత్తుకు నిలబడేట్లు చేశాడని విజ్ఞులు చెబుతారు. అందువల్లనే గాంధీ మహాత్మునికి ''జాతి పిత'' అని పేరు వచ్చింది. నిజానికి మన జాతి జీవితం ఆయన వ్యక్తి గత జీవితంతో గాఢంగా పెనవేసుకుపోయింది. భారతజాతి చరిత్ర, గాంధీజీ జీవిత కథ అవి నాభావ సంబంధం పొందాయి.

మోహనదాస్ కరమ్‌చంద్ గాంధీ కథియవాడ్‌లోని పోర్‌బందర్‌లో జన్మించారు. ఆయన



ఎప్పుడూ ప్రస్తుతం కంటే కొంచెం మెరుగుగా జీవించాలని గాంధీజీ మనకు బోధించారు

తండ్రి ఒక సంస్థానంలో దివానుగా పనిచేస్తున్నా, గాంధీజీ నిరాడంబరంగానే పెరిగారు. అందరి పిల్లల మాదిరిగానే సాధారణ బడిలో చదువుకొని మొత్తంమీద ఏదో విధంగా పరీక్షలు పాసవుతూ వచ్చారు. 19 ఏళ్లు వచ్చాక ఇంగ్లండు వెళ్లి న్యాయశాస్త్రం చదువుకొని బారిస్టరయ్యారు. న్యాయవాదిగా తొలుత పేరు సంపాదించలేకపోయారు. మొదటిసారి వకాలతు పుచ్చుకుని కోర్టుకు వెళ్లినప్పుడు చెప్పరాని భయం వేసి కాళ్లలో వణుకు పుట్టుకువచ్చిందిట. మాటలు తడబడి కేసు సరిగా వాదించ లేకపోయారట.

## దక్షిణ ఆఫ్రికా

ఒకసారి గాంధీగారు ఏదో కేసు సందర్భంలో దక్షిణాఫ్రికా• వెళ్లవలసివచ్చింది. అప్పటికాయన వయస్సు 24 ఏళ్లు. దక్షిణాఫ్రికాలో యూరోపియన్లు నల్లవారైన భారతీయులను, ఆఫ్రికన్లను జంతువుల కంటె నికృష్టంగా చూస్తూ, అనేక హింసలు పెట్టేవారు. తెల్లవారు నడిచే దారిలో నల్లవారని వెళ్ళనిచ్చేవారు కాదు. వారు ప్రయాణం చేసే బళ్ళలో వీరిని ఎక్కనిచ్చేవారు కాదు. పొరబాటున ఈ కట్టుబాటుకు భంగం జరిగితే అలా చేసిన నల్లవారిని నానా తిట్లూ తిట్టి, దేహశుద్ధి చేసి, ఒకొక్కక్కప్పుడు జైలులో కూడా వేసేవారు. ఇది చూసి గాంధీ మహాత్ముడు దిగ్భ్రాంతుడయ్యాడు. కొన్నిసార్లు ఆయన కూడా ఇట్టి అవమానాలకు గురికావలసివచ్చింది. కొంతకాలం దక్షిణాఫ్రికాలోనే మకాం ఉండి నల్లవారికి జరుగుతున్న అన్యాయాలను తుద ముట్టించాలని గాంధీజీ నిశ్చయించుకున్నారు. 20 ఏళ్లు విడువులేకుండా ఆయన సాగించిన ఉద్యమంవల్ల నల్లవారి స్థితిగతులు కొంత మెరుగయ్యాయి. గాంధీజీ ఈ పోరాటం సాగించిన తీరు చరిత్రలో అపూర్వమైనది. ఇంతవరకూ మీరు చదువుకున్న యుద్ధాలలాంటిది కాదు ఈ ఉద్యమం.

మంచి పని ఏదైనా సాధించదలుచుకున్నప్పుడు, అవతలి వారికి నొప్పి కలిగించకుండా, హాని జరుగకుండా శాంతంగా అది సాధించాలని, అలా సాధించడం అసంభవమైతే ఆ కోరికను వదులుకోవడమే మంచిదని గాంధీజీ అభిప్రాయం. ఒక శాసనం అక్రమమైనదని నమ్మినప్పుడు దానిని బుద్ధిపూర్వకంగా ఉల్లంఘించి, శిక్షలువడితే సంతోషంగా స్వీకరించాలి. అంతేగాని అవతలవారిని మనం మనసులో కూడా లేశమాత్రం ద్వేషించుకూడదని ఆయన మతం. హింసలేకుండా శాంతియుతంగా జరిపే ఇలాంటి పోరాటానికే సత్యాగ్రహమని గాంధీజీ పేరుపెట్టారు. ''సత్యాగ్రహ'' మంటే సత్యాన్ని గురించి పట్టుదల. గాంధీజీ జీవితంలో సత్యా హింసలే ధృవతారలయ్యాయి. ''నేను నిజంగా అహింసావాదినైతే నాబద్ధ శత్రువును కూడా మనసారా ప్రేమించగలగాలి'' అని గాంధీజీ ఒకసారి వక్కాణించారు.

## స్వదేశానికి తిరిగి రాక

దక్షిణాఫ్రికాలో కొంతకాలం సత్యాగ్రహం నడిపి గాంధీ మహాత్ముడు భారత్‌కు తిరిగివచ్చారు. అప్పడు యూరోప్ ఖండంలో ఒకవంక జర్మనీకి, మరొకవంక బ్రిటన్, ఫ్రాన్స్, రష్యా మొదలైన దేశాలకు యుద్ధం ప్రారంభమైంది. ఈ సందర్భంలో బ్రిటన్ భారత్‌ను

సహాయం అడిగింది. యుద్ధం ముగిసిన తరువాత భారతీయులకు మరికొన్ని హక్కులు ఇస్తామని మాటయిచ్చింది. ఎదుటివారి మాటలో నమ్మకం ఉంచాలన్న తన సూత్రం ప్రకారం గాంధీ మహాత్ముడు బ్రిటిషువారి వాగ్దానం నమ్మి సైనికులను సమీకరించడంలో వారికి తోడ్పడ్డారు. యుద్ధంలో గెలుపొందిన తరువాత బ్రిటిషువారు కొన్ని సంస్కరణలు ప్రకటించారు. సెక్రటరీ అఫ్ స్టేట్ మాంటాగ్యూ, రాజప్రతినిధి చెమ్స్‌ఫర్డ్ కలిసి తయారుచేసిన సంస్కరణలు కనుక ఈ సంస్కరణలకు మాంటాగ్యూ-ఛెమ్స్‌ఫర్డ్ సంస్కరణలని పేరువచ్చింది. అయితే ఇవి ఎందునా పొందని నిరర్థకమైన సంస్కరణలు. స్వదేశాన్ని పరిపాలించుకునే అధికారం భారతీయులకు ఇవ్వాలనే ఉద్దేశ్యం బ్రిటిషువారికి ఏకోశానా లేదని వీటివల్ల తేటతెల్లమైంది. దేశమంతటా అసంతృప్తి, ఆగ్రహము అలముకొన్నాయి. అంతవరకూ అతిసాధువులుగా అన్నిటిని సహిస్తూ వచ్చిన ప్రజలు ఒక్కసారిగా ఉవ్వెత్తున లేచారు. తమ మనస్సులో ఉన్నది దాపరికతం లేకుండా ధైర్యంగా ఎలుగెత్తి చాటడం ప్రారంభించారు. స్వయం పరిపాలనాధికారం ఇవ్వాలంటూ దేశమంతటా ఊరేగింపులు, సమావేశాలు జరిగాయి. పోలీసులు ప్రజాసమూహాలపై విరుచుపడి లాఠీ దెబ్బలతో చెదరగొట్టసాగారు. అనేకమందికి తీవ్రమైన దెబ్బలు తగిలాయి. వేలాది ప్రజలు అరెస్టు అయ్యారు.

## జలియన్ వాలా బాగ్

ఒకనాడు అమృత్‌సర్‌లో జలియన్ వాలా బాగ్ అనే చోట నాయకుల ఉపన్యాసాలు వినడానికి వేలాది జనం గుమిగూడారు. సభకు వచ్చినవారు నిరాయుధులు, ఏ పాపమూ చేయని నిరపరాధులు. అంతలో సైనిక పటాలం వెంటబెట్టుకుని ఒక ఇంగ్లీషు సేనాని జలియన్ వాలా బాగ్ వద్ద ప్రత్యక్షమయ్యాడు. ముందు తోటగేటువద్ద నిఘావేశాడు. ఒక్కుమ్మడిగా జనంమీద తుపాకులు కాల్చమంటూ సైనికులకు హుకుంచేశాడు. తోటలో చిక్కుకున్న జనానికి బయటకు తప్పించుకుపోవడానికి దారిలేకపోయింది. సైనికులు కాల్చిన తుపాకి గుండ్ల వర్షానికి గురియై, వెయ్యిమందికి పైగా అక్కడికక్కడే ప్రాణాలు విడిచిపెట్టారు. ఇంకా అనేకులు క్షతగాత్రులయ్యారు. అక్కడ జరిపిన ఘోరమైన హత్యాకాండ చాలదన్నట్లు అమృత్‌సర్‌లో ఒక వీధిగుండా భారతీయు లెవరైనా వెళ్ళదల్చుకుంటే బోర్లపడుకుని నేలబారుగా జంతువులవలె పాకుతూ పోవాలని బ్రిటిషు అధికారులు ఉత్తరువు చేశారు.



జలియన్ వాలా బాగ్‌లో భారతీయులపై జరిపిన కాల్పులు దేశానికి దిగ్భ్రాంతి కలిగించింది

## గాంధీజీ అనుయాయులు

జలియన్ వాలా బాగ్‌లో జరిగిన దురంతానికి దేశమంతా అట్టుడికిపోయింది. తనకు బ్రిటిషువారిచ్చిన బిరుదాన్నీ, గౌరవ చిహ్నాలనూ విశ్వకవి రవీంద్రుడు అందుకు అధిక్షేపణగా విసర్జించేశాడు. ప్రజలంతా ఏకమై సత్యాగ్రహ సమరంలో పాల్గొనాలని గాంధీ మహాత్ముడు, జాతీయనాయకులు విజ్ఞప్తి చేశారు. ఆ పిలుపు విని వేలాది స్త్రీ పురుషులు మహాత్ముని అనుసరించారు. యువకులు అనేకమంది కాలేజీలు, స్కూళ్లు మానేశారు. లాయర్లు, కోర్టులకువెళ్ళడం మానుకొన్నారు. ప్రభుత్వోద్యోగులు పలువురు రాజీనామాలిచ్చారు.

ఈవిధంగా గాంధీజీ అడుగుజాడలను అనుసరించడానికి దేశమంతా నడుము కట్టింది. స్వాతంత్ర్యం వచ్చిన కొత్తలో మన దేశానికి నాయకులైన వారంతా ఆనాడు గాంధీజీ అనుచరులుగా ఉద్యమంలో పాల్గొన్నవారే. మోతీలాల్ నెహ్రూ, ఆయన కుమారుడు జవహర్‌లాల్ నెహ్రూ, చిత్తరంజన్ దాస్, రాజేంద్ర ప్రసాద్, మౌలానా అబుల్ కలాం ఆజాద్, సి. రాజగోపాలాచారి, సరోజినీ నాయుడు, అబ్దుల్ గఫర్ ఖాన్, సర్దార్ పటేల్, అజ్మల్‌ఖాన్, డాక్టర్ అన్సారీ, జమన్‌లాల్ బజాజ్, బాబా ఖరక్ సింగ్ – వీరంతా గాంధీజీ అనుయాయులలో ముఖ్యులు. ఈ స్వాతంత్ర్యోద్యమ నాయకులలో పలువురు ఇప్పుడు లేరు. శాసనధిక్కారం చేసి బ్రిటిషు వస్తువులను వారు దేశంలో బహిష్కరింపజేశారు. అధికారులు ఏదో ఒక నేరం పేరుతో వారిని మళ్లీ మళ్లీ అరెస్టు చేస్తూ, జైళ్ళలో పెడుతూ వచ్చారు. అనేక కష్టనష్టాలకు గురియైనా సహించి సత్యానికి కట్టుబడి విడుదల కాగానే నాయకులు యధా ప్రకారం అక్రమశాసనాలను ఉల్లంఘిస్తూ వచ్చారు. నగరాలలో, జనపదాలలో పోలీసులు జనాన్ని లాఠీలతో మోదేవారు. అయినా గాంధీజీ ఆజ్ఞ ప్రకారం పోలీసులకు ఎదురు తిరగకుండా, ప్రజలు ఎంతో నిగ్రహం ప్రదర్శిస్తూ వచ్చారు.

కాని ఒకసారి చౌరిచౌరా అనే గ్రామంలో పోలీసుల అత్యాచారాలకు క్రోధపరవశులయిన ప్రజలు పోలీసు ఠాణాను తగులపెట్టారు. ఈ దుర్ఘటన గాంధీ మహాత్ముని మనస్సుకు చాలా వ్యథ కలిగించింది. వెంటనే సత్యాగ్రహ ఉద్యమం ఆపివేశారు. గాంధీజీ దృష్టిలో స్వాతంత్ర్యం సంపాదించడం ఒక్కటే ముఖ్యం కాదు, అందుకనుసరించే విధానమూ ముఖ్యమే. సంపూర్ణమైన అహింసతో శాంతియుతంగా స్వాతంత్ర్య పోరాటం సాగించాలని ఆయన మతం. హింస చక్రవడ్డీలాగాపెరిగి పోనుపోను మరింత హింసకు దారితీస్తుందని ఆయన సిద్ధాంతం.

భారత్‌లో బ్రిటిషు పరిపాలన అంతమొందించాలన్నది గాంధీజీ కోరిక. కాని బ్రిటిషు ప్రజలకు హానికలుగజేయడం ఆయన మతంకాదు. ఇటు భారతీయులకు అటు బ్రిటిషువారికి కూడా మేలు జరిగేట్లు స్వాతంత్ర్యం సంపాదించాలని ఆయన వక్కాణించేవారు.

దేశ దాస్యానికి ముఖ్యంగా మనము, మన దురాచారాలే కారణమని, మూలంలోకి వెళ్లి చూస్తే బ్రిటిషువారు కాదని కూడా గాంధీజీ అనేవారు. మన సమాజం పాటిస్తున్న దుష్టమైన ఆచారాలలో అస్పృశ్యత ముఖ్యమైంది. లక్షలాది సాటివారిని అంటరాని వారుగా పరిగణించి

హేయంగా చూస్తూ వచ్చాము. పంచములను సవర్ణులు తమతో కలిసిమెలగ నిచ్చేవారు కాదు. దేవాలయాలకు వెళ్ళి, దేవుడికి అందరితోపాటు పూజచేసుకునే యోగ్యత కూడా వారికి లేకపోయేది. చదువుకోసం అందరి పిల్లలు వెళ్ళే పాఠశాలలకు తమ పిల్లలను పంపే హక్కు కూడా వారికి లేకపోయింది. ఊరి చెరువునుంచో లేక బావినుంచో నీరు తెచ్చుకొనేందుకు కూడా హక్కులేదు. ఈ స్థితి భారతజాతికే కళంకం. గాంధీ మహాత్మునికి దీనులైన అస్పృశ్యులంటే అపారమైన ప్రేమ. అందుకనే దళితులను ప్రీతితో ఆయన హరిజనులని పిలిచేవారు.

ప్రాణానికి ప్రాణంగా చూసుకుంటూ, దళితుల శ్రేయస్సు కోసం అహోరాత్రాలు గాంధీజీ కృషి చేశారు. వారికి తగిన హక్కు లిచ్చేట్లు తక్కిన కులాలవారిని ఒప్పించేందుకు ఒకసారి నిరశనవ్రతం ప్రారంభించారు. అనేక రోజులు ఏవిధమైన ఆహారము ముట్టకుండా శరీరాన్ని కృశింపచేసుకున్నారు. దళితులకు సమాజంలో న్యాయం కలుగుతుందన్న నమ్మకం కుదిరిన పిమ్మటనే ఆయన వ్రతం చాలించారు. దేవాలయాలలో దళితులకు ప్రవేశం కలుగజేయడానికి, సాటివారితో సమాన ఫాయాలో కలిసిమెలిగే అవకాశం కలిగించేందుకు గాంధీ మహాత్ముడు పట్టుదలతో ఉద్యమం సాగించారు.

దేశంలో అంటరానితనంతోబాటు, ఆర్తి, అజ్ఞానం, దారిద్ర్యం తాండవిస్తున్నాయి. అజ్ఞానంవల్ల హిందువులు, ముస్లింలు ఒకరితో ఒకరు కలహించుకుంటూ ఒకరినొకరు క్రూరంగా హింసించుకునే వారు. వస్తుతః అన్ని మతాలు ఒక్కటేనని, మహమ్మదీయుల అల్లా, హిందువుల ఈశ్వరుడు భగవంతునికి మారుపేర్లని గాంధీజీ విశ్వసించేవారు. మతాలు వేరన్న కారణంతో హిందువులు, ముస్లింలు కలహించుకోవడం చూసి గాంధీజీ ఖిన్నులయ్యారు. ఈ రెండు వర్గాలకు కొట్లాటలు జరిగినప్పుడు గాంధీజీ అనేక పర్యాయాలు నిరశన వ్రతం చేశారు.

దీన జనులకోసం, నిరుపేదలైన కర్షక శ్రామిక జనం కోసం గాంధీజీ హృదయం అల్లాడిపోయేది. జీవితాంతము, ఆయన ఏపనిచేసినా ముందుగా వారి శ్రేయస్సునే దృష్టిలో పెట్టుకుని చేసేవారు.

ఇతరులపై ఆధారపడడం మానుకొని స్వాధీనులమై జీవించాలని గాంధీజీ ప్రజలకు ఉద్బోధించారు. చరఖాతో నూలు వడికి ఖద్దరు ధరించాలని హితవు చెప్పారు. లక్షలాది నేత పనివారికి, గ్రామాలకు ఇది ఎంతో లాభదాయకమైంది. విదేశీ వస్త్రాలమీద డబ్బు ఖర్చు

చేయడం మాని ఖద్దరు వాడడంవల్ల మన సొమ్ము విదేశాలకు పోకుండా స్వదేశంలో పాటక జనానికి భుక్తి కల్పించింది. మామూలు బీదాబిక్కీ చేస్తూ ఉండే పనులు మనం కూడా చేస్తే వారికి సన్నిహితులం కాగలుగుతామని గాంధీజీ భావించారు. మానవ సేవయే మాధవ సేవ అని, దరిద్ర నారాయణుల శ్రేయస్సుకు పాటుపడడమే ఉత్తమమైన ఈశ్వరారాధన అని గాంధీజీ ఉద్బోధించారు. కాయకష్టం చేయడం సిగ్గుపడవలసింది కాకపోగా ఆత్మగౌరవం సాధించడానికి అదే సరియైన మార్గమని కూడా ఆయన బోధించారు. గాంధీజీ నిరాడంబరంగా జీవితం గడిపారు. అన్న పానాదులలో అతి సాధారణమైన వాటినే స్వీకరించేవారు తప్ప విలువైన వస్తువులను దరిజేరనిచ్చే వారుకాదు. మహాత్ముని సరళమైన విశుద్ధ జీవనం చూసి, భక్తి తాత్పర్యాలతో అనేకమంది సబర్మతీ, సేవాగ్రాం వంటి ప్రదేశాలలో ఆయన నెలకొల్పిన ఆశ్రమాలకు తీర్థ ప్రజగా వెళ్లేవారు.

భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం వచ్చేవరకు విశ్రమించను అని గాంధీ, జవహర్‌లాల్ నెహ్రూల నాయకత్వాన 1930 జనవరి 26వ తేదీన భారతీయులు ప్రమాణం చేశారు. ఆ తరువాత 20 సంవత్సరాలకు సరిగా అదే తారీఖున భారతదేశం సర్వసత్తాక స్వతంత్ర రిపబ్లిక్‌గా అవతరించింది.

## దండీయాత్ర

భారత ప్రజలు స్వాతంత్ర్య దీక్ష స్వీకరించిన వెంటనే గాంధీజీ బ్రిటిషువారిని తమ కోరిక చెల్లించవలసిందని అడిగారు. కాని వారు అందుకు సుముఖంగా లేరు. దానిపై మరొక సత్యాగ్రహం ప్రారంభించాలని గాంధీజీ నిశ్చయించుకున్నారు. అక్రమమైన శాసనాలను ఉల్లంఘించడం గాంధీజీ సత్యాగ్రహ ఉద్యమాలలో ప్రధాన సూత్రం. పేదలు కూడా నిత్యకృత్యంగా వాడుకునే ఉప్పుమీద ప్రభుత్వంవారు పన్ను వేయడం అక్రమమని ఆయన భావించారు. అందుకని ఆ శాసనం భగ్నం చేయడానికి నిశ్చయించుకుని, వైస్రాయికి ముందుగా తమ ఉద్దేశ్యం తెలియజేశారు. వినోభాభావేతో సహా 78 మంది స్త్రీపురుషులు వెంటరాగా, గాంధీజీ ఆశ్రమం నుంచి బయలుదేరారు. అహమ్మదాబాదు సమీపంలో సముద్రతీరాన ఉన్న దండికి 24 రోజులు కాలినడకన ప్రయాణంచేసి వెళ్ళారు. అక్కడ సముద్రపు నీటితో ఉప్పు తయారుచేసి, సర్కారు వారికి పన్ను చెల్లించకుండా పేద ప్రజలు ఉప్పు చేసుకోవాలని ప్రకటించారు. ఈవిధంగా ప్రభుత్వం చేసిన ఒక దుష్టశాసనాన్ని

స్వయంగా అతిక్రమించారు. పల్లె పట్టులలోను, పట్టణాలలోను ప్రజలు గాంధీజీ వరవడిని అనుసరించి ఉప్పు తయారుచేయడం మొదలు పెట్టారు. ప్రభుత్వం జనంమీద లాఠీలు ప్రయోగించి, తుపాకులు కాల్పించి వాత శేషులను కారాగారాలలో బంధించింది. కొద్ది వారాలలోనే దేశమంతటా జైళ్లు కిటకిటలాడిపోయి, సత్యాగ్రహులకోసం ప్రభుత్వం మరికొన్ని జైళ్ళు కట్టించవలసి వచ్చింది.

## రౌండ్ టేబుల్ సమావేశాలు

బ్రిటిషు ప్రభుత్వం దీనితో కొద్దిగా తెలివితెచ్చుకొని భారతీయులతో సమరసంగా నడచుకోవాలని గుర్తించింది. లండన్‌లో మూడు రౌండ్ టేబుల్ సమావేశాలు ఏర్పాటు చేయబడ్డాయి. ఆ సమావేశాలకు అనేకమంది ప్రముఖ భారతీయులను ఆహ్వానించారు. కాంగ్రెసు ఈ సమాలోచనలలో పాల్గొనడానికి మొదట నిరాకరించింది. కాని రెండవ సమావేశానికి కాంగ్రెసు తరపున ఏకైక ప్రతినిధిగా గాంధీజీ హాజరయ్యారు. స్వయంగా మహాత్ముడే హాజరవుతున్నప్పుడు ఆయనతో కూడా ఇతరులు వెళ్ళడం అనవసరమని కాంగ్రెసు భావించింది. తమ అలవాటు ప్రకారం గాంధీజీ కొల్లాయి, పాముకోళ్ళతో సమావేశానికి వెళ్ళారు. ఈ వేషంలో తాను ఎందుకు వచ్చిందీ ఇంగ్లీషువారికి ఇలా వివరించారు: ''నా దేశ ప్రజలలో ఇంచుమించు ఎవ్వరు కూడా ఇంతకంటె మంచి దుస్తులు వేసుకోగలిగిన స్థితిలో లేరు. ఈ సభకు నా ప్రజల ప్రతినిధిగా నేను వచ్చాను.'' లండన్‌లో జరిగిన సమావేశాలవల్ల ఎక్కువ ఉపయోగం లేకపోయింది. చాలాకాలం తర్జనభర్జనలు జరిగిన తరువాత, కొన్ని షరతులపై ప్రజలు రాష్ట్ర ప్రభుత్వాలను ఎన్నుకోవచ్చునని మాత్రం బ్రిటిషువారు అంగీకరించారు. అప్పటికీ అన్ని ముఖ్య విషయాలలో నిర్ణయాధికారం తమ చేతిలోనే ఉండేటట్టు మినహాయింపులు చేశారు.

## క్విట్ ఇండియా

ఇది జరిగిన కొన్ని సంవత్సరాలకు రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. బ్రిటన్ జర్మనితో యుద్ధానికి దిగింది. మన నాయకులను సంప్రదించకుండానే యుద్ధంలో భారత్ చేరిపోయినట్లు బ్రిటన్ ప్రకటించింది. ఇందుకు భారతీయులు తీవ్రంగా అధిక్షేపణ తెలియపరిచారు. అంతకు ముందు సుమారు రెండేళ్ళనుంచి ఆయా రాష్ట్రాలలో కాంగ్రెసు నిర్వహిస్తున్న ప్రజా ప్రభుత్వాలు వెంటనే రాజీనామా ఇచ్చాయి. బ్రిటిషువారి మనసు మారుతుందేమోనని గాంధీజీ

కొంతకాలం వేచి ఉన్నారు. కాని ప్రయోజనం కనిపించలేదు. చివరికి బ్రిటిషువారిని ''క్విట్ ఇండియా'' అనగా దేశాన్ని విడిచిపోండని గద్దించి అడిగారు. అది మొదలు ''క్విట్ ఇండియా'' నినాదం దేశమంతటా మారుమోగిపోయింది.

మళ్లీ సత్యాగ్రహం ప్రారంభించకముందే బ్రిటిషువారు జాగ్రత్తపడి మహాత్మాగాంధీ, జవహర్‌లాల్ నెహ్రూ, సర్దార్ పటేల్, మౌలానా అజాద్, రాజేంద్రప్రసాద్ మొదలైన నాయకులను అరెస్టు చేశారు. దీనితో అగ్నిలో ఆజ్యం పోసినట్లయింది. దేశమంతటా అధిక్షేపణ సభలు, ఊరేగింపులు జరిగాయి. ప్రభుత్వం ప్రజలను నిర్దాక్షిణ్యంగా అణచివేయడం మొదలు పెట్టింది. రక్తం ఏరులై పారింది. వేలాది ప్రజలను విచారణ లేకుండానే జైళ్లలో కుక్కివేశారు.

దీనికి కొద్ది రోజులముందు మన స్వాతంత్ర్యోద్యమ నాయకులలో ఒకరైన సుభాస్ చంద్రబోస్ విదేశాలలో ఉంటూ బ్రిటిషువారితో పోరాటం సాగించే ఉద్దేశంతో భారత్ నుంచి తప్పించుకుని రహస్యంగా వెళ్లిపోయారు. విదేశాలలో ఉన్న భారతీయులను కూడగట్టి ఆజాద్ హింద్ ఫౌజ్ అనే పేరుతో సైన్యాన్ని నిర్మించారు. అప్పుడు జర్మనీ, జపానులు బ్రిటన్‌తో యుద్ధం చేస్తున్నాయి. భారత జాతీయ సైన్యం బ్రిటిషు సేనలకు ఎదురునిలిచి పోరాటం జరిపింది. భారతీయులు సుభాస్ చంద్రబోసును ప్రేమతో 'నేతాజీ' అని పిలుచుకునేవారు. మన దేశంలో పుట్టిన మహావీరులలో నేతాజీ ఒకరు.

ఈ కాలంలోనే దేశంలో కొన్ని విషాదకరమైన పరిణామాలు వచ్చాయి. మహమ్మదీయులలో అనేకమంది తామొక ప్రత్యేక జాతివారమని తలపోయసాగారు. ముస్లింలీగుకు నాయకుడైన మహమ్మదాలీ జిన్నా, మహమ్మదీయులకు పాకిస్థాన్ అనే పేరుతో ఒక ప్రత్యేక రాజ్యం కావాలని పట్టుపట్టారు.

కొంతకాలానికి రెండవ ప్రపంచ యుద్ధం సమాప్తమైంది. భారత్‌లో ఇక అట్టే కాలం అంటిపెట్టుకు ఉండడం మంచిదికాదని బ్రిటిషువారిలో వివేకవంతులైనవారు గుర్తించగలిగారు. భారత ప్రజలు తమ్ముతాము పరిపాలించుకునే తరుణం వచ్చింది. జైళ్ళలో నిర్బంధించిన నాయకులను విడిచిపెట్టారు. అందుకు ఒక సంవత్సరం ముందుగానే గాంధీజీని విడుదల చేశారు. దేశమంతటికీ కలిపి ప్రభుత్వ ఏర్పాటుకు వైస్రాయి కాంగ్రెసును, ముస్లింలీగును ఆహ్వానించారు. కాంగ్రెసు తరఫున జవహర్‌లాల్ నెహ్రూ, మరికొందరు నాయకులు పదవీ స్వీకారం చేశారు. తరువాత కొంత కాలానికి ముస్లింలీగు నాయకులు కూడా ప్రభుత్వంలో

చేరారు. ఏటికొకరు లాగితే, కోటి కొకరు లాగడంవల్ల ప్రభుత్వం కట్టుగా పనిచేయలేకపోయింది. భారత్‌లో కొన్ని ప్రాంతాలను విడగొట్టి పాకిస్థాన్ నిర్మించాలని జిన్నా నాయకత్వాన ముస్లింలీగు సభ్యులు పట్టుపట్టారు. భారత్ ఏకఖండంగానే ఉండాలని కాంగ్రెసు వాదం. దీనిమీద దేశంలో పెద్ద ఎత్తున దొమ్మీలు, సంక్షోభాలు చెలరేగాయి.

## నౌఖాలీ

జరూరుగా చూసుకోవలసిన పనులు ఉన్నా అన్నిటినీ మానుకొని మహాత్మాగాంధీ అల్లరులు ఆపడానికి నౌఖాలీకి బయలుదేరారు. తూర్పు బెంగాల్‌లో ఉన్న ఈ గ్రామంలో పెద్ద దొమ్మీ జరిగింది. ఇక్కడ ఇతర మతస్థులకంటె ముస్లింలే ఎక్కువ మంది ఉన్నారు. దేశాన్ని ఆవహించిన మత విద్వేషపు ఉన్మాదంలో చివరికి తానే బలి కావచ్చునని గాంధీజీ ఎరుగకపోలేదు. అయినా ఆ పర్యటనలో తనకు పోలీసు కావలా వద్దని పట్టుపట్టారు. పాదచారియై నౌఖాలీలోను, అనేక ఇతర గ్రామాలలోను పర్యటనచేస్తూ, ఉభయ మతస్థుల హృదయాలను ప్రక్షాళన చేయవలసిందని భగవంతుని ప్రార్థించేవారు. ''ఉన్మాదులై ఒకరినొకరు మళ్లీ చంపుకోదలిస్తే అంతాకలిసి నన్ను ముందు హతమార్చండి'' అని ఆక్రోశించారు. కాని అప్పుడు చెలరేగిన హింసా విద్వేషాలలో గాంధీమహాత్ముని ఆర్తనాదం ఎవ్వరికీ వినిపించలేదు. తరువాత ముస్లింలకంటె హిందువులు ఎక్కువగా ఉన్న బీహారులోను, అటుపిమ్మట హిందువులు, సిక్కులకంటె ముస్లింలు ఎక్కువగా ఉన్న పంజాబులోను మత కలహాలు ప్రజ్వలించాయి.

తాము నిజంగా పోరు సాగించవలసింది బ్రిటిషువారితోనని, స్వాతంత్ర్యం సాధించడం తమ ముఖ్యకర్తవ్యమని అప్పటి ఉద్రేకపు మైకంలో భారతీయులు మరచిపోయారు. బదులుగా తమలో తామే కొట్లాడుకోవడం సాగించారు. భారత్ అంతా ఒకటిగా ఉండాలని వాదిస్తున్న వారితో పాకిస్థాన్ కోరుతున్నవారు కలియబడ్డారు. అనేక నెలలు అడ్డూ అపూ లేకుండా దొమ్మీలు సాగాయి. చివరికి బ్రిటిషువారు భారత్ నుంచి తొలగిపోవడానికి నిశ్చయించుకున్నారు. కాని వారు వెళ్లిపోయేటప్పుడు భారత్ ఏక ఖండంగాకాక రెండు రాజ్యాలుగా అవతరించింది. దేశనాయకులు పాకిస్థాన్ నిర్మాణానికి ప్రత్యామ్నాయంలేక అంగీకరించారు. లక్షలాది ప్రజల బలవన్మరణంకంటే దేశాన్ని విభజించుకోవడమే మేలని తలపోశారు.

## మహాపురుషుడు

ఏ దేశం వెళ్లినా, ఎక్కడ కాలుపెట్టినా ఆ దేశంలో నాయకుడై ప్రజలను ముందుకు నడిపించే మహత్వం గాంధీగారిలో ఉంది. ఇంతటి మహాపురుషునిగా ఆయనను దిద్దితీర్చిన సుగుణాలేవి? ఆయన గొప్ప లక్షణాలు - సత్యము, శౌచము, సాహసము, కార్యశూరత. తాను చేయదలచుకున్నది మంచిపని అని గట్టిగా నమ్మినప్పుడు ఆ పని ఎంతకష్టమైనా సరే వెంటనే ఆచరించేవారాయన. గాంధీజీ స్థయిర్య సాహసాలకు హద్దులు లేవు. కర్తవ్యాన్ని బోధించినందువల్ల కాక స్వయంగా దానిని ఆచరించినందువల్లనే గాంధీజీ మహాత్ముడయ్యారు. తాను చేయలేని పనిని ఇతరులు చేయాలని ఆయన ఎప్పుడూ ఆపేక్షించలేదు. ఎప్పుడు ఏమి చేసినా, ఏది చెప్పినా, సత్యము, ప్రేమ, శౌచము ఆయనకు మార్గదర్శాలుగా ఉండేవి.

గాంధీ మహాత్ముని దృష్టిలో సత్యాన్ని మించిన పరమార్థం వేరొకటి లేదు. గాంధీజీ సత్యాన్వేషణ అనంతమైనది. తాను ఇంకా తెలుసుకోవలసిందీ ఇంకా చేయవలసింది, వెనుకటికంటె బాగా చేయదగినదీ ఎంతో ఉందని అభిప్రాయపడేవారు. మహాత్మునికి జీవితమే ఒక ప్రయోగం. కొత్త సత్యాలు తెలుసుకోవడానికి జరిపే అన్వేషణ పేరే ప్రయోగమని మీరు చదువుకొని ఉంటారు. గాంధీ మహాత్ముడు తన ఆత్మకథను వ్రాసుకొని దానికి ''నా సత్యాన్వేషణ'' అని సార్థకమైన పేరుపెట్టారు.

దేశానికి ఇంత సేవ చేసి, ఇన్ని ఘనవిజయాలు సాధించిపెట్టిన ఈ మహాపురుషుడు ఎప్పుడూ నవ్వకుండా గంభీరమైన ముద్రపట్టి ఉంటారు అని మీరు బహుశా అనుకోవచ్చు. కాని నిజానికి గాంధీజీ హాస్యప్రియుడు. గలగలా సెలయేరులా నవ్వేవారు. పిల్లలతో ఆడుకోవడం అంటే ఎంత ఇష్టమో చెప్పలేం. ఎప్పుడూ తనమీద తాను ఛలోక్తులు విసురుకుంటూ ఉండేవారు. చేటలంత చెవులున్నాయని తనకి ''మిక్కీ మౌస్'' అని స్నేహితులొకరు పేరు పెట్టారట. అప్పుడప్పుడీ సంగతి చెప్పి నవ్వుకుంటూ ఉండేవారు. మహాత్ముని మృదువైన కరస్పర్శ రోగులకు, ఆర్తులకు దివ్య ఔషధంగా పనిచేసేది.

ఆస్తిపాస్తులు పోగుచేయడం గాంధీగారికి గిట్టేది కాదు. ఆయనకున్న చరస్థిరాస్తులు అన్ని కలిపి ఒక చిన్న మూటగా కట్టిపెట్టదగినంత కూడా ఉంటాయో ఉండవో! ''ఒక విధంగా చూస్తే మనమంతా దొంగలమే. అప్పటికప్పుడు కావలసినదానికి మించి, ఎక్కువగా ఏమి చేర్చినా ఇతరులనుంచి దొంగతనం చేసినట్లే అవుతుంది'' అనే వారాయన.

దేశంలో ''శరీరదారుఢ్యం కలిగి ఉన్న స్త్రీ పురుషులలోకూడా ఉద్యోగాలు దొరకక, తిండిలేక మాడుతున్న వారు అనేకులున్నారు. ఇలాంటివారు కళ్ళ ఎదుట కనిపిస్తున్నప్పటికీ మనకేమి పట్టనట్లు సుష్ఠుగా మూడు పూటలా తింటూ సుఖంగా నిద్రపోగలుగుతున్నామంటే అందుకు సిగ్గుపడాలి'' అని గాంధీజీ మందలించేవారు. ఎప్పుడూ దీనజనుల సరసన



ఢిల్లీలోని ఎర్రకోటపై తొలిసారిగా భారత జాతీయ పతాకం ఎగురవేశారు

ఉండాలని ఆరాటపడేవారు. రైలులో మూడవ తరగతిలోనే వెళ్లేవారు. బీదా బిక్కీ కాయకష్టం చేస్తున్నట్లుగానే తాను కూడా కాయకష్టం చేయాలని ఆయనకు కోరికగా ఉండేది.

## స్వాతంత్ర్యం

గాంధీజీ అభిలషించినట్లు భారతదేశం స్వతంత్రం అయినప్పటికీ, ఆయన కలలుగన్న భారత్‌కు స్వతంత్ర భారత దేశానికి పోలిక లేకపోయింది. ముస్లింలీగు కోరిక ప్రకారం భారత్‌లో కొంత భాగం పాకిస్థాన్‌గా విడగొట్టబడింది. 1947 ఆగస్టు 14వ అర్ధరాత్రివేళ చివరి వైస్రాయి లార్డ్ లూయీ మౌంట్‌బాటెన్ బ్రిటిషు ప్రభుత్వం తరఫున పరిపాలనాధికారం భారతీయులకు అప్పగింత పెట్టారు. స్వాతంత్ర్యం వచ్చేముందు దేశంలో కల్లోలాలు జరిగి విషాదం అలముకున్నప్పటికీ, ఆయుధ బలంతో కాక సత్యాహింసలతోనే స్వాతంత్ర్యం సంపాదించుకోగలిగామని ముఖ్యంగా గమనించదగింది. ప్రపంచ చరిత్రలోనే ఈ సంఘటన అపూర్వమైనది.

దేశం స్వతంత్రమైననాడు ప్రజలు సంతోషంలో మునిగితేలుతూ ఆటపాటలతో, బాణా సంచా కాల్పులతో పండుగ చేసుకున్నారు. ఆసేతు హిమాచల పర్యంతమూ భారతదేశం కోలహాలంగా పండుగ చేసుకుంటున్న సమయంలో మన స్వాతంత్ర్యప్రదాత గాంధీ మహాత్ముడు దేశం రెండుగా చీలిపోయి, వేలాది ప్రజలు హతులవడం, లక్షలాది మంది నిరాశ్రయులవడం చూసి ఆవేదనతో అలమటించి పోయారు. దేశం స్వాతంత్ర్యోత్సవాలు జరుపుకుంటూన్న తరుణంలో గాంధీజీ రాజధానికి అతి దురాన బెంగాలులో బాధితుల కన్నీరు తుడిచి ఓదారుస్తూ ఉభయమతస్థుల పాపాలకూ పరిహారంగా దైవప్రార్థన, నిరశన వ్రతం ఆరంభించారు.

## బలిదానం

హిందువులను, ముస్లింలను సరిసమానంగా ప్రేమించి ఆదరిస్తున్నందుకు గాంధీ మహాత్ముని మీద కొందరికి పట్టరాని ఆగ్రహం కలిగింది. ఢిల్లీలో దొమ్మీలు ప్రారంభం కాగానే గాంధీజీ నిరశన వ్రతం చేసి శాంతి నెలకొనేట్లు చేశారు. ముస్లింలను ద్వేషిస్తున్న కొందరికి ఇది క్రోధకారణమైంది. గాంధీజీపై పగతీర్చుకోవాలని వారు నిశ్చయించుకున్నారు. ఒక రోజు సాయంత్రం గాంధీజీ ప్రార్థన సమావేశానికి వెళ్లుతుండగా మతోన్మాది ఒకడు ఆయనపై దొంగచాటుగా పిస్తోలు కాల్చాడు. వెంటవెంటనే మళ్లీ రెండుసార్లు కాల్పులు జరిపాడు. ''హేరామ్, హేరామ్'' అంటూ చేతులు మోడ్చి ప్రార్థన చేస్తూ గాంధీజీ నేలకొరిగారు. భారతజాతి యావత్తూ అగాధమైన శోకసాగరంలో మునిగిపోయింది. తండ్రిని

ప్రేమిస్తున్నట్లుగా ప్రేమించే, పెద్ద దిక్కుగా తాము నమ్ముకొన్న పూజ్య బాపూజీ ఇక లేరన్న వార్తను భారతీయులు నమ్మలేకపోయారు.

''మన జీవితాలను వెలిగించిన దివ్యజ్యోతి ఆరిపోయింది. చుట్టూ అంధకారం ఆవరించింది'' అని ప్రధాన మంత్రి జవహర్ లాల్ నెహ్రూ ఆక్రోశించారు. వెంటనే తేరుకొని ఇలా అన్నారు - ''ఇలా అనుకోవడం ఒక విధంగా పొరపాటే. ఎందుకంటే, భారతదేశంలో దేదీప్యమానంగా ప్రకాశించిన ఆ జ్యోతి అఖండమైనది. ఇంకా ఎన్నో సంవత్సరాలు దేశంలో ఆ కాంతి వెలుగుతూనే ఉంటుంది. మరో వెయ్యి సంవత్సరాల తరువాత కూడా ఆ దీప్తి ఇక్కడ ద్యోతకమౌతుంది.''

# స్వాతంత్ర్యం వచ్చిన తొలి సంవత్సరాలు

భారతదేశం స్వతంత్రమైన తొలి రోజులలో పాకిస్థాన్ నుంచి లక్షకొలదీ ప్రజలు నిర్వాసులై వచ్చారు. బంధుమిత్రులను, భూములను, ఇళ్లూ వాకిళ్లూ అన్నీ వదిలిపెట్టి వట్టిచేతులతో పారిపోయివచ్చారు. పాకిస్థాన్ కోసం కలలుగన్న ప్రజలనేతులు భారత్‌ను వదలిపెట్టి పాకిస్థాన్‌లో స్థిరపడడానికని ఇక్కడి నుంచి వెళ్లిపోయారు.

లక్షల సంఖ్యలో శరణార్థులై వచ్చిన ప్రజలకు నిలువనీడ కల్పించడం స్వతంత్రభారత ప్రభుత్వ ప్రథమ కర్తవ్యమైంది. శరణార్థులకు జీవనోపాధి చూపి, తిండీ, వసతి, బట్ట ఇచ్చి ఇక్కడ సరికొత్తగా జీవనం ఆరంభించేందుకు సదుపాయాలు కల్పించవలసివచ్చింది. పాకిస్థాన్‌నుంచి నిర్వాసితులైన వారు వదలిపెట్టివచ్చిన ఆస్తిలో, ముస్లింలు ఇండియాలో వదిలిపెట్టిపోయిన ఆస్తి సగానికి కూడా తక్కువగానే ఉంది. లక్షలాది స్త్రీలు, పురుషులు, శిశువులు వెల్లువవలె వచ్చి పడడంవల్ల దేశం అనేక తీవ్రమైన చిక్కులను ఎదుర్కోవలసి వచ్చింది.

ఇదివరకెప్పుడూ ఏ దేశంలోను ఇంతమంది నిర్వాసులకు ఒక్కసారిగా పునరావాసం కల్పించవలసిన అవసరం కలగలేదు. భారత ప్రభుత్వం ధారావాహికంగా వచ్చిపడుతున్న ఈ శరణార్థులకు ఇళ్లు, వాకిళ్లు, పొలము పుట్రా చూపించి చాలా మందికి జీవిక కల్పించింది. స్వతంత్ర భారత ప్రభుత్వం సాధించిన మహత్తర విజయాలలో శరణార్థులకు పునరావాసం కల్పించడం ప్రథమ గణ్యమైన విజయం.

## సంస్థానాలు

భారత్ స్వతంత్రమైననాడు రాజుల, మహారాజుల పరిపాలనలో దాదాపు 600 సంస్థానాలు ఉండేవి. వీటిలో హైదరాబాదు, కాశ్మీరు వంటి సంస్థానాలు చాలా పెద్దవి. తక్కినవి కొద్ది చదరపు మైళ్లు మాత్రమే విస్తీర్ణం కలిగిన చిన్నచిన్న జమీలు. సంస్థానాధిపతులలో చాలామంది పెద్దపెద్ద భవంతులలో భోగభాగ్యాలనుభవిస్తూ విలాసంగా జీవించడానికి అలవాటుపడినవారు.

కాని వారి ప్రజలకు మాత్రం ముప్పూటలా తినడానికి తిండి కూడా ఉండేది కాదు.

స్వతంత్ర భారతదేశంలో ఇట్టి సంస్థానాలను ఉండనివ్వడం అసంభం. చిన్న చిన్న ముక్కలుగా దేశం చీలి ఉండడం సహింపరానిది. సంస్థానాలను దేశంలో కలిపివేసి వాటిని కూడా ఇతర ప్రాంతాలతో సమానస్థాయికి తెచ్చే బాధ్యతను సర్దార్ వల్లభాయిపటేల్ జయప్రదంగా నిర్వహించారు. గాంధీ మహాత్మునికి సన్నిహితులైన అనుచరులలో పటేల్ ఒకరు. గుజరాత్‌లోని బార్డోలీలో రైతు సత్యాగ్రహం నడిపి పటేల్ గొప్ప పేరు సంపాదించారు. భారత్ స్వతంత్రమైన తరువాత సర్దార్ పటేల్ ఉపప్రధానమంత్రి అయ్యారు.

సంస్థానాలను భారత్‌లో కలిపివేయడం అంటే సంస్థానాధిపతులు తమ విలాస జీవితాన్ని వదులుకోవడం అన్నమాట. వారిలో అనేకమందికి ఈ ప్రతిపాదన సుతరామూ నచ్చలేదు. సర్దార్ పటేల్ నయానా, భయానా నచ్చజెప్పి భారత్‌లో కలిసిపోవడానికి వారిని ఒప్పించారు. సంస్థానాలు కలిసిరాకుండా విడిగా ఉండటం ఎంతమాత్రమూ సాధ్యం కాదని నిష్కర్షగా చెప్పివేశారు. రెండేళ్ళలోపులోనే సంస్థానాలన్నీ స్వతంత్ర భారతదేశంలో కలిసిపోయాయి. కార్పణ్యాలుగానీ, కొట్లాటలుగానీ లేకుండా ఈ పని సాఫీగా జరిగిపోయింది.

# నేటి భారతదేశం

స్వాతంత్ర్యం లభించిన కొద్దికాలానికే మనమొక రాజ్యాంగం రూపొందించుకున్నాం. దేశంలో ప్రతి పౌరునికీ ఏ ప్రాథమిక హక్కులు, స్వాతంత్ర్యాలు ఇవ్వదగి ఉన్నవో ఆ హక్కులన్నీ రాజ్యాంగంలో నిర్వచించబడ్డాయి. దేశాన్ని ఏవిధంగా పాలించాలో ఇందులో నిర్దేశించారు. ఈవిధంగా వ్రాసుకొన్న మనకొత్త రాజ్యాంగం 1950 జనవరి 26వతేదీన అమలులోకి వచ్చింది. ఏటా ఈ తారీఖునాడే మన దేశంలో రిపబ్లిక్ దినోత్సవాలు జరుపుకుంటున్నాం.

ఈ రాజ్యాంగం కింద దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఏర్పాటైంది. అంటే ప్రజలే తమ ప్రతినిధులను ఎన్నుకొంటారు. ఎన్నుకోబడిన ప్రతినిధులు పార్లమెంటులో సమావేశమై, దేశ శ్రేయస్సుకు అభివృద్ధికి అవసరమైన శాసనాలను రూపొందిస్తూ ఉంటారు. చిరకాలంగా రాజుల, విదేశీయుల నిరంకుశ పరిపాలనలో మగ్గిన భారతదేశానికి కొత్త రాజ్యాంగం గొప్ప వరప్రసాదమైంది. ప్రజలు ఇప్పుడు తమ రాష్ట్రపతిని తామే ఎన్నుకొంటారు. స్వతంత్ర భారతదేశపు తొలి రాష్ట్రపతిగా డాక్టర్ రాజేంద్రప్రసాద్ ఎన్నికయ్యారు. తరువాత రాష్ట్రపతిగా డాక్టర్ ఎస్. రాధాకృష్ణన్ ఎన్నికయ్యారు.

మనకు ఇప్పుడు ఒక కేంద్రప్రభుత్వం, పార్లమెంటుకు బాధ్యత వహించే ప్రధానమంత్రి ఉన్నారు. అంతేకాక ప్రతిరాష్ట్రానికీ ప్రత్యేకంగా ఒక ప్రభుత్వము, గవర్నరు, ముఖ్యమంత్రి ఒక చిన్న పార్లమెంటు వంటి శాసనసభ ఉన్నాయి.

18 ఏళ్లు దాటిన ప్రతి వ్యక్తికీ ఎన్నికలలో ఓటుచేసే హక్కు ఉంది. అంటే పార్లమెంటును, ప్రభుత్వాన్ని ఎన్నుకోవడంలో ప్రతి పౌరుడికీ పాత్ర ఉన్నదన్నమాట. ఎన్నికలు సాధారణంగా 5 ఏళ్ళకు ఒకసారి జరుగుతూ ఉంటాయి. మనదేశంలో ఇంతవరకూ సాధారణ ఎన్నికలు పదమూడుసార్లు జరిగాయి. ప్రపంచంలో ఏ ప్రజాస్వామ్య దేశంలోను ఇందరు ప్రజలు ఎన్నికలలో పాల్గొనడం జరగదు. అందువల్లనే భారత్‌కు ప్రపంచంలోకెల్లా అతి పెద్ద ప్రజాస్వామ్య దేశం అనే పేరువచ్చింది.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత జవహర్ లాల్ నెహ్రూ పదిహేడేళ్ళపాటు ప్రధానమంత్రిగా ఉన్నారు. గాంధీజీ ఆయనను స్వంత కుమారునివలె ప్రేమించేవారు. దేశం కోసం ఉరికంబం ఎక్కడానికైనా వెనుదీయని వీరుడని గాంధీజీ ఆయనను ప్రశంసించారు. జవహర్ లాల్ నెహ్రూ శ్రీమంతుల కుటుంబంలో పుట్టారు. ఇంగ్లండులో అత్యుత్తమ పాఠశాలల్లో విద్యాభ్యాసం చేశారు. తండ్రి మోతీలాల్ నెహ్రూ పేరుపడ్డ న్యాయవాది. తండ్రిగారితో కలిసి ప్లీడరుగా పనిచేయవచ్చునని, జవహర్ లాల్ నెహ్రూ కూడా న్యాయశాస్త్రమే చదువుకున్నారు. గాంధీ మహాత్ముడు భారత్‌కు తిరిగివచ్చి ప్రజలు తమ హక్కుల కోసం తమ సర్వసర్వమూ ఒడ్డి పోరాడాలని సందేశం ఇచ్చిన రోజుల్లో జవహర్ లాల్ నెహ్రూ ఇంకా యువకుడే. జాతిపిత పిలుపువిని జవహర్ లాల్ నెహ్రూ, మోతీలాల్ లాభదయకమైన న్యాయవాద వృత్తి వదులుకొని, భోగభాగ్యాలు కాలదన్ని గాంధీ మహాత్ముని అడుగుజాడలలో నడిచారు.

జవహర్‌లాల్ అనేక సంవత్సరాలు ఖైదులో ఒంటరిగా జీవించవలసి వచ్చింది. గ్రంథ పఠనంతోనూ, రచనలు చేస్తూనూ జైలులో కాలక్షేపం చేసేవారు. తన జీవితం గురించి, స్వాతంత్ర్య ఉద్యమం గురించి ఆయన వ్రాసుకొన్న ఆత్మకథ కారాగారంలో ఉండగా వ్రాసినదే. జైలునుంచి ఆయన తన కుమార్తెకు వ్రాసిన ఉత్తరాలే 'గ్లింప్సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ' అనే పుస్తకంగా సంకలితమైంది. నెహ్రూ వ్రాసిన మరొక ప్రసిద్ధమైన గ్రంథం "ది డిస్కవరీ ఆఫ్ ఇండియా."

నెహ్రూ 1964లో పరమపదించారు. ఈ దేశ ప్రజల కోసం కొండంత మేలు చేసిన మహావ్యక్తిగా దేశప్రగతి కోసం అనంతమైన సేవ చేసిన వానిగా ఈ నాటికీ మనం ఆయనను మననం చేసుకుంటూంటాం. మహాత్మాగాంధీలా నెహ్రూ కూడా దేశం పరాయి పాలన నుంచి విముక్తి పొందటం చాలదని విశ్వసించేవారు. దేశాభ్యున్నతికి తమ వంతు బాధ్యతను నిర్వర్తించేందుకు ప్రజలు పేదరికం నుంచి విముక్తి పొందాలని నెహ్రూ భావించేవారు. అయితే ఇది అంత తేలిక కాదు. చిరకాలంగా నిర్లక్ష్యానికి గురయినందువల్ల దేశం బక్కచిక్కిపోయింది. అందువల్ల దేశంలో వస్తూత్పత్తిని పెంచడమేకాక, వాటిని కొనుగోలు చేసేందుకు ప్రజల చేతులలో డబ్బు ఆడుతుండేలా చూడటం చాలా ముఖ్యం. అంటే దారిద్ర్యంలోకి కూరుకుపోయిన దేశాన్ని పైకి లాగేందుకు అవసరమైన పథకాన్ని రూపొందించాలన్నమాట.

స్వాతంత్ర్యం రావడానికి చాలాకాలం ముందుగానే, జవహర్‌లాల్ నెహ్రూ, మరికొందరు మేధావులు కలిసి దేశ అవసరాలేమిటి, వాటిని తీర్చడం ఎలా అనే విషయం ఆలోచించారు. స్వాతంత్ర్యం వచ్చినందువల్ల ఈ లక్ష్యం సాధించడం సహజంగానే కొంతవరకూ సుగమమైంది. మొదట శరణార్థులకు పునరావాసం కల్పించడం, సంస్థానాలను భారత్‌లో విలీనం చేయడం, ఒక స్వంత రాజ్యాంగాన్ని రచించుకోవడం వంటి పనులు పూర్తి చేసుకున్నాం. ఆ తరువాత ప్రజలకు అందరికీ సరిపడగా ఆహారపదార్థాలను, సరకు సామగ్రులను ఉత్పత్తి చేయడానికి పూనుకున్నాం. ఇందుకోసం ప్రణాళికా సంఘం ఒకటి ఏర్పాటు అయింది. తరువాత అయిదేళ్ళలో సాధించవలసిన లక్ష్యాలేమిటో సూచిస్తూ ఈ సంఘం ఒక ప్రణాళిక ముసాయిదా తయారుచేసింది. ప్రజలందరూ దీనిపై క్షుణ్ణంగా చర్చించినమీదట, తగు మార్పు చేర్పులతో ప్రణాళికను నికరపరిచారు.

ఇంతవరకు ఎనిమిది పంచవర్ష ప్రణాళికలు అమలు చేసాం. ఈ ప్రణాళికల కాలంలో ఎంతో ప్రగతి సాధించాం. మొదట ప్రణాళిక కాలంలో నదులపై అనేక ఆనకట్టలు నిర్మించాం. భాక్రా, తుంగభద్ర, హీరాకుడ్ వంటివి వీటిలో కొన్ని. ఆనకట్టలు కట్టడం వల్ల అదనంగా అనేక భూములకు సేద్యపునీటి సౌకర్యం కలిగింది. విద్యుచ్ఛక్తి అధికంగా ఉత్పత్తి అవుతోంది.

రెండో ప్రణాళికలో దేశంలో అనేక భారీ కర్మాగారాలు నెలకొన్నాయి. భిలాయ్, దుర్గాపూర్, రౌర్కేలా ఉక్కు కర్మాగారాలు వీటిలో ముఖ్యమైనవి.

దేశంలో అధిక ఆహారోత్పత్తి సాధించేందుకు, దైనందిన జీవితంలో ప్రజలకు అవసరమైన వస్తువులను ఉత్పత్తి చేసేందుకు మూడో ప్రణాళికలో కృషి జరిగింది.

అధిక ఆహారోత్పత్తి కృషిని ముమ్మరం చేసేందుకు నాలుగో ప్రణాళికలో అనేక ఎరువుల కర్మాగారాలను నెలకొల్పుకున్నాం. గోరఖ్‌పూర్, నామ్‌రూప్, కోటా, కొచ్చిన్, మద్రాసులలో భారీ ఎరువుల కర్మాగారాలు వెలిశాయి. మద్రాసు, హాల్దియా, తదితర ప్రదేశాలలో భారీ చమురుశుద్ధి కర్మాగారాలు అవతరించాయి.

అయిదో ప్రణాళికా కాలంలో ప్రపంచంలో చమురు సంక్షోభం సంభవించింది. మన అవసరాలు తీర్చుకునేందుకు ఇతర దేశాలనుంచి చమురు కొనుగోలు చేసేందుకు మనం అధిక మూల్యం చెల్లించవలసి వచ్చింది. అందువల్ల అయిదో పంచవర్ష ప్రణాళికా కాలంలో బొంబాయి దగ్గర సముద్రంలోంచి చమురు తవ్వి తీసేందుకు తొలిసారిగా యత్నించాం.

మీరు అక్కడకు వెళ్ళారంటే, భారీ చమురు తవ్వక యంత్రాలను కనులారా చూస్తారు. సాగరసామ్రాట్ అనే పేరుగల నౌకలో అదునాతన చమురు తవ్వక యంత్రాలు అమర్చి ఉన్నాయి.

పేద ప్రజల జీవన ప్రమాణాలను మెరుగుపరచేందుకు మన ప్రజలకు అవసరమైన వస్తుసామాగ్రి కోసం ఇతర దేశాలపై ఆధారపడకుండా స్వయంసమృద్ధి సాధించేందుకు ఆరో ప్రణాళికా కాలంలో కృషి జరిగింది.

ఎనిమిదో ప్రణాళికలో జనాభా పెరుగుదలను అరికట్టటం, అధికంగా ఉపాధి అవకాశాలు కల్పించటం, ఇంకా ముఖ్యంగా దేశ ఆర్థిక వ్యవస్థను ఇతర దేశాలలో పోటీ పడేంతగా పరిపుష్టం చేయటం ప్రధాన లక్ష్యాలు.

1979లో భాస్కర ఉపగ్రహ ప్రయోగం, 1981లో రోహిణి ఉపగ్రహ ప్రయోగం అదే సంవత్సరంలో ఎరియేన్ పాసెంజర్ పేలోడ్ ఉపగ్రహ ప్రయోగం, 1982లో ఇండియన్ నేషనల్ శాటిలైట్ ప్రయోగం వంటివి శాస్త్ర సాంకేతిక రంగంలో సాధించిన కొన్ని విజయాలు.

సుమారు రెండు శతాబ్దాలపాటు వెనుకబడిన మన పేద దేశాన్ని ప్రపంచంలోని పెద్దరాజ్యాలేవీ ఏమాత్రమూ సరకు చేయకుండా ఉపేక్షిస్తూ వచ్చాయి. భారత్ నేటికీ అనేకరంగాలలో వెనుకబడే ఉంది. కానీ భారతజాతి అంటే ఇతర దేశాలకు ఈనాడు ఎంతో గౌరవభావం ఏర్పడింది. దీనికి ప్రధానంగా మన జవహర్ లాల్ నెహ్రూ కృషే కారణం. బ్రిటిష పరిపాలననుంచి భారత్‌ను విడిపించడానికి ఉద్యమం సాగిస్తున్న కాలంలోనే, ఆసియా, ఆఫ్రికా ఖండాలలో పాశ్చాత్య రాజ్యాల పీడనకు గురియైన ఇతర వెనుకబడ్డ దేశాలను గురించి ఎప్పుడూ ఆయన ఆలోచిస్తూ ఉండేవారు. ఆ దేశాలకు స్వాతంత్ర్య సంపాదనలోను అనేక ఇతర విధాల న్యాయాన్ని చేకూర్చడంలోను భారత్ బాగా సహాయపడింది. దక్షిణాఫ్రికాలోని అల్పసంఖ్యాక శ్వేతజాతీయులు, స్థానిక నల్లజాతివారిని అణచివేస్తూంటే వారి పక్షాన పోరాడిన నెల్సన్ మండేలాకు మన ప్రభుత్వం అండగా నిలిచింది. ప్రపంచం అంతటా శాంతి నెలకొంటేనే తప్ప మానవజాతికి అభివృద్ధి, సౌఖ్యము లభించవు. బుద్ధుడు, గాంధీ వంటి ప్రపంచమహాపురుషుల బోధనలను అనుసరిస్తూ మానవజాతి సహనాన్ని, సఖ్యతను చూపడం నేర్చుకొన్నప్పుడే ప్రపంచంలో శాంతి నెలకొని సర్వత్రా అభివృద్ధి సాధ్యమౌతుందని భారతజాతి విశ్వాసం.

ఇక మనం ఎత్తుకున్న జాతీయగాథను ఇంతటితో ముగిద్దాం. కాని నిజానికి భారతదేశ చరిత్రకు అంతమనేది లేదు. భూగోళం ఉన్నంతవరకూ మన జాతి చరిత్ర ఒక అంతులేని స్రవంతిగా సాగిపోతూనే ఉంటుంది. మీరంతా పెద్దవారయాక మీకు కలిగేబిడ్డలు, మీ మనుమలు, మునిమనుమలు ఇంకా ఆ తరువాతి తరాలవారు ఈ కథను ఇట్లాగే అనంతంగా వింటూ ఉంటారు.

# చరిత్రలో తారీకుల అవసరం

మీరింతవరకూ చదివిన దేశచరిత్ర చాలా సుదీర్ఘమైంది. ఇందులో అనేక సంఘటనలను, విప్లవాలను పేర్కొనడం జరిగింది. అయితే ఈ సంఘటనలలో ఏది ఎప్పుడు జరిగిందో, మీకు తెలుసా? ఉదాహరణకు అశోకచక్రవర్తి పట్టాభిషేకం ఎప్పుడు జరిగిందో చెప్పండి? మీ తల్లిదండ్రులను గానీ, మీ టీచరునుగానీ అడిగితే పుస్తకం చూసి ఏతారీకున అశోకునికి పట్టాభిషేకం జరిగిందో చెబుతారు. మామూలుగా చరిత్ర పుస్తకాలలో ఎక్కడ చూసినా కనుపించేవి ఈ తేదీలే. అయితే తేదీలకు అర్థం ఏమిటో తెలియక మీరు తికమకపడవచ్చు.

కాలం తుదిమొదళ్లు లేని ఒక పెద్ద రేఖలాంటిది. అది ఎక్కడ మొదలైందో, ఎక్కడ అంతమౌతుందో ఊహించలేము. ఏదైనా ఒక తారీకు ఉందంటే, దానిని ఈకాలరేఖలో ఒక బిందువుగా ఊహించుకోవచ్చు. ఉత్తరం వ్రాసేటప్పుడు ముందు తేదీ రాస్తాం. ఏ సంవత్సరంలో, ఏనెలలో, ఏరోజున ఆ ఉత్తరం వ్రాసిందీ, ఉత్తరం మీద ఉన్న తారీకును బట్టి చెప్పవచ్చు. ఉత్తరం చదువుకునే వ్యక్తి నువ్వది ఎప్పుడు వ్రాశావో ఎన్నాళ్ల తర్వాత తనకు అది అందిందో ఆ తారీకును బట్టి తెలుసుకోగలడు. కాగా ఈ పుస్తకం చివరలో ఇచ్చిన తారీకులన్నీ బండలెక్కన సంవత్సరాలే గాని, నెలలకు, రోజలకు ప్రాముఖ్యం ఇవ్వలేదు.

మీకందరికీ ఓ పుట్టిన తేదీ అంటూ ఉంటుంది. నీవు పుట్టిన సంవత్సరం 1982 అనుకుంటే, 1997 నాటికి నీ వయస్సు 15ఏళ్లని వెంటనే తెలుస్తుంది. ఎందుకంటే నీవు పుట్టిన తేదీ తరువాత 1997 నాటికి 15 సంవత్సరాలు గడిచాయి.

ఇప్పుడు 1982 అనుకుంటే అర్థం ఏమిటి? క్రీస్తు పుట్టిన తరువాత పందొమ్మిది వందల ఎనభైరెండు సంవత్సరాలకు మీరు పుట్టారని చెప్పవచ్చు. చరిత్ర పుస్తకాలలో తరచుగా అంతెలకుముందు క్రీ. పూ. అనీ, క్రీ. శ. అనీ వ్రాసి ఉంటుంది. క్రీ. పూ. అంటే క్రీస్తు పుట్టటానికి పూర్వం అని అర్థం. అలాగే క్రీ. శ. అంటే క్రీస్తు శకం లేదా క్రీస్తు పుట్టిన అనంతరం అని అర్థం. దీనిని బట్టి క్రీ. శ. 5 నాటికి క్రీస్తు వయస్సు అయిదు ఏళ్లని తెలుస్తూనే ఉంది గదా!

క్రీ. పూ. 326లో అలెగ్జాండరు భారత్ వచ్చాడంటే 1997 నాటికది సరిగా ఎన్ని సంవత్సరాల క్రిందట జరిగిందో చెప్పగలరా? ఇప్పుడు 1997 సంవత్సరాలు వెనుకకు పోదాం. అప్పుడు ముందుగా క్రీస్తు పుట్టిన కాలం చేరతారు. 1997 సంవత్సరాలకు కూడా ఇంకా 326 ఏళ్ల వెనుక ఆ సంఘటన జరిగింది కదా! అంటే 1997 + 326 ఏళ్ల క్రిందట అలెగ్జాండరు భారత్ వచ్చాడు. మీలో ఎవరైనా ఈ కూడిక సులువుగానే చేయగలరు. 2323 ఏళ్ళ క్రిందట కాదూ అలెగ్జాండరు వచ్చింది!

చరిత్రలో ఇచ్చే తారీకులను బట్టీ పట్టడం ఎందుకని మీకు చికాకు కలుగుతుందేమో. కానీ తేదీలు గుర్తుంటే చాలా గమ్మతయిన సంగతులు తెలుస్తాయి. అనేక వింతవింత విషయాలను వీటిని బట్టి ఊహించుకోవచ్చు. మీరంతా ఝాన్సీరాణీని గురించి చదివారు. క్రీ. శ. 1858లో ఈమె యుద్ధం చేస్తూ మరణించింది. ఆమె పుట్టిన తేదీ ఏదో మీకు తెలిస్తేనే గదా, చనిపోయేనాటికి ఆమె వయస్సు ఎంతో లెక్కకట్టకలిగేది. లక్ష్మీబాయి క్రీ. శ. 1835లో పుట్టిందని గుర్తుంటే చనిపోయేనాటికి ఆమె వయస్సు 23 ఏళ్లని ఇట్టే లెక్కవేసుకోవచ్చు. ఝాన్సీరాణి చనిపోవడానికి ముందు మీ ముత్తాతగారు పుట్టారో లేదో మీకు తెలుసా? తెలియకపోతే ఆయన ఏ తారీకున పుట్టింది మీ నాన్నగారిని అడిగి తెలుసుకొని ఆ తారీకునుబట్టి మీ ముత్తాత అప్పటికి చిన్నారి బాలుడో లేక అసలు పుట్టారో లేదో తెలుసుకోవచ్చు.

ఒక చారిత్రిక వ్యక్తి లేదా ఒక ప్రధానమైన సంఘటనను దృష్టిలో పెట్టుకొని చరిత్రలో మిగతా సంఘటనలకు తారీకులను నిర్ణయిస్తారు. పాశ్చాత్య దేశాలలో ఏసుక్రీస్తు పుట్టినరోజు నుంచే తరువాత జరిగిన సంఘటనలన్నిటికీ తారీకులను నిర్ణయించడం జరుగుతోంది. పాశ్చాత్యుల పంచాంగానికి క్రీస్తు శక పంచాంగం అని పేరు. ప్రపంచంలో అనేక ప్రాంతాలలో ఇప్పుడు ఈ శకాన్నే తారీకుల నిర్ణయంలో ఉపయోగిస్తున్నారు. బ్రిటిషువారు భారత్‌లో కూడా ఈ పద్ధతినే ప్రవేశపెట్టారు. దానినే ఇప్పటికీ మనం వాడుతున్నాం.

భారతదేశంలో అనాది నుంచి రకరకాల పంచాంగాలు వాడుకలో ఉన్నాయి. విక్రమ, కల్ప, కలియుగ పంచాంగాలు వీటిలో కొన్ని. ఇవిగాక మనదేశంలో ఇంకా అనేక పంచాంగాలున్నాయి. అన్నీ కలిపి 30కిపైగా పంచాంగాలు దేశంలో నేటికీ వాడుకలో ఉన్నట్లు తెలుస్తోంది. ఇన్నేసి పంచాంగాలుండటంవల్ల, అప్పుడప్పుడు ఒకే పండుగ వేర్వేరు

ఉన్నట్లు తెలుస్తోంది. ఇన్నేసి పంచాంగాలుండటంవల్ల, అప్పుడప్పుడు ఒకే పండుగ వేర్వేరు పంచాంగాల ప్రకారం వేరువేరు రోజులలో వచ్చి తికమకలు కలుగుతున్నాయి. అందువల్ల దేశమంతటికీ కలిపి ఒకే పంచాంగాన్ని వాడుకలోకి తేవాలని దేశంలో అభిప్రాయం కలిగింది. కొన్ని సంవత్సరాల క్రిందట ప్రభుత్వం ఈ విషయాన్ని పరిశీలించి 'శక' పంచాంగాన్ని వాడుకలోకి తేవడానికి నిశ్చయించింది. ఈ పంచాంగం అతి ప్రాచీనమైనదే కాక శాస్త్రీయమైన పద్ధతిలో తయారుచేసినట్టిది. ప్రాచీన శక తెగకు చెందిన ఒక రాజు ఈ పంచాంగాన్ని ప్రారంభించాడు. క్రీ. శ. 1996 ఆగస్టు 14వ తేదీ శక పంచాంగం ప్రకారం 1918 శ్రావణ 24 అవుతుంది.

అనేక మహమ్మదీయ దేశాలలో మరోవిధమైన ముఖ్యమైన పంచాంగం వాడుకలో ఉంది. దీనిని 'హిజ్రా' పంచాంగం అంటారు. మహమ్మదు ప్రవక్త మక్కానుంచి మదీనాకు ప్రయాణం చేసిన ముఖ్య సంఘటనను ఆధారంగా చేసికొని ఈ పంచాంగంలో తేదీల నిర్ణయం జరుగుతుంది.

తారీకులంటే గడబిడపోయి అవి ఏమిటో కొంతవరకు ఇప్పుడు అర్థం చేసుకోగలిగారు కనుక, మీరు చదివిన భారతదేశ చరిత్రలో కొన్ని ముఖ్యమైన సంఘటనుల ఏయే తారీకుల్లో జరిగాయో కూడా తెలుసుకుందామని కుతుహాలం కలిగి ఉండవచ్చు.

# కాలరేఖ

ఈ పుటకు పక్కన ఉన్న పటం విప్పి చూడండి. కాలగతిని సుదీర్ఘమైన సరళ రేఖగా ఊహించి తయారుచేసిన పటమిది. మన చరిత్రలో జరిగిన ముఖ్య సంఘటనలను, అవతరించిన మహాపురుషుల పూర్వాపరక్రమాన్ని ఈ రేఖను బట్టి తెలుసుకోవచ్చు.

ఈ పటంలో చాలా బొమ్మలు ఉన్నాయి. వీటి అర్థం ఏమిటో తెలుసుకోవాలంటే ఒక్కొక్క బొమ్మకింద ఉన్న అంకె చూసుకొని, పుస్తకం చివరలో ఇచ్చిన తేదీల జాబితాలో ఆ అంకె ఎక్కడ ఉన్నదో వెతకండి. చరిత్రలో ఏ సంఘటనకు గుర్తుగా ఆ బొమ్మ వేయబడింది, ఆ సంఘటన క్రైస్తవ పంచాంగం ప్రకారం ఏ తేదీన జరిగిందీ ఆ తేదీల జాబితానుబట్టి మీరు తెలుసుకోవచ్చు. జాబితాలో ఇచ్చిన తేదీలన్నీ వెంటనే మీరు కంఠతా పట్టనవసరం లేదు. అప్పుడప్పుడూ, ఈ పటము, ఆ జాబితా కలిపి చూసుకుంటూ ఉంటే మన దేశ చరిత్ర మనసుకు గట్టిగా పట్టి చక్కగా ఆకళింపు అవుతుంది.

పటంలో మొదట చూపిన బొమ్మ ఆర్యులది. క్రీస్తు పుట్టడానికి కొన్ని వేల ఏళ్లకు పూర్వమే భారత్‌లోకి ఆర్యులు రావడం మొదలైనప్పటికీ పటంలో క్రీస్తు బొమ్మకు ఎడమవైపుగా కొద్ది అంగుళాల దూరంలోనే ఆర్యుల బొమ్మ కూడా వేయబడింది. ఒక బొమ్మకూ ఇంకొక బొమ్మకూ మధ్య దూరంగూడా కాలప్రమాణాన్నిబట్టే ఖచ్చితంగా ఉండాలనేట్లయితే అప్పుడీపటం ఇంతకన్నా ఎన్నో రెట్లు పెద్దది చేయవలసి ఉంటుంది. ఇలాగే ఆర్యులు రావడానికి 1000 ఏళ్లు ముందే సింధులోయ ప్రజలు, వారికి ఇంకా కొన్ని వేల ఏళ్లకు పూర్వం మరికొందరు ప్రజలు మనదేశంలో నివసిస్తూ ఉండేవారు. వీరి తాలూకు బొమ్మలను కూడా కాలరేఖ పటంలో ఈ ప్రకారమే చేర్చాలంటే పటాన్ని ఎడమవైపునకు బాగా కొన్ని మూరల దూరం పొడిగించవలసి ఉంటుంది.

పుస్తకం చివర జాబితాలో ఇచ్చిన తేదీలతో పాటు, వయస్కులైన వారంతా తెలుసుకోవలసిన ముఖ్యమైన తేదీలు ఇంకా ఎన్నో ఉన్నాయి. మీరు ఇంకా కొంచెం పెద్దవారయాక భారతదేశ చరిత్రను మరింత విపులంగా చదువుకొని ఆ వివరాలన్ని తెలుసుకోవచ్చు.

17. తాజ్‌మహల్ నిర్మాణ ప్రారంభం క్రీ.శ. 1632

18. ప్లాసీ యుద్ధం క్రీ.శ. 1757

19. టిప్పు సుల్తాన్ బ్రిటిషువారితో జరిపిన చివరి యుద్ధం క్రీ.శ. 1799

20. రాజా రామ మోహన రాయ్ కాలధర్మం క్రీ.శ. 1833

21. బ్రిటిషువారిపై తిరుగుబాటు క్రీ.శ. 1857

22. మహాత్మా గాంధీచే సహాయ నిరాకరణోద్యమం ప్రారంభం క్రీ.శ. 1920

23. స్వాతంత్ర్యసిద్ధి క్రీ.శ. 1947

24. భారత రిపబ్లిక్ అవతరణ క్రీ.శ. 1950

# భారత దేశ చరిత్రలో ముఖ్య ఘట్టాలు

| | | |
|---|---|---|
| 1. | భారత్‌కు ఆర్యుల రాక | సుమారు క్రీ.పూ. 2500 |
| 2. | గౌతమ బుద్ధుని జననం | సుమారు క్రీ.పూ. 623 |
| 3. | అశోకుని పరిపాలన ఆరంభం | క్రీ.పూ. 273 |
| 4. | ఏసుక్రీస్తు జననం | క్రీస్తు శకారంభం |
| 5. | సముద్రగుప్తుని పట్టాభిషేకం | సుమారు క్రీ.శ. 320 |
| 6. | హర్షవర్ధనుడు యువాన్ చ్వాంగ్‌ను కలుసుకున్న సంవత్సరం | క్రీ.శ. 643 |
| 7. | పల్లవరాజు నరసింహవర్మన్ మహామల్ల మహాబలిపురం వద్ద గండ శిలలతో అలయాలను తొలిపించడానికి పూనుకున్న కాలం | సుమారు క్రీ.శ. 642 |
| 8. | అల్లా ఉద్దీన్ ఖిల్జీ ఢిల్లీ సుల్తాన్ అయిన సంవత్సరం | క్రీ.శ.1296 |
| 9. | భక్త కబీరు జననం | సమారు క్రీ.శ. 1488 |
| 10. | వాస్కోడాగామా కాలికట్ చేరుకున్న సంవత్సరం | క్రీ.శ. 1498 |
| 11. | కృష్ణదేవరాయలు సింహాసనం అధిష్ఠించిన సంవత్సరం | క్రీ.శ.1509 |
| 12. | తులసీదాసు జననం | క్రీ.శ. 1532 |
| 13. | అక్బరు ''దిన్-ఇ-ఇలాహి'' అనే కొత్త మతాన్ని ప్రారంభించిన సంవత్సరం | క్రీ.శ. 1582 |
| 14. | జహంగీరుకు నూర్జహానుతో వివాహం | క్రీ.శ. 1611 |
| 15. | సర్ థామస్‌రో జహంగీరును దర్శించిన సంవత్సరం | క్రీ.శ. 1615 |
| 16. | శివాజీ జననం | క్రీ.శ. 1627 |



Children's History of India

The book is a brief introduction to Indian History for the children written in simple language. The aim of the book is primarily to generate interest in the child on the study of history than to present an array of facts. To achieve this objective, emphasis has been given on the narration and no dates have been used, although a sequence of events has been maintained through out the book.



PUBLICATIONS DIVISION
MINISTRY OF INFORMATION & BROADCASTING
GOVERNMENT OF INDIA

ISBN : 81-230-0934-8

Price Rs : 146.00

